# చతుర కతలు

## 'స్పందన-ప్రతిస్పందన'

వెంకట్రామయ్య ఆరోజు ఉదయం కాఫీ సేవిస్తూ దినపత్రిక చూస్తున్నాడు.

'సంపాదకీయం', 'కబుర్లు' చూశాక పాఠకుల లేఖలు శీర్షిక కింద ప్రచురించబడిన ఒక లేఖ చదివి, లేఖకుని పేరు చూశాక ఉబ్బి తబ్బిబ్బయిపోయాడు. వెంటనే కార్డ్‌లెస్ తీసుకుని నంబర్లు నొక్కాడు. అవతల



నుంచి 'హలో! మురళి హియర్' అని వినబడింది గొంతు!

"అల్లుడూ! నీ లేఖ చూశాను, ఈరోజు దినపత్రికలో. సిగ్గుండాలిరా. అదే ఆ యం.సి.హెచ్ వాళ్ళ గురించే నేనంటూంట. కళ్ళున్నాచూడలేని, కాళ్ళున్నా నడవలేని, వనరులున్నా ఉపయోగించుకోలేని వాళ్లంటూ మొట్టికాయలు బాగా వేశావురా. నీ లేఖచూసి అయినా వాళ్ళు రోడ్ల మరమ్మతులు చేపడతారు. చిన్నప్పుడు నేనూ చదువుకునే రోజుల్లో అక్రమాలనేవి ప్రజల్లోకాని, ప్రభుత్వ యంత్రాంగంలో కానీ ఎక్కడ కనిపించినా పత్రికలకు లేఖలు రాసి ఏకి పారేసేవాడ్ని. నా పోలికలు, గుణాలు, ప్రతిభ బాగా అబ్బాయిరా నీకు అల్లుడూ! ఇలాగే అసంఖ్యాకంగా ఉత్తరాలు, పరిశోధక వ్యాసాలు రాసి నువు గిన్నిస్ రికార్డ్ బుక్‌లోకి ఎక్కాలిరా ఏదో ఒకరోజు"

"అలాగే కృషిచేస్తాను. మామయ్యా! ప్రస్తుతం ఓ ఘాటైన వ్యాసం తయారుచేస్తున్నాను. ఐయాం ఇన్ హర్రీ"

"ఊఁ! ఊఁ! కానీయ్, ఆల్ది బెస్ట్"

"అల్లుడూ! ఏవిటిదంతా! నువు నర్సింగ్ హోంలో అడ్మిట్ అయ్యావని మీ డాడ్ ఫోన్ చేస్తే ఇలా పరిగెట్టుకొచ్చాను. హౌ ఆర్యూ ఫీలింగ్ నౌ? "

ఓ వారంరోజులయ్యాక ఒళ్ళంతా బ్యాండేజ్ క్లాత్‌తో కట్టిన కట్లతో అతి దీన స్థితిలో బెడ్‌పై పడుకునున్న మురళిని పరామర్శించాడు వెంకట్రామయ్య!

ఆ ప్రశ్నకు మురళి 'డాడ్' ముకుందం



చతుర... 3

జవాబు చెప్పాడు.

"ఏంలేదు బావా! మీరు స్పందిస్తే మేము ప్రతిస్పందిస్తాం అంటూ ప్రభుత్వ అధికారులలో ఎవరైనా అక్రమాలకు, అవినీతికి పాల్పడి నట్లయితే ఆ వివరాలు తమ దృష్టికి తీసుకురావల్సిందిగా నేరపరిశోధక శాఖవారు ఒక ప్రకటన విడుదలచేశారట టి.విలో..." అంటూ చెప్పుకుపోయే ముకుందంగారి మాటలు పూర్తికాకుండానే-

"ఓహో! అదిచూసి మనవాడు అతిగా స్పందించి ఉంటాడు మరి. ఎక్కడే అన్యాయం జరిగినా ఊరుకోడుకదా మరి". అది వెంకట్రామయ్య కామెంట్.

"ఎవరో ఆఫీసర్ గడ్డి తిన్నాట్ట. మనవాడా విషయం పసిగట్టి, ఆ గడ్డి తిన్న సీనుకి ఆధారాలు సంపాదించి, పైఅధికారులకి రిపోర్టు పంపించాడు. వీడిచ్చిన ఇన్‌ఫర్‌మేషన్ చూసి, పైఅధికార్లు ప్రతిస్పందించటం అనే విషయం అలా ఉంచు. ఆ గడ్డి తిన్న అధికారి ఎవరో మంత్రిగారి చుట్టంట. ఆ మంత్రిగారు బంధువుపై వచ్చిన అభియోగంచూసి, ఫైరయిపోయి పైఅధికారులకంటే ముందు ప్రతిస్పందించారు. ఫలితం ఇదిగో ఇదే" అంటూ హాస్పిటల్ బెడ్‌పై పడుకుని మూలుగుతున్న తన కుమారరత్నం మురళి వేపు చూపించాడు ముకుందం.

"ఇంకా నయం. ఆ మంత్రిగారెవరో చాలా స్వల్పంగా ప్రతిస్పందించారు. లేకుంటే మనవాడు పత్రికలకు వ్యాసాలు రాసుకుందికి చేతులు, నడవటానికి కాళ్ళూ లేక మిగిలిపోయేవాడు" అంటూ మురళి వేపు తిరిగి- "ప్రకటనలు చూసి మనం అతిగా స్పందిస్తే దానికి రియాక్షన్ ఇలాగే ఉంటుంది మురళీ? జర్నలిజం అంటే మాటలుకాదు. కొంచెం ముందువెనకలు చూసుకోవాలి మరి" అన్నాడు వెంకట్రామయ్య హితబోధచేస్తున్న ధోరణిలో!

**– అం పేరాయని వెంకటచంద్రశేఖరరావు**

---

# ఆనెస్టీ

స్టార్ హోటల్‌ముందు కూర్చుని వచ్చేపోయే కస్టమర్సుని వింతగా చూస్తున్నాడు రాఘవ. రకరకాల కార్లలో, విలువైన దుస్తుల్లో, మ్యాడ్ ఫ్యాషన్స్‌తో దర్జాగా వుండే ఖరీదైన ఆ మనుషులవంక అద్భుతంగా చూస్తూంటాడు వాడు రోజూ. వాళ్ళంతా దేవతల్లా కనిపిస్తుంటారు వాడికి.

రోజూ ఆ హోటల్‌ముందు కూర్చుని షూ పాలిష్ చేస్తుంటాడు పదేళ్ళ రాఘవ. అక్కడికి వచ్చేవారంతా ఖరీదైన మనుషులే కావడంతో గిరాకీ బాగానే వుంటుంది వాడికి.

ఆరోజు చీకట్లు ముసురుకునే వేళకి బేరాలు తగ్గడంతో ఖాళీగా వున్నాడు రాఘవ. ఆ హోటల్‌కి వచ్చేపోయే కార్లవంక, కస్టమర్స్ వంకా ఎప్పటిలా చూస్తూ కూర్చున్నాడు.

అంతలో మారుతీ జెన్ ఒకటి వచ్చి హోటల్ వద్ద ఆగింది. అందులోంచి ఓ యువతి దిగింది. మెరిసిపోయే దుస్తుల్లో ఫ్యాషనబుల్‌గా వుందామె. నోరు తెరుచుకుని ఆమెవంకే చూస్తూ వుండిపోయాడు రాఘవ. స్వయంగా డ్రయివ్ చేసుకొచ్చిందేమో, కారుని లాక్‌చేసి కీస్‌ని హ్యాండ్‌బ్యాగ్‌లో పడేసుకుంది. తరువాత హ్యాండ్‌బ్యాగ్‌లోంచి చిన్న అద్దం తీసి అందులో ముఖం చూసుకుంది. కర్చీఫ్ తీసి చెక్కిళ్ళను సున్నితంగా అద్దుకుంది. తిరిగి దాన్ని హ్యాండ్‌బ్యాగ్‌లో వుంచి ఒయ్యారంగా నడుచుకుంటూ హోటల్లోకి నడిచింది.

కుతూహలంతో ఆమెనే గమనిస్తున్న రాఘవకు, ఆమె హ్యాండ్ బ్యాగ్‌లోంచి ఏదో కింద పడినట్లనిపించింది. ఆమె హోటల్లోకి వెళ్ళగానే కారు దగ్గరకు వెళ్ళాడు.

నేలపైన అందమైన చిన్న లేడీస్ పర్స్ పడి వుంది. ఎక్సైట్‌మెంట్‌తో వాడి గుండె ఝల్లుమంది.

చటుక్కున దాన్ని తీసి, తెరిచి చూశాడు. ఆశ్చర్యం... భీతి రెండూ కలిగాయి వాడికి.




దాన్నిండా నూర్రూపాయల నోట్లున్నాయి. ఆశ్చర్యంగా ఆమె వెళ్ళినవైపే చూస్తూ వుండి పోయాడు.

కాసేపటి తరువాత హడావుడిగా హోట ల్లోంచి బయటకు వచ్చిందా యువతి. కారు దగ్గర కంగారుగా వెదకసాగింది.

ఆమెను సమీపించి "దేనికోసమైనా వెదుకు తున్నారా మేడమ్? " అనడిగాడు రాఘవ.

ఓసారి వాడివంక నిర్లక్ష్యంగా చూసి, "ఊ... పర్సు పడిపోయింది" అందామె.

"ఇది మీదేనేమో చూడండి" అంటూ అంత కుముందు తనకు దొరికిన పర్సును తీసి చూపించాడు వాడు.

దాన్ని చూడగానే ఆమె వదనం వెలిగిపో

"ఏమయింది మేడం"

"ఇందులో అన్నీ వంద రూపాయల నోట్లే వుండాలి. కానీ వాటిలో ఓ వందకు చిల్లర మార్చి ఉందిప్పుడు. అదెలా సాధ్యం? " అందామె ఆశ్చర్యంగా.

బుర్ర గోక్కున్నాడు రాఘవ. "మీ పర్సు లోంచి ఓ నూర్రూపాయలకు చిల్లర మార్చి పెట్టింది నేనేనండి" అన్నాడు వినయంగా.

"నువ్వా...? "

"మొన్న ఒకసారి ఓ మేడం ఇలాగే పర్సు పోగొట్టుకుంటే నాకు దొరికింది. దాన్ని భద్రంగా ఆవిడకు ఇచ్చేశాను. నా నిజాయితీకి మెచ్చుకుని నాకు డబ్బులివ్వాలనుకుందిగానీ, చిల్లర లేదని థాంక్స్ చెప్పి వెళ్ళిపోయింది"



యింది. "ఇదే" అంది ఆనందంగా.

అంతలోనే వాడివంక అనుమానంగా చూస్తూ "ఇది నీకెలా వచ్చింది? " అనడి గింది.

ఎక్కడ దొరికిందో చెప్పాడు రాఘవ. "లోపల డబ్బంతా సరిగా వుందో లేదో చెక్ చేసుకోండి" అన్నాడు.

పర్సులోని సొమ్మును లెక్క చూసుకుని, ఆశ్చర్యంగా చూసిందామె వాడివంక. "ఇందులో అయిదువేలు వుండాలి. సొమ్మంతా సరిగానే వుంది. కానీ..."

వివరించాడు వాడు. "అందుకే... మీకు అవ సరమవుతుందేమోనని... ఓ పెద్దనోటుకి చిల్లర మార్చి పెట్టాను"

ఆ చిచ్చరపిడుగు పలుకులు విని ఆమె ఆశ్చర్యపోయింది. వాడి నిజాయితీకి మెచ్చు కుని, తెలివికి ముచ్చటపడి పెద్దనోటు ఒకటి వాడి చేతిలో పెట్టింది.

– తిరుమలశ్రీ

★

# చతుర

సంపుటి : 25
సంచిక : 3
ఏప్రిల్ : 2002
291వ సంచిక

ఇల్లంతా బంధువులతో సందడిగా వుంది. పచ్చటి మామిడాకుల తోరణాలతో, పళ్లు, పూలు మొదలైన శుభప్రదమైన వస్తువులతో కళకళలాడుతోంది. కష్టపడి తాను స్వయంగా నిర్మించుకున్న ఆ ఇంటి గృహప్రవేశానికి ముఖ్య అతిథి అతని మాస్టారు మాత్రమే. మాస్టారినీ, ఆయన భార్యనీ కుర్చీలలో కూర్చోపెట్టి కాళ్లు కడిగి నెత్తిన జల్లుకుని వారికి పట్టుబట్టలు పెట్టి నమస్కరించాడు. కానీ తనని నవమాసాలు మోసి పెంచిన తల్లినిగానీ, విద్యాబుద్ధులు చెప్పించిన తండ్రినిగానీ ఆ కార్యక్రమానికి పిలవలేదు. వారి మాట చెబితేనే అతడు మండిపడతాడు. అయిన వాళ్లందరినీ వదులుకొని కేవలం గురువే దైవం అనుకొనే అతని మనస్తత్వం ఏమిటి? జీవితంలో అతడు ఎదుర్కొన్న చేదు అనుభవాలేమిటి? రక్తసంబంధీకులే శత్రువులుగా మారిన కారణాలేమిటి? ఆసక్తికరంగా చదివించే ఆదిమూలం రామబ్రహ్మం నవల 'మాస్టారు' ఈ నెల చతుర సమగ్ర నవల.



తెలతెలవారుతుండగా బస్సు హైదరాబాదు బస్టాండ్‌లో ఆగింది. రామకృష్ణ సీట్లోంచి లేచాడు. బ్యాగ్ అందుకొని బస్సు లోంచి దిగుతూ వుంటే ఒళ్లు ఒక్కసారిగా చలిగాలి తగిలి వణికింది.

చుట్టూ చూశాడు. బస్టాండ్ విశాలంగా వుంది.

ప్యాసింజర్లు పలుచగా వున్నారు.

రామకృష్ణ హైదరాబాదు రావడం అదే మొదటిసారి. అలా రావలసి వస్తుందని తను అనుకోలేదు. ఉన్న ఊరులోనే పొలాన్ని సాగు చేయించుకొంటూ ఇంటి ముందున్న వేపచెట్టు నీడలో ప్రశాంతంగా జీవితం గడపదలుచుకొన్నాడు.

కానీ దైవ నిర్ణయం వేరుగా వుంటే చెయ్యగలిగింది ఏముంది.

అమ్మా, నాన్నలు గుర్తుకు వచ్చి అడుగు ముందుకి వెయ్యలేక బెంచీమీద కూర్చున్నాడు.

"అనుబంధం, ఆత్మీయత అంతా ఒక బూటకం
ఆత్మతృప్తికై మనుషులు ఆడుకొనే నాటకం"

కవి అలవోకగా రాశాడో అనుభవించి రాశాడోగానీ అది పచ్చినిజం అనిపించింది ఆ క్షణంలో

రామకృష్ణ మనసు పొరల్లోంచి ఎప్పుడో విన్న పాట అప్రయత్నంగా పెదాలపైకి రావడంతో వైరాగ్యభావంతో ఆలోచిస్తూ తను బాధల కోసమే పుట్టాడు అనుకొన్నాడు.

అలా అనుకొన్న క్షణంలోనే కళ్లు చెమ్మగిల్లాయి. కర్చీఫ్ తీసి కళ్లు అద్దుకొన్నాడు.

ఆలోచిస్తూ వుంటే తనమీద తనకే విపరీతమైన జాలి కలిగింది.

జీవితంమీద విరక్తి కలిగిన సందర్భాలున్నాయి. తనమీద ఆధారపడిన వాళ్లని వదిలేసి పోవడం చేతకానితనం అవుతుంది. వాళ్లని అనాథలుగా మిగిల్చి పోవడం మహాపాపమే అవుతుందని బాధ్యతాయుతంగా కాలంతో పరుగిడసాగాడు.

కానీ మనశ్శాంతి లేదు.

అన్యమనస్కంగా లేచి బస్టాండ్‌లోనే కాలకృత్యాలు ముగించుకొన్నాడు. షర్టులోపలి జేబులోంచి శేషగిరి మాస్టారుగారు రాసిచ్చిన అడ్రసు కాగితం బయటకు తీశాడు. అందులో ఒకపక్క తను వెళ్లవలసిన మోహన్‌రావుగారి ఇంటి అడ్రస్సు, రెండవ వైపు ఆ అడ్రసుకి ఎలా వెళ్లాలో మ్యాప్ వేసి వుంది.

బస్టాండ్ నుంచి నడిచిపోవచ్చు. వేగంగా నడిస్తే అర్ధగంట పడుతుంది. మామూలుగా నడిస్తే ముప్పావు గంట పడుతుందని శేషగిరి మాస్టారుగారు చెప్పారు.

వాచీకేసి చూశాడు. ఆరు గంటలయ్యింది.

బస్సులోనో ఆటోలోనో హడ్రీబడ్రీగా వెళ్లి పొద్దున్నే వాళ్లని ఇబ్బంది పెట్టడం కన్నా నిదానంగానే కాస్త ఎండబడ్డ తర్వాత కలిస్తే బావుంటుందనుకొన్నాడు.

బస్టాండ్‌లోంచి బయటకు నడిచి అక్కడ రోడ్డు పక్కగా వున్న తోపుడు బండి దగ్గర నిలబడి కొందరు టిఫిన్ చేస్తూ వుంటే తనూ వెళ్లి రెండు ఇడ్లీలు తిని, టీ తాగాడు.

ఆ సమయంలో రోడ్డుమీద రద్దీలేదు. అటూఇటూ చూస్తూ ఈ సిటీ తనని ఆదరించి అక్కున చేర్చుకొంటుందో లేక నిర్దాక్షిణ్యంగా నీ కర్మ నీదేనని వదిలేస్తుందో అని అనుకొంటూ అడుగులేస్తున్నాడు.

అబిడ్స్ సెంటర్‌కి చేరుకొనేసరికి సూర్యకిరణాలు చురుక్కుమనిపించాయి.

టైం చూసుకొన్నాడు. ఏడూముప్పావు దాటింది. అడ్రస్సు వున్న కాగితం తీసి మ్యాప్‌కేసి చూశాడు. దాని ప్రకారం నడుచుకొంటూపోయి శేషగిరి మాస్టారు చెప్పినట్టుగా వున్న బిల్డింగ్ కనబడి అక్కడ ఆగాడు. దాని పక్కనున్న గల్లీ గుండా లోపలికి వెళ్లగానే 'శ్రీనిలయం' అని రాసిన





రెండంతస్థుల మిద్దె కనబడింది.

మోహన్‌రావుగారు పై పోర్షన్ రెంట్‌కిచ్చి కింది పోర్షన్‌లో వుంటారని చెప్పిన శేషగిరి మాస్టారి మాటలు గుర్తుకొచ్చి క్షణకాలం రామకృష్ణ గుండె వేగంగా కొట్టుకొంది.

మోహన్‌రావుగారు ఎలా వుంటారో ఆయన ఎలా రిసీవ్ చేసుకొంటాడో,

"నా మాట విను నీ మేలుగోరి చెప్తున్నాను" అంటూ శేషగిరి మాస్టారుగారు బలవంతంగా పంపిస్తే వచ్చాడు తను. కాలం ఎంత బలమయినదో అప్పుడు అర్థమయింది.

గేటు తీసుకొని పోయి కాలింగ్‌బెల్ స్విచ్ నొక్కాడు. వెంటనే లోపలినుండి "ఆ వస్తున్నా" అంటూ స్త్రీ గొంతు వినబడింది.

మరు నిముషంలోనే తలుపు తీసిన ఆమెని చూడగానే శేషగిరి మాస్టారు చెప్పినట్టు ఆమె మోహన్‌రావుగారి భార్య వర్ధనమ్మే అయి వుంటుందనుకొన్నాడు. యాభై అయిదు సంవత్సరాల వయసుంటుంది. పచ్చటి మొహం, నుదుట అర్ధరూపాయి బిళ్లంత తిలకం బొట్టు.

"నేను శాఖవరం నుండి వస్తున్నానమ్మా" అని చెప్పాడు రామకృష్ణ.

"మీరా! రామకృష్ణగారా! లోపలికి రండి. మొన్ననే శేషగిరి అన్నయ్యగారు లెటర్ రాశారు" అంటూ రామకృష్ణని లోపలికి ఆహ్వానిస్తూ "ఏమండీ శేషగిరి అన్నయ్య పంపిస్తానని రాసిన అబ్బాయి వచ్చాడు" అని బెడ్‌రూమ్‌లో వున్న మోహన్‌రావుకి వినిపించేట్టు కేకేసింది.

ఆమె మోహన్‌రావుగారి భార్య వర్ధనమ్మే అని నిశ్చయించుకొని లోపలికి నడిచాడు రామకృష్ణ.

రెండు కుటుంబాలు వుండేందుకు వీలుగా వుందా ఇల్లు. విశాలమయిన హాలు, దాని పక్కనే రెండు బెడ్‌రూములు, వెనక డైనింగ్‌హాలు కమ్ కిచెన్, దొడ్లో స్త్రీలకు, పురుషులకు విడివిడిగా టాయిలెట్లు వున్నాయి. పై పోర్షన్ కూడా అదే మాదిరి వుంటుంది.

హాల్లో కార్పెట్ పరచి వుంది. పెద్ద కలర్ టి.వి. ఒక మూలన, దాని పక్కనే ఫ్రిజ్, వాటికెదురుగా గోడకానుకొని ఖరీదయిన సోఫా, అక్కడే టేబుల్ మీద ఫోను వున్నాయి.

రామకృష్ణ వచ్చి బ్యాగ్‌ని ఒళ్లో పెట్టుకొని సోఫాలో కూర్చుంటుండగా మోహన్‌రావుగారు వచ్చారు.

అరవై ఏళ్లు వుంటాయి ఆయనకి. మనిషి సన్నగా పొడవుగా వున్నాడు. బట్టతల.

"ఏం బాబూ రాత్రి బయల్దేరావా" అంటూ రామకృష్ణ పక్కన కూర్చున్నాడు.

"అవును సార్" అన్నాడు రామకృష్ణ ముక్తసరిగా.

మోహన్‌రావుగారు శేషగిరిగారి క్షేమ సమాచారాలను గురించి అడుగుతూ వుంటే వర్ధనమ్మ వాటర్ హీటర్ ఆన్ చేసి వచ్చింది "బాబూ లేచి మొహం కడుక్కో" అంటూ.

"నేను కడుక్కొనే వచ్చానమ్మా" చెప్పాడు రామకృష్ణ.

"అయితే ముందు టీ ఇయ్యి తాగుతాడు. తర్వాత స్నానం చేసి టిఫిన్ తిని రెస్ట్ తీసుకొంటాడు" మోహన్‌రావు భార్యతో అన్నాడు.

"అయితే ఈలోగా మీరు అల్లుడు గారికి ఫోన్ చేసి చెప్పండి రామకృష్ణ వచ్చాడని" అంటూ ఆమె కిచెన్‌లోకి వెళ్లిపోయింది.

అప్పుడు అనుకొన్నాడు రామకృష్ణ తన కోసం ఇక్కడ ప్రయత్నాలు జరుగుతున్నట్టుందని, శేషగిరి మాస్టారిగారి మాటకి మంచి విలువే వుందని.

మోహన్‌రావుగారు పక్కనే వున్న ఫోనెత్తి డయల్ చేశాడు. అవతల మోహన్‌రావు కూతురు సుమతి రిసీవర్ అందుకొని "హలో ఎవరు? " అంది.

"నేనమ్మా"

"నాన్నా ఏమిటి? "

"సురేష్ లేడామ్మా"

"స్నానం చేస్తున్నాడు ఏదన్నా చెప్పాలా?"

"ఏం లేదమ్మా శాఖవరం నుండి శేషగిరి మావయ్య చెప్పిన రామకృష్ణ వచ్చాడు"

అవతల నుంచి ఏం సమాధానం వస్తుం దోనని రామకృష్ణ ఆందోళనకు లోన య్యాడు.

"అయితే ఆయన రాగానే ఫోన్ చెయ్య మని చెప్తాను నాన్నా" అంది సుమతి.

"అలాగేనమ్మా" ఫోన్ పెట్టేశాడు మోహ న్‌రావు.

వర్ధనమ్మ కప్పుతో టీ తెచ్చి ఇచ్చింది. రామకృష్ణ మొహమాటపడుతూ అందుకొని సిప్ చేస్తూ వుంటే ఫోన్ రింగయ్యింది.

అల్లుడి నుంచే అనుకొని రిసీవర్ ఎత్తిన మోహన్‌రావుకి అవతల 'హలో' అన్న గొంతు కొత్తగా వుండేసరికి "ఎవరుమీరు" అని అడిగాడు.

అందుకు సమాధానంగా "నేను శేషగిరిని కందుకూరు నుంచి మాట్లాడుతున్నాను" అని వినబడి ఆశ్చర్యపోతూ మోహన్‌రావు రామకృష్ణకేసి చూశాడు.

"మీ మాస్టారుగారు కందుకూరు నుండి మాట్లాడుతున్నారు" అని చెప్పి అవతల నుండి "రామకృష్ణ వచ్చాడా" అంటూ అడు గుతున్న శేషగిరికి "ఇప్పుడే వచ్చాడు. నా పక్కనే వున్నాడు" అని చెప్పారు.

"ఇంక మీ ఇష్టం... అతనికో దారి చూపించి పుణ్యం కట్టుకోండి"

"మా అల్లుడు అదే పనిలో వున్నాడు. ఇవాళా, రేపూ రెండు రోజుల్లో సెటిల్ అవు తుంది. మీరేం బెంగపెట్టుకోకండి మీ శిష్యుణ్ణి గురించి. రామకృష్ణతో మాట్లాడ తారా"

"జస్ట్ ఫోనివ్వండి"

"మీ గురువుగారు మాట్లాడుతారట" అంటూ మోహన్‌రావు గారు రిసీవర్ రామ కృష్ణకు అందించారు.

"ఏం రామకృష్ణా క్షేమంగా చేరావా" అడి గారు శేషగిరి మాస్టారు.

"చేరాను మాస్టారు"

"నువ్వేం దిగులు పడొద్దు పని అవు తుంది. నువ్వక్కడే సెటిల్ కావాలి"

"థ్యాంక్స్ మాస్టారు"

"వుంటాను. ఫోన్ పెట్టేస్తున్నాను"

అవతల ఫోన్ పెట్టేసిన శబ్దం వినబడ గానే రామకృష్ణ రిసీవర్ పెట్టేశాడు.

సోఫాలో కూర్చున్న రామకృష్ణకి శేషగిరి మాస్టారు ఎంతో వున్నతంగా కనిపిస్తు న్నాడు.

మాతృదేవోభవ

పితృదేవోభవ

ఆచార్యదేవోభవ

ఆ వరుస క్రమంలో ప్రథమ, ద్వితీయ స్థానాలలో అమ్మానాన్నలు వుండటం అస హ్యంగా వుంది. ఆ విషయాన్ని ఎవరితో నన్నా అన్నాడా వాళ్ల దృష్టిలో తనో మూర్ఖుడు. అయినా తన మనసులో మాత్రం అమ్మానాన్నలు జన్మదాతలు మాత్రమే.

సరిగ్గా ఇరవై సంవత్సరాల క్రితం తనకు అయిదేళ్లు నిండి ఆరో సంవత్సరం వచ్చింది. అప్పుడు అమ్మానాన్నా కూడబలుక్కొని బడిలో వెయ్యాలని అనుకొన్నారు. ఆ విష యమై నాన్నగారు శేషగిరి మాస్టారిని కలిస్తే పంచాంగం చూసి మంచి రోజు చెప్పాడు.

ఆ రోజున తనకు తల స్నానం చేయించి కొత్తబట్టలు తొడిగి వీధిబడికి తీసుకొని పోయారు. ఒకటో తరగతిలోకి వెళ్లగానే అక్కడున్న పిల్లలందరికీ నాన్నగారు బొరు గులూబెల్లం పంచారు. తర్వాత తన చేత ఆకులూ, - వక్కలూ, అరటి పళ్లు వుంచిన పంచలచాపుని శేషగిరి మాస్టారుగారికి ఇప్పించి ఆయన పాదాలకి నమస్కారం చేయించాడు. అప్పుడు మాస్టారుగారు నాన్నగారి చేతిలోంచి అక్షింతలు తీసుకొని తన నెత్తిమీద చల్లి దీవించి, పలకమీద




అ,ఆలు రాసి తన చేత అయిదుసార్లు దిద్దిం చారు.

ఆ అక్షర దాతే తనకు దైవం.

అమ్మా, నాన్నాకాదు

వాళ్లు ఆవేశం ఆపుకోలేక కనిపారేసిన వాళ్లు మాత్రమే.

తనో శాపగ్రస్థుడు.

అలా రామకృష్ణ రోజులో నాలుగయిదు సార్లు అనుకునేవాడు. అమ్మానాన్న గుర్తుకు వస్తే ఆవేశం తన్నుకొస్తుంది.

అంతలోనే...

'ఆవేశం అనర్థాలకు దారితీస్తుంది తన శాంతమే తనకు రక్ష' అన్న శేషగిరి మాస్టారి మాటలు మంత్రించిన వేదోక్తుల్లా కట్టడి చేస్తుంటాయి.

తనకోసం ఆ మాస్టారు గొప్ప ప్రయత్నం చేస్తున్నారు. దేవుడి దయవలన అది ఫలిస్తే,

అప్పుడే ఫోన్ రింగయ్యింది.

మోహన్‌రావుగారు రిసీవర్ అందు కొంటూ వుంటే అటుకేసి చూశాడు. వాళ్ల అల్లుడు మాట్లాడుతున్నాడు.

"సికింద్రాబాద్‌లో ఫైనాన్స్ కంపెనీలో క్లర్క్ పోస్టు ఖాళీ వుందట. దాని వివరాలు తెలుసుకొని సాయంకాలం వస్తానని చెప్పాడు" అని చెప్పాడు మోహన్‌రావు ఫోన్ పెట్టేసి.

"ఇంకేం ఫర్వాలేదు బాబూ. అందులో వుద్యోగం ఖాయం. అల్లుడుగారు చెప్పా రంటే తిరుగుండదు. నువ్వు లేచి స్నానం చెయ్యి" అంటూ చెప్పింది వర్ధనమ్మ.

ఆమె అలా భరోసాగా మాట్లాడుతూ వుంటే రామకృష్ణకి ఆనందంగా వుంది. లేచి స్నానానికి వెళ్లాడు.

డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని టిఫిన్ తింటూ వుంటే "నీకు పిల్లలా బాబూ" అని అడిగింది వర్ధనమ్మ.

"అవునమ్మా! ఇద్దరు అబ్బాయిలు" చెప్పాడు రామకృష్ణ.

"ఏం చదువుతున్నారు"

"ఇంకా స్కూల్లో చేర్పించలేదమ్మా! చిన్న పిల్లలు. పెద్దబ్బాయికి అయిదేళ్లు, చిన్నబ్బా యికి మూడేళ్లు" అని చెప్తూ ఇంకా ఏమన్నా అడుగుతుందేమో! అమ్మానాన్నని గురించి అడిగితే టిఫిన్ తినబుద్ధి కాలేదు. కడుపులో ఏదో కెలికినట్టుగా వుంది.

వర్ధనమ్మ ఇంకేం మాట్లాడలేదు. గది చూపించి రెస్ట్ తీసుకోమని చెప్పింది. అందులో నిద్రపోదామని రామకృష్ణ ఎంత ప్రయత్నించినా కుదరలేదు. సాయంకాలం సురేష్ వచ్చి ఏం చెప్తాడో! దేవుడి దయవల్ల ఆ వుద్యోగం దొరికితే బావుండు. ఏదో చిన్నఇల్లు చూసుకొని లక్ష్మిని, పిల్లల్ని తీసు కొని రావచ్చు. ఇక్కడే సెటిల్ అయిపోవాలి అనుకొంటూ వుంటే శేషగిరి మాస్టారు గుర్తు కొచ్చారు.

ఆయనంటే కేవలం పలకమీద అ, ఆలు దిద్దబెట్టే వీధిబడి పంతులనే చులకన భావం వుండేది. కానీ అది నిజం కాదని, తను అవివేకంతోనే అలా అనుకొన్నాడని తెలిసి సిగ్గుపడిపోయాడు.

ఆయనలో దైవత్వం వుంది. మానవత్వం పరిమళించే మహోన్నతమయిన వ్యక్తిత్వం వుంది. జన్మ భూమికి సేవ చెయ్యాలని తపన వుంది. కొడుకుని ఆర్మీలోకి పంపిం చాడు. కూతురుని స్కూలు టీచర్‌తకిచ్చి చేశాడు.

శిష్యుడు అన్యాయానికి బలై కష్టాలు పడుతూ వుంటే చూడలేకపోయాడు. ఆ మాస్టారుగారి మానవతా హృదయాన్ని మననం చేసుకొంటూ అగమ్యంగా వున్న భవిష్యత్తుని గురించి ఆలోచిస్తూ రాత్రి ప్రయాణంలో నిద్రకు దూరమయ్యాడు. టిఫిన్ తిని రెస్ట్ కోసం విశ్రమించినా అదే పరిస్థితి. ఒంటిగంటకు భోజనం చేసిన తరు వాత వళ్లు తెలియకుండా నిద్రపట్టింది.

మెలుకువ వచ్చేసరికి హాల్లోంచి మాటలు వినబడుతున్నాయి. వాచీకేసి చూసుకు

న్నాడు. అయిదున్నర.

వాళ్ల అల్లుడు వచ్చినట్టు వుంది. ఏం చెప్తాడో క్షణకాలం గుండె వేగంగా కొట్టు కొంది. లేచి బయటకు వచ్చాడు.

మోహన్‌రావు, సురేష్ సోఫాలో కూర్చుని వుంటే వర్ధనమ్మ వాళ్లకి ఎదురుగా నిలబడి వుంది.

రామకృష్ణ రావడం చూసి "హల్లో! రండి" అంటూ సురేష్ విష్ చేస్తూ పిలిచాడు.

"సారీ సర్" వినయంగా అంటూ వచ్చి గోడని ఆనుకొనివున్న కుర్చీలో కూర్చున్నాడు రామకృష్ణ.

"రాత్రి జర్నీ చేశారుగా బాగా నిద్ర పట్టేసి వుంటుంది" అన్నాడు సురేష్.

"అవును సార్" రామకృష్ణ అంటూ వుంటే వర్ధనమ్మ అతనితో "మా అల్లుడు నీ వుద్యోగం కోసం పోయి మాట్లాడి వస్తు న్నాడు" అని కాస్త గర్వంగా చెప్పింది. రామ కృష్ణ చేతులు జోడించి "నమస్తే సార్" అన్నాడు.

"ఫైనాన్స్ కంపెనీలో అకౌంట్స్ సెక్షన్‌లో క్లర్క్ పోస్టు, ప్రస్తుతం మూడు వేలిస్తారు" సురేష్ చెప్పాడు.

"థ్యాంక్స్ సార్" సంతోషాన్ని వ్యక్తపరి చాడు రామకృష్ణ.

"పోను పోనూ శాలరీ పెరుగుతుంది. ఆ కంపెనీలో రెండు వేలకు జాయిన్ అయిన వాళ్లు ఇప్పుడు నాలుగున్నర వెయ్యి తీసుకొం టున్నారు. మీరూ ఆరూ, ఏడుదాకా డ్రా చెయ్యగలరు" అన్నాడు సురేష్.

అతనికేసి కృతజ్ఞతగా చూశాడు రామ కృష్ణ.

"రేపు వుదయం సురేష్‌తో వెళ్లు. అక్కడ నిన్ను పరిచయం చేసి జాయిన్ చేస్తాడు" చెప్పాడు మోహన్‌రావు.

"అలాగే సార్"

వర్ధనమ్మకి సంతోషంగా వుంది. శేషగిరికి ఇచ్చిన మాట నిలబెట్టుకోలేకపోతే పరువు పోతుందని బెంగపడింది. అల్లుడు కార్యసా ధకుడవడంతో గర్వపడింది. హుషారుగా కిచెన్‌లోకి వెళ్లి టీ కలుపుకొని వచ్చి తలా ఒకటి అందించి తనూ ఒక కప్పు తెచ్చుకొని వాళ్లకి ఎదురుగా కూర్చుంది.

సురేష్ టీ తాగి ఖాళీ కప్పు కింద పెడుతూ "రేపు ఉదయం ఎయిట్ థర్టీకి వస్తాను, మీరు రెడీగా వుండండి" అని రామకృష్ణతో చెప్పి లేచాడు.

రామకృష్ణ తల వూపాడు. సురేష్ వెళ్తుంటే వర్ధనమ్మ వీధిలో దాకా వెళ్లింది. ఆమె వెనకాలే రామకృష్ణ కూడా వెళ్లాడు. అక్కడ గేటు ముందు స్టాండ్ చేసి వున్న హోండాని స్టార్ట్ చేస్తూ "రేపు ఉదయం వస్తాను" అంటూ రామకృష్ణతో చెప్పి వెళ్లి పోయాడు సురేష్.

మోహన్‌రావు టీవి పెట్టుకొని చూస్తూ వున్నాడు. రామకృష్ణ ఆయన పక్కన కూర్చున్నాడు.

"మీ వూరికి ఫోన్ ఫెసిలిటీ వుందా" అని అడిగాడు మోహన్‌రావు.

"లేదు సార్" అని చెప్పాడు రామకృష్ణ.

"మీకు జాబ్ దొరికినట్లు మీ గురువుగా రికి తెలిస్తే సంతోషిస్తారు" అన్నాడు మోహ న్‌రావు.

వెంటనే వర్ధనమ్మ "ఒక పని చెయ్యి నాయినా రామకృష్ణా! ఉదయం జాబ్‌లో జాయిన్ అవగానే ఉత్తరం రాసెయ్యి" అని చెప్తుంటే మోహనరావు "ఆ లెటర్ అందిం దాకా ఓర్చుకోగలడా ఏంది? రేపు ఉదయం కందుకూరొచ్చి ఫోన్ చేసినా చేస్తాడు" అన్నాడు.

"గురు సాక్షాత్ పరబ్రహ్మ అని ఎందుక న్నారు? ఇందుకే" అన్నది వర్ధనమ్మ.

రామకృష్ణకి సంతోషంగా ఉంది. శాఖవ రానికి ఫోన్ సౌకర్యం ఉంటే ఎంత బాగుం డును. మాష్టారుగారికి విషయం తెలిస్తే మహదానంద పడతాడు. ఈరోజులాగా ఆయన రేపు ఉదయం కందుకూరునుండి ఫోన్ చేస్తే బావుండును. చేస్తాడా? తప్ప




కుండా చేస్తాడు. తనమీద ఆయనకో దృష్టి ఉంది. శిష్యుడు అధ్వాన్న స్థితికి దిగజారకూడదు. ఉన్నత స్థాయికి ఎదగాలి. అందుకు తగిన చేయూత నివ్వాలనే తపన ఉంది.

శేషగిరి మాస్టారు గుర్తుకు రాగానే రామకృష్ణలో ఆయన పట్ల ఆరాధనా భావం పెరిగింది.



ఉదయం శేషగిరి మాష్టారునుండి ఫోన్ వస్తుందని ఎదురు చూశాడు రామకృష్ణ.

రాలేదు.

ఎనిమిదింటికి సురేష్ వచ్చాడు. అప్పటికే రెడీ అయివున్న రామకృష్ణ అతని హోండా మీద సికింద్రాబాద్ వెళ్లాడు.

ఫైనాన్స్ కంపెనీ ముందు బండి ఆపాడు సురేష్. రామకృష్ణ దిగాడు. సురేష్ బండిని ఓపక్కగా స్టాండ్ చేసి కంపెనీలోకి నడిచాడు. అతని వెనకాలే వచ్చిన రామకృష్ణకి అది పెద్ద కంపెనీలా తోచింది. బ్యాంకుల్లో ఉండే క్యాష్ కౌంటర్లు ఉన్నాయి. చాలా మంది ఉద్యోగస్థులు పని చేస్తున్నారు.

"రామకృష్ణని వెంటబెట్టుకుని మేనేజర్ గదిలోకి వెళ్లాడు సురేష్. అతన్ని చూస్తూనే "హలో" అంటూ విష్ చేశాడు మేనేజర్.

యాభై ఏళ్లుంటాయి. ఎర్రగా ఉన్నాడు. రంగుకి అలవాటు పడ్డ తల వెంట్రుకలు రాగి రంగులోకి మారి వున్నాయి. మీసాలు, గడ్డం నీట్‌గా షేవ్ చేసుకుని ఉన్నాడు.

సురేష్ గుడ్ మార్నింగ్ చెప్పి ఆయనకి ఎదురుగా కూర్చుంటూ "మీకు చెప్పానే మా ఫ్రెండ్ అని. ఇతనే. రామకృష్ణ" అని రామకృష్ణని పరిచయం చేశాడు.

మేనేజర్ రామకృష్ణకేసి చూడగానే "నమస్తే సార్" అంటూ చేతులు జోడించి నమస్కారం చేశాడు.

"కూర్చోండి" అన్నాడు మేనేజర్.

రామకృష్ణ ఒబీడియంట్‌గా కూర్చున్నాడు.

"బయోడేటా ఇవ్వండి" అంటూ ఒక అరటావు పేపర్ తీసి ఇచ్చాడు మేనేజర్.

రామకృష్ణ తన పేరూ, తండ్రి పేరూ క్వాలిఫికేషన్, అడ్రసు రాసి ఇచ్చాడు.

అందులోని ముత్యాల్లాంటి అక్షరాలను చూడగానే మేనేజర్‌కి మంచి ఇంప్రెషన్ కలిగినట్టుంది.

"షార్ట్‌హ్యాండ్ తెలుసా" అని అడిగాడు.

"రాదు సార్, టైప్‌వచ్చు హైయ్యర్ పాసయ్యాను" చెప్పాడు రామకృష్ణ.

"ఇంతకుముందు ఎక్కడన్నా పనిచేశారా"

"కందుకూరులో ఓ ప్రైవేట్ జూనియర్ కాలేజీలో క్లర్క్‌గా పనిచేశాను సార్"

"అయ్‌సీ, ఓన్‌గా డ్రాఫ్టింగ్ చెయ్యగలరా. ఏదన్నా లెటర్‌కి రిప్లయ్ రాయవలసి వస్తే రాయగలరా ఇంగ్లీషులో"

"రాయగలను సార్"

"ఓకే" అంటూ బెల్ నొక్కాడు.

డోర్ తెరచుకొని ప్యూన్ వచ్చాడు.

"అకౌంటెంట్ సీతారామయ్యను పిల్చుకురా" చెప్పాడు మేనేజర్.

"ప్యూన్ వెళ్లిపోయాడు. మేనేజర్ ఆఫీసు పనివేళలు, శాలరీ విషయాల గురించి చెప్పాడు. రామకృష్ణ అన్నిటికీ ఇష్టపడుతున్నట్లు మౌనంగా తలాడించాడు.

సీతారామయ్య వచ్చాడు "గుడ్‌మార్నింగ్ సార్" అంటూ.

అయిదున్నర అడుగుల ఎత్తులో కాస్త నల్లగా లావుగా వున్నాడు. నలభై ఏళ్లుంటాయి. అతనికి రామకృష్ణని పరిచయంచేసి "మీ సెక్షన్‌లో జాయిన్ అవుతున్నాడు" అని చెప్పాడు మేనేజర్.

"మంచిది సార్ ఎప్పుడొస్తున్నారు" సీతారామయ్య అంటూండగానే "ఎప్పుడో కాదు ఇప్పుడే తీసుకెళ్లి రిజిష్టర్‌లో నేమ్ రాసి జాయిన్ చేసుకోండి" అని చెప్పాడు మేనేజర్.

"కమాన్ సార్" అంటూ రామకృష్ణని పిలిచాడు సీతారామయ్య.

రామకృష్ణలేస్తూ సురేష్‌కేసి చూశాడు.

సురేష్ మేనేజర్‌కి థ్యాంక్స్ చెప్పి రామకృష్ణతో బయటకు వచ్చి "ఈవినింగ్ వస్తాను" అని చెప్పాడు.

"ఆహా మీరు రావద్దు నేనే వస్తాను" చెప్పాడు రామకృష్ణ.

"ఓకే ఓకే! ఈవినింగ్ మావయ్యగారి ఇంట్లో కలుస్తాను" అంటూ సీతారామయ్యతో "వస్తాను సార్" అని చెప్పి వెళ్లిపోయాడు సురేష్.

సీతారామయ్య రామకృష్ణని అకౌంట్స్ సెక్షన్‌లోకి తీసుకొనిపోయి అక్కడ తనతో పని చేస్తున్న సీనియర్ అకౌంట్స్ ఆఫీసర్ రమాకాంత్‌ని మరో ముగ్గురు అసిస్టెంట్లు కోటీశ్వరరావు, చిన్నయ్య, సీనయ్యలను పరిచయం చేశాడు. వాళ్లంతా సంతోషంగా రామకృష్ణని రిసీవ్ చేసుకొన్నారు. తర్వాత సీతారామయ్య రామకృష్ణకి సీటు చూపించి అతను చెయ్యవలసిన పనులు వరుసగా వివరించాడు. అన్నిటికీ రామకృష్ణ "ఓకే సార్, అలాగే సార్" అంటూ తలాడించాడు.

పదకొండు గంటలకు టీలు వచ్చాయి. రామకృష్ణ కప్పు అందుకొని సిప్ చేస్తూ వుంటే "రామకృష్ణగారూ మిమ్మల్ని మేనేజరుగారు పిలుస్తున్నారు" అని తన సీట్లోంచే చెప్పాడు సీతారామయ్య.

రామకృష్ణ ఖాళీ కప్పు టేబుల్ మీద పెట్టి మేనేజర్ గదికి వెళ్ళాడు.

"స్టెన్సిల్ మీద టైప్ చెయ్యడం వచ్చా?" అని అడిగాడు మేనేజర్.

"వచ్చు సార్"

"గుడ్" అంటూ మేనేజర్ ఒక స్టెన్సిల్ సెట్టు, తను మేటర్ రాసివుంచిన కాగితం రామకృష్ణకి ఇచ్చి "తప్పులు లేకుండా కట్ చెయ్యాలి" అని ఒకపక్కగా వున్న టైప్ మిషన్ చూపించాడు.

రామకృష్ణ వెళ్లి టైప్‌మిషన్ ముందు కూర్చుని స్టెన్సిల్ షీట్‌ని మిషన్‌లోకి ఎక్కించాడు.

అతనికి అలవాటే. కాలేజీలో కొశ్చన్ పేపర్లు, స్టెన్సిల్ మీద కట్‌చేసి రోలింగ్‌మిషన్‌లో పెట్టి కాపీలు తీసేవాడు. పది నిమిషాల్లో స్టెన్సిల్ కట్‌చేసి ఇచ్చాడు. మేనేజర్ కార్బన్‌షీటు తీసి చూశాడు. ఎక్కడా తప్పులు లేవు. నీట్‌గా వుంది.

"వెరీగుడ్" మెచ్చుకొన్నాడు.

రామకృష్ణ తిరిగి వచ్చి తన సీట్లో కూర్చున్నాడు. అప్పుడు తెలిసింది అతనికి- తను టైప్ చేసిన మేటర్‌ని బట్టి అది చాలా ఎస్టాబ్లిష్డ్ కంపెనీ అని. దానికి దేశంలోని ముఖ్యపట్టణాలలో బ్రాంచీలు వున్నాయని.

శేషగిరి మాష్టారు గుర్తుకువచ్చారు.

ఆయనకు విషయం తెలపాలి. సాయంకాలం ఇంటికి వెళ్ళగానే లెటర్ రాసెయ్యాలనుకొన్నాడు.

లంచ్ టైంలో బాక్సులు తీసుకొని ఒక్కొక్కరూ డైనింగ్ హాల్‌వైపు వెళ్తున్నారు.

సీతారామయ్య సీట్లోంచి లేస్తూ, "రామకృష్ణగారూ రండి. సర్దుకొందాం" అంటూ రామకృష్ణని పిలిచాడు.

రామకృష్ణ తలెత్తేలోపు సీనయ్య కల్పించుకొని "మీరు వెళ్ళి భోంచెయ్యండి సార్. నేనూ రామకృష్ణగారూ క్యాంటీన్‌కి వెళ్తాస్తాం" అన్నాడు.

"ఏం మీరు బాక్స్ తెచ్చుకోలేదా?" అడి

గాడు కోటేశ్వరరావు లేస్తూ.

"లేదు సార్ రాత్రంతా బాబుకి జ్వరం. పొద్దున్నే లేచి వంట చెయ్యడం కుదర్లా మా ఆవిడకి"

"అయితే మీరూ రండి సర్దుకుందాం" రమాకాంత్ బ్యాగ్ అందుకొంటూ అన్నాడు.

"లేదు సార్ మీరు వెళ్ళిరండి థాంక్స్" అంటూ సీనయ్య రామకృష్ణ దగ్గరకు వచ్చాడు.

"ఏం సార్ వస్తారా!"

రామకృష్ణ లేచి సీనయ్యతో నడిచాడు. క్యాంటీన్‌లోకి వచ్చి కూర్చుని చెరొక ప్లేట్. మీల్ తీసుకున్నారు. కబుర్లు చెప్పుకొంటూ భోంచేసి అక్కడే అరగంట గడిపారు. అప్పుడు సీనయ్య ద్వారా ఆ కంపెనీలో ఉద్యోగం గవర్నమెంట్ ఉద్యోగంతో సమానమని, ఒకటో తారీకునే శాలరీస్ ఇస్తారని, పి.యఫ్.లు, ప్రమోషన్‌లు, పండుగ అడ్వాన్స్‌లు, మూడు సంవత్సరాలు సర్వీస్‌దాటితే ఇల్లు కట్టుకోడానికి లోన్ కూడా ఇస్తారని తెలిసి "జరిగేవన్నీ మంచికే రామకృష్ణా" అన్న శేషగిరి మాష్టారి మాటలు గుర్తుకొచ్చి "ఆచార్య దేవోభవ" అనుకొన్నాడు.

అక్కడ ఎదురుగా కిళ్ళీకొట్లో పోస్టల్ కార్డులు, కవర్‌లు ప్రేలాడుతుండడం చూసి అటుగా వెళ్ళి ఇన్‌లాండ్ కవరొకటి కొనుక్కొని జేబులో పెట్టుకొన్నాడు.

అయిదింటికి ఆఫీస్ టైం అవగానే సెక్షన్‌లోని అందరికీ చెప్పి మేనేజర్ గదిలోకి వెళ్ళాడు. "వస్తాను సార్" అంటూ మేనేజర్‌కి వినయంగా చేతులు జోడించి చెప్పి బయటకు వచ్చేశాడు.

అక్కడినుంచి నడుస్తూ నడుస్తూ మాష్టారికి లెటర్ రాయాలనుకొని పక్కనే వున్న క్యాంటీన్‌లోకి వెళ్ళి కూర్చున్నాడు. జేబులోంచి ఇన్‌లాండ్ కవరు తీసి 'మహారాజశ్రీ శేషగిరి మాష్టారి పాదములకు మీ శిష్యుడు నమస్కరించి రాయునది' అంటూ మొదలు పెట్టి మోహన్‌రావుగారు తనని రిసీవ్ చేసుకొన్న విధం, వర్ధనమ్మగారి ఆప్యాయతా, సురేష్ ఫ్రెండ్‌లా ట్రీట్ చేసిన తీరు, కంపెనీ వివరాలు, అన్నీ చక్కని అక్షరాలతో, లెటర్ నిండుగా రాసి పోస్ట్‌బాక్స్ అక్కడికి దగ్గరలో ఎక్కడుందో అడిగి తెలుసుకొని పోయి వేసొచ్చాడు.

అప్పుడు టైం చూసుకొంటే అయిదున్నర యింది. సురేష్ ఇంటికి వస్తాడనుకుంటూ బస్టాప్‌వైపు నడిచాడు.

హుషారుగా వుందతనికి. బస్టాప్‌లో బస్సుకోసం వెయిట్ చేస్తూవుంటే తనకో కొత్త లోకంలో వున్నట్టుంది.

సందడి సందడిగా ఒకదాని వెంట ఒకటి వరుసగా వచ్చిపోయే వాహనాలు, ఆగిన బస్సుల్లోకి హర్రీగా తోసుకొని ఎక్కడం, ఆగని బస్సుల్లోకి పరుగునపోయి ఎగిరి జొరబడడం, గుంపులు గుంపులుగా జనం ఆడా మగా 'హాయ్ హాయ్' అంటూ పలకరించుకోవడం, ద్విచక్ర వాహనాలమీద దూసుకొనిపోయే జంటలు.

వాళ్ళంతా హైదరాబాద్ వాళ్ళేకాదు. ఏ వూరేవూరివాళ్ళో, ఎక్కడెక్కడివాళ్ళో, ఉద్యోగ రీత్యా, వ్యాపారరీత్యా, ఏదో ఒక పనికోసం వచ్చినవాళ్ళే.

వాళ్ళని చూస్తూవుంటే రామకృష్ణకి గిల్టీగా వుంది.

బావిలో వుండే కప్ప అదేలోకం అనుకొంటుంది. తనూ అంతే. కందుకూరు పరిసర ప్రాంతమే ప్రపంచం అనుకొన్నాడు. శాఖవరమే స్వర్గం అనుకొన్నాడు.

అదంతా తన అజ్ఞానం అని తెలిసి అక్షరజ్ఞానం కలిగించి శేషగిరి మాష్టారు చెప్పిన భర్తృహరి సుభాషితాలలో 'విద్యా బంధుజనో విదేశగమనే' అనే శ్లోక వాక్యం గుర్తుకు వచ్చి విద్యకున్న గొప్పతనం ఏమిటో అప్పుడు తెలిసింది రామకృష్ణకి.

ఆ విద్యాగంధం లేకనే అమాయకులు మంచి, చెడు తెలుసుకోలేక అకృత్యాలకు పాల్పడుతున్నారు. కామ, క్రోధ, లోభ,

మోహ, మద, మాత్సర్యాలకు దాసులై పశుప్రాయులవుతున్నారు.

ఎంత ఆస్తివుంటే ఏం లాభం, అహంకారం వున్నవాళ్ళకి. అమ్మా నాన్న తలపుకు రాగానే వళ్లంతా జలదరించింది. తల విదిలించాడు.

ఎదురుగా తను ఎక్కవలసిన బస్సు ఎప్పుడు వచ్చి ఆగిందో కదిలిపోతూవుంది. పరుగునపోయి ఎగిరి వెనుక డోర్‌లోకి దూకి లోపలకు జొరబడ్డాడు.

ఇంటికి వెళ్ళేసరికి సురేష్ వచ్చివున్నాడు.

"ఎలా వుంది? " అని అడిగాడు.

"బావుంది. అందరూ క్లోజ్‌గా వున్నారు" చెప్పాడు రామకృష్ణ.

"ముందు ముందు ఇంకా బావుంటుంది. అన్ని ఫెసిలిటీస్ వున్నాయి ఆ కంపెనీలో"

"అవును తెలిసింది" రామకృష్ణ అంటూ వుంటే, "నువ్వెళ్ళి మొహం కడుక్కొనిరా బాబూ టీ ఇస్తాను" అని అన్నది వర్ధనమ్మ.

రామకృష్ణ మొహం కడుక్కొని వచ్చి వర్ధనమ్మ ఇచ్చిన టీ కప్పు అందుకొని కూర్చున్నాడు. టీ సిప్ చేస్తూ శేషగిరి మాష్టారుకి లెటర్ రాసిన సంగతి చెప్పాడు.

"మంచిపని చేశావు నాయనా" అని మెచ్చుకొంది వర్ధనమ్మ.

"రేపు లేదు. ఎల్లుండి చేరుతుంది. సంతోషంగా తిరుగు రాస్తాడు" అన్నాడు మోహనరావు.

వర్ధనమ్మ సురేష్‌ని చూసి "మీరుండే ఏరియాలో ఏదన్నా ఇల్లు చూడు సురేష్. ఫ్యామిలీని తెచ్చుకొంటాడు" అంది.

"అలాగే అత్తయ్యా చూస్తాను. మా దగ్గరలో చిన్న పోర్షన్ దొరకడం కష్టమే. అన్నీ పెద్ద పోర్షన్‌లే. అయినా ట్రై చేస్తాను. సుమతికి చెప్తాను. తనూ వాకబు చేస్తుంది" సురేష్ అంటూ వుంటే "సనత్‌నగర్‌లో కాకపోయినా ఆ పక్క ఎర్రగడ్డలోనయినా ఫర్వాలేదు. కాస్త ట్రై చేస్తే దొరుకుతాయి. వీలైనంత తక్కువ రెంటులో చూడండి" అని చెప్పింది.

"రేపే ఆ ప్రయత్నం చేస్తాను" అంటూ సురేష్ రామకృష్ణని చూసి, "ఒక పని చెయ్యండి రామకృష్ణగారూ. రేపు సాయంత్రం అయిందింటికి నేను మీ ఆఫీస్‌కు వస్తాను. అక్కడినుంచి ఇద్దరం మా ఇంటికి వెళదాం. సనత్‌నగర్‌లో తిరుగుదాం. అక్కడా దొరక్కపోతే ఎర్రగడ్డలో ట్రై చేద్దాం" అన్నాడు.

"అలాగే సార్" అంటూ తలూపాడు రామకృష్ణ.

మర్నాడు ఆఫీసులోంచి రామకృష్ణ బయటకు వచ్చేసరికి అప్పుడు సురేష్ హోండా దిగుతూ కనిపించి చిరునవ్వుతో విష్ చేశాడు.

రామకృష్ణ హుషారుగా చెయ్యెత్తి నమస్తే చెప్తూ అతని దగ్గరికి వెళ్ళాడు.

"వెళ్దామా" అని అడిగాడు సురేష్.

"ఆ వెళ్దాం" అన్నాడు రామకృష్ణ.

అంతే సురేష్ బండి తిప్పడం, రామకృష్ణ వెనక ఎక్కి కూర్చోవడం, అక్కడినించి కదిలి వెళ్ళిపోవడం క్షణంలో జరిగిపోయింది.

సురేష్‌తో బండిమీద పోతూవుంటే రామకృష్ణకి అతనిపట్ల అభిమానం పెరిగింది.

"మీరు నా గురించి చాలా శ్రమ పడుతున్నారు" అన్నాడు అప్రయత్నంగా.

వెంటనే సురేష్ ముందుకు చూస్తూనే క్షణకాలం తల పక్కకు తిప్పి, "ఏమిటి మిత్రమా అలా అంటున్నావు. నేనేం శ్రమ పడుతున్నానని. మనిషికి మనిషి సహాయం అంతే. సమాజంలో అందరూ సుఖంగా వుండాలి. ఒకరికొకరు సహాయ సహకారాలు అందించుకోవాలి. అప్పుడే మనిషి మనుగడ సాఫీగా సాగుతుంది. నేనూ పల్లెటూరివాడినే. ఒకరి సహాయంతోటే ఇక్కడ స్థిరపడ్డాను. నువ్వేం ఫీలవకు" అంటూ బండి పోనిస్తూవుంటే రామకృష్ణకి మనసు తేలికపడింది.

రాత్రి భోజనం చేస్తున్నప్పుడు వర్ధనమ్మ,





మోహనరావు చెరొక పక్కన కూర్చొని "మా సురేష్ చాలా మంచివాడు రామకృష్ణా! ఫ్రెండ్‌షిప్‌కి ప్రాణం ఇస్తాడు. కట్నానికి ప్రాధాన్యత ఇవ్వకుండా సుమతిని చేసుకొన్నాడు" అంటూ సురేష్ కంప్యూటర్ ఇంజనీరుగా నెలకు పదిహేనువేలదాకా సంపాయిస్తున్నాడని అమ్మాయీ, అల్లుడూ అన్యోన్యంగా వుంటారని, వాళ్ళకి ఇద్దరు పిల్లలని, మూడు సంవత్సరాల క్రితం సనత్‌నగర్‌లో స్థలం కొనుక్కొని అందులో ఇల్లు కట్టుకొని వుంటున్నారని చెప్పారు.

అప్పుడు-

అల్లుడుగదా గొప్పలు చెప్పుకొంటున్నారు అనుకొన్నాడు.

కానీ-

సురేష్ మాటతీరు, ప్రవర్తన, నిరాడంబరత చూస్తూవుంటే వాళ్ళు గొప్పలు చెప్పలేదనిపించి అతనిపట్ల గౌరవం పెరిగింది రామకృష్ణకి.

తనూ హైదరాబాద్‌లో స్థిరపడాలి. అందుకు సురేష్‌నుండి సహాయ సహకారాలు అందుతాయని అనుకొన్నాడు.

హోండా సనత్‌నగర్‌లో ఓ ఇంటిముందు ఆపాడు సురేష్. రామకృష్ణ దిగుతూ చూశాడు. సింపుల్‌గా వున్న పోర్షన్ అది. రోడ్డుకి రెండడుగుల ఎత్తులో వుంది.

సురేష్ బండిని లాక్‌చేసి వీధిగేటు తీస్తూవుంటే- దాని శబ్దానికి ఇంట్లో పిల్లల చేత హోంవర్క్ చేయిస్తున్న సుమతి "డాడీ వచ్చినట్టున్నారు" అంటూ వచ్చి కర్టెన్ తొలగించి చూసింది. సురేష్ వెనక రామకృష్ణ వుండడం చూసి రండి అంటూ కర్టెన్ తలుపు మీదకి వేసి లోపలకి నడిచింది.

"డాడీ" అంటూ లేచి రాబోయిన పిల్లలిద్దరూ రామకృష్ణని చూసి ఆగిపోయారు.

సురేష్ వాళ్ళని పిలిచి రామకృష్ణని చూపిస్తూ, "అంకుల్‌కి నమస్తే చెప్పండి" అన్నాడు.

వెంటనే పిల్లలిద్దరూ బిడియం లేకుండా "నమస్తే అంకుల్" అని చెప్పారు.

"ఇది మాలతి ఫస్ట్‌క్లాస్ చదువుతోంది. వీడు కిరణ్ యు.కేజి" అంటూ పిల్లల్ని రామకృష్ణకి పరిచయం చేశాడు.

స్నానంచేసి నీట్‌గా డ్రస్ చేసుకొని ముచ్చటగా వున్నారు. వాళ్ళ దగ్గర ఫేస్ పౌడర్ వాసన గుబాళించింది.

క్షణకాలం రామకృష్ణకి నరేష్, మహేష్‌లు గుర్తుకువచ్చి మనసు విలవిల్లాడింది. వాళ్ళని ఇంకా స్కూల్లో వేయనందుకు గిల్టీగా ఫీలయ్యాడు.

సోఫాలో కూర్చోబోతుంటే సుమతి మంచినీళ్ళు తెచ్చిచ్చింది.

"మొహం కడుక్కో రామకృష్ణా! టీ తాగేసి వెళ్దాం" అన్నాడు సురేష్.

రామకృష్ణ మంచినీళ్ళు తాగి గ్లాసు టీపాయ్‌మీద పెట్టాడు.

మరో రెండు నిమిషాల్లో టీ తెచ్చి ఇచ్చింది సుమతి.

వాళ్ళు టీ సిప్ చేస్తూవుంటే, "ఇక్కడ దగ్గరలో చిన్న పోర్షన్‌లు ఏం లేవండీ. నేను విచారించాను. అవతలి లైన్లో రెండు వున్నాయిగానీ పెద్దవి. వెయ్యి, పన్నెండు వందల్లో వున్నాయి" అని చెప్పింది సుమతి.

రెంట్ వినగానే రామకృష్ణకి నీరసం వచ్చేసింది.

"జీతంలో సగం అద్దెకేపోతే ఇంక తినడానికి ఏం వుంటుంది. ట్రై చేద్దాం. ఇవాళ కాకపోతే రేపు. రేపు కాకుంటే ఎల్లుండి. ఎక్కడో ఒకచోట దొరుకుతుందిలే అయిదారువందల్లో" అన్నాడు సురేష్ కప్పు స్టూల్ మీద పెడుతూ.

ఆ మాటలు రామకృష్ణకి కాస్త ఉపశమనం కలిగించాయి.

★ ★ ★

సూర్యోదయం అవుతూవుంది. వెలుగురేఖలు విచ్చుకోడానికి ఉబలాటపడుతున్నాయి.

అప్పటికే శేషగిరి మాష్టారు కాలకృత్యాలు

ముగించుకొన్నాడు. దొడ్లో వున్న గిలకబావి దగ్గరకు వెళ్ళి నాలుగు బక్కెట్ల నీళ్లతో తల స్నానం చేసి సూర్యునికి చేతులు జోడించాడు.

ఆరడుగులకు మూడు అంగుళాల తక్కువ ఎత్తులో ఆజానుబాహుడిలా పొడవుకు తగ్గ లావుతో హుందాగా కనిపించే రూపం. తెల్లటి పంచ, లాల్చీ, భుజంపైన మడతలు మడచిన పైపంచ, చూడగానే నమస్కరించాలనే ముఖవర్చస్సు.

భారత, భాగవత, రామాయణాలే కాక, సాహితీ జగత్తులో విరిసిన కావ్యసుమాల పరిమళాలు ఆయనకు కరతలామలకమే. సందర్భాలను బట్టి సమయస్ఫూర్తిగా ఆయా కావ్యాల కథాంశాలను ఆవిష్కరించి శ్రోతల్ని ఆకర్షించే స్వచ్ఛమయిన వాక్చాతుర్యం ఆయనది. తాను అక్షరజ్యోతి వెలిగించిన తన శిష్యులు భావిభారతంలో మహోన్నతమయిన వ్యక్తిత్వంతో జ్ఞానజ్యోతులై ఉత్తమ పౌరులుగా వెలగాలని ఆయన ఆకాంక్ష.

అందుకు తను బడిపొలంలో కర్షకుడై సేద్యం చేస్తున్నాడు. ఆయన సేద్యంలో ఎన్ని మొక్కలు పెరిగి పెద్దవైనాయో. ఎక్కడెక్కడ విరులై వికసిస్తున్నాయో. డాక్టర్లుగా, ఇంజనీర్లుగా ఆయన శిష్యులు దేశవిదేశాలలో వున్నారు. బ్యాంక్ ఉద్యోగులుగా, పోలీసు ఆఫీసర్లుగా రకరకాల ఉద్యోగాలు చేస్తున్నారు.

అదే ఆయనకి ఆనందం.

ఏ శిష్యుడయినా ఎదురుపడి "నేను మీ శిష్యుణ్ణి మాష్టారూ. ఫలానాచోట ఫలానా ఉద్యోగం చేస్తున్నాను" అని చెప్తే అప్పుడు కలిగే ఆనందం ఆయనకి ఎంత ధనం ఇచ్చినా రాదు.

ఆయనకి బడి దేవాలయం.

సూర్యనమస్కారం ముగించి ఇంట్లోకి రాగానే పద్మావతమ్మ పీటవేసి మిరప్పొడితో వేడి వేడి ఇడ్లీలు తెచ్చిపెట్టింది. శేషగిరి మాష్టారు ఇడ్లీ తుంచి మిరప్పొడిలో అద్దుకొని నోట్లో పెట్టుకోగానే కొరబోయింది.

"ఎవరో తలచుకొంటున్నారు" అంది పద్మావతమ్మ.

"సాయంకాలం కందుకూరు పోయి హైదరాబాదు ఫోను చెయ్యాలి. రామకృష్ణ పరిస్థితి ఎలా వుందో? " అన్నారు శేషగిరి మాష్టారు.

"దేవుడు చల్లగానే చూస్తాడు"

"చూస్తే మంచిదే, అంతకుమించి ఏం కావాలి? "

శేషగిరి మాష్టారు ఇడ్లీలు తిని కాఫీ తాగి బడికి వెళ్ళారు.

కాంపౌండ్‌లో ఆడుకొంటున్న పిల్లలు "సార్ వచ్చాడు" అంటూ ఎక్కడివాళ్ళు అక్కడ సైలెంట్ అయిపోయారు.

"సార్ గంట కొట్టేదా? " అంటూ ఐదో తరగతిలోని రజనీకాంత్ మాష్టారు ముందుకు వచ్చాడు.

"పది నిమిషాలాగు" మాష్టారు చెప్పగానే నీరసం వచ్చిన వాడిలా వెనక్కు వెళ్ళిపోయాడు.

ఆ స్కూల్లో గంట కొట్టడానికంటూ ప్రత్యేకంగా ప్యూన్ లేదు. పిల్లలచేతనే కొట్టించడం అలవాటు. అందుకని పిల్లలు గంట కొట్టడానికి నేను నేనంటూ పోటీపడి ముందుకొస్తుంటారు. స్వీపర్ మాత్రం పొద్దున్నే వచ్చి చిమ్మి శుభ్రం చేసి వెళ్ళిపోతుంది. ఉపాధ్యాయులు మాత్రం నలుగురు పనిచేస్తున్నారు.. అందులో శేషగిరి మాష్టారు ఒక్కరే శాఖవరంలో కాపురం వుండేది. మిగిలిన ముగ్గురూ ఆ వూరికి పది కిలోమీటర్ల దూరంలో వున్న కందుకూరు టౌన్‌లో కాపురం వుంటూ రోజూ బస్సులో వచ్చిపోతుంటారు.

శేషగిరి మాష్టారు కూడా కందుకూర్లో కాపురం వుండొచ్చు. అది ఆయనకి ఇష్టం లేదు. అధ్యాపక వృత్తి ఆయనకి దైవం. ఆ వృత్తికి పూర్తి న్యాయం చెయ్యాలన్నదే ఆయన ధ్యేయం. దేశానికి పట్టుగొమ్మల





యిన పల్లెలు విద్యావనాలయితే దేశం ప్రగతి సుమాలను విరజిమ్ముతుందని ఆయన విశ్వాసం. అందుకనే ఉద్యోగం చేసే వూళ్ళోనే కాపురం వుంటూ గ్రామస్థుల్లో ఒకడై వాళ్ళకి పథ నిర్దేశకుడు కావాలనే లక్ష్యం ఆయనది. కనుకనే ఆయనకి పరిచయాలు ఎక్కువ. పచ్చటి పైరు పొలాల మధ్య ముచ్చటగా వుండే పల్లె వాసానికి అంకితమయిపోయాడు.

కోడిపుంజుల కొక్కొరొక్కోల మేలుకొలుపులతో లేచే ఆ పల్లె వాతావరణానికి, వల్లమాలిన అభిమానం కనబరిచే అక్కడి ప్రజలకి బాగా అలవాటు పడ్డాడు.

రజనీకాంత్‌ని పిలిచి గంట కొట్టమనగానే వాడు పరిగెత్తుకొంటూ పోయి గణగణమంటూ శక్తికొద్దీ గంట మోగించాడు. అప్పుడే తక్కిన ముగ్గురు మాస్టార్లూ వచ్చారు. రెండోగంట కొట్టగానే ఎవరిపాటికి వాళ్ళు అందరూ వచ్చి ప్రార్థనకు నిలబడ్డారు.

అది రోజూ జరిగే కార్యక్రమమే. అయినా భక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు. దానివల్ల క్రమశిక్షణ, దైవభక్తి, దేశభక్తి పిల్లలకు చిన్నతనంనుండే అలవడుతాయనే నమ్మకం.

వందేమాతర గీతంతో ప్రారంభించి మా తెలుగు తల్లికి మల్లెపూదండను పాడించి, ప్రతిజ్ఞ చెప్పించి ముగించారు.

క్లాసులో పాఠం చెప్తున్న శేషగిరి మాష్టారుకి పోస్ట్‌మాన్ వచ్చి లెటరిచ్చి వెళ్ళిపోయాడు. ఫ్రమ్ అడ్రస్‌లో రామకృష్ణ, హైదరాబాద్ అని వుండడంతో ఆతృతగా తెరిచి చదివాడు. మనసుకి సంతోషం కలిగింది. చెప్తున్న పాఠం పది నిముషాల్లో పూర్తిచేసి "క్లాసు చూస్తూ వుండండి, అరగంటలో వచ్చేస్తా" అని పక్క మాష్టారికి చెప్పి రామకృష్ణకి ఉద్యోగం దొరికిన విషయం అతని భార్య లక్ష్మికి చెప్పాలని కాలనీకి వెళ్ళాడు.

ఆ వార్త వినగానే లక్ష్మికి వాడిపోతున్న మొక్కకు వానజల్లు కురిసి ఊపిరి పోసినట్లయింది. శేషగిరి మాష్టారుకేసి చెమ్మగిల్లిన కళ్ళతో కృతజ్ఞతా భావంతో చూసింది.

"ఈ విషయం వాళ్ళ అమ్మానాన్నకు చెప్పివస్తాను" అన్నాడు శేషగిరి మాష్టారు అక్కడ పది నిమిషాలుండి లేస్తూ.

"వాళ్ళు మిమ్మల్ని మంచిగా అర్థం చేసుకోరు బాబాయిగారూ. పైగా నోరు జారతారు. ఈరోజు స్వాతి పుట్టినరోజు పండుగ జరుపుకుంటుంటారు" అని చెప్పింది లక్ష్మి.

"అయితే ఏమవుతుందమ్మా. ఎవరి పాపం వాళ్ళది. విషయం చెప్దాం. సహృదయం వుంటే సంతోషిస్తారు. లేకుంటే లేదు" అని అక్కడినుండి రాఘవయ్యగారి ఇంటికి వచ్చాడు.

ఆ సమయంలో రాఘవయ్య, అతని భార్య భూదేవమ్మ, వాళ్ళ మనుమరాలు స్వాతి ముగ్గురూ పంచలో కూర్చుని పాయసం తాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళను చూడగానే స్వాతి పుట్టిన రోజని లక్ష్మి చెప్పినమాటలు గుర్తుకువచ్చాయి.

స్వాతి తల స్నానం చేసి ఖరీదైన బట్టలు కట్టుకుని వుంది. మెడలో రాళ్ళ నెక్లెస్, ముత్యాలదండ, చేతులకు వంకీల గాజులు, చెవులకు బుట్టకమ్మలు... కళగా కనిపిస్తోంది.

శేషగిరి మాష్టారు రావడం చూసి వాళ్ళ మొహాల్లో చిరాకు మొదలైంది. మర్యాదకి అయినా రండి అనలేదు వాళ్లు. పైగా ఆయన రాక అరిష్టంగా భావించి కనీసం కూర్చోమని కూడా అనలేదు.

"ఏమిటి వచ్చావు?" అన్నట్లు మొహం చిట్లించి ఆయన మొహంలోకి చూశారు.

వాళ్ళు మర్యాద చెయ్యలేదని శేషగిరి మాష్టారు బాధపడలేదు. "రాఘవయ్యగారూ మీ అబ్బాయి రామకృష్ణకి హైదరాబాదులో ఉద్యోగం వచ్చింది" అని చెప్పాడు.

"ఆ విషయం మాకెందుకు చెప్తావు?" అని రుసరుసమని అన్నాడు రాఘవయ్య.

అలా అంటాడని శేషగిరి మాష్టారు ఊహించలేదు. క్షణంసేపు ఖంగుతిన్నాడు. తర్వాత తేరుకొని, "మీ కొడుకు కదా అందు కని వచ్చి విషయం చెప్తున్నాను... అంతే" అన్నాడు.

"ఇంకెప్పుడూ మాకు వాడి సంగతి చెప్పద్దు" ఛీత్కరించుకుంటూ నిర్దాక్షిణ్యంగా అన్నాడు రాఘవయ్య.

అప్పుడు శేషగిరి మాష్టారు రాఘవయ్యను పరిశీలనగా చూశాడు.

"చూడండి రాఘవయ్యగారూ! మిమ్మల్ని గురించి మీరేమనుకుంటున్నారో తెలియదు కానీ భూమి మాత్రం గుండ్రంగానే వుందండీ. మంచితనం ఒక్కటే మనిషిని కాపాడుతుంది. చెడుమాత్రం కాదు. అది కొరుక్కుతింటుంది. ఆ విషయం తెలుసు కోండి. బాధ్యతలు విస్మరిస్తే అభాసుపాలవు తారు. మిమ్మల్ని మీరు సంస్కరించుకోండి" అనేసి అక్కడినుండి వెనక్కి తిరిగి రెండడు గులు నడిచాడు.

"అంతా ఈ పంతులే చేస్తున్నాడు" అంది భూదేవమ్మ ఉక్రోషంగా.

ఆ మాటలు శేషగిరి మాష్టారు చెవిలో పడ్డాయి. వెనక్కి తిరిగి భూదేవమ్మకేసి చూసి "నా గురించి మీరు ఎలా అనుకున్నా ఫర్వాలేదమ్మా. కళ్ళముందు కనిపించే అందరూ సుఖంగా జీవించాలి. అదే నా ఉద్దేశ్యం. మిమ్మల్ని గురించి ఒక్కసారి మీరు ఆలోచించుకోండి. అడుక్కునేవాడు కూడా తన బిడ్డ అడుక్కోవడానికి బొచ్చె అయినా ఇస్తాడు తెలుసా" అన్నాడు.

భూదేవమ్మకు కోపం వచ్చింది.

"ఇదుగో పంతులూ మాటలు జాగ్రత్తగా రానీయ్" అంటూ లేచింది.

శేషగిరి మాష్టారు చలించలేదు. స్థిరంగా నిలబడిపోయాడు.

"పైన దేవుడున్నాడు. అన్నీ చూస్తుం టాడు. మనం ఒకటి చెయ్యబోతే ఆయన ఇంకొకటి చేస్తాడు" అనేసి అక్కడుండటం ఇష్టంలేక వచ్చేశాడు.

ఇంకా అక్కడే ఉంటే గొడవ అవుతుంది. రాఘవయ్యకి ఆవేశం ఎక్కువ. పట్టుదలా మొండితనం వున్న మనిషి. మాట అంటే ముందు తగాదాకి దిగుతాడు. ఆయన భార్య భూదేవమ్మ కూడా అదే తీరు మనిషి. తగాదాకు రాఘవయ్యకంటే ముందుగా వుంటుంది. ఒకటి అనమంటే పది పెట్టి గానీ రాదు.

శేషగిరి మాష్టారుకి వాళ్ళ మనస్థత్వాలు, వాళ్ళ ప్రవర్తనా తెలుసు. ఎన్నన్నా అమ్మా నాన్నా కదా, కొడుక్కి వుద్యోగం వచ్చిందని తెలిస్తే సంతోషపడతారని అనుకున్నాడు. కానీ వాళ్ళ ప్రవర్తన సహించరానిది. కన్న కొడుకుని అంటరానివాడిగానూ, చంపదగిన శత్రువుగానూ అనుకుంటున్నారు.

ఆస్తికోసం అన్నదమ్ములు తలలు పగల గొట్టుకోవడం, చంపుకోవడం చూశాడు. అమ్మానాన్నలకి అన్నం పెట్టని కొడుకులను చూశాడు.

కానీ-

ఇదేమిటీ?

వీళ్ళ ప్రవర్తన ప్రకృతికి విరుద్ధంగా వుంది.

అది శాడిజమా? కాదే...

మరి మూర్ఖత్వమా? అజ్ఞానమా?

ఆలోచిస్తున్న శేషగిరి మాష్టారుకి నవ్వొ చ్చింది. అరిచేతిని అడ్డుపెడితే సూర్యో దయం ఆగుతుందా?

రామకృష్ణ అయిదో తరగతిలోకి వచ్చిన మూడు నెలలకే శేషగిరి మాష్టారుకి వేరే ఊరికి బదిలీ అయ్యింది. అది తెలిసి రామ కృష్ణ బిక్కమొహం పెట్టాడు. అ, ఆలు రాయించి అక్షరాభ్యాసం చేసిన రోజునుండీ వాడికి శేషగిరి మాష్టారితో మంచి సాన్ని హిత్యం ఏర్పడింది. ఆ మాష్టారి మాటలకి, ఆయన చెప్పే సూక్తులకి, హితోక్తులకి బాగా ఆకర్షితుడయ్యాడు.

చదువుపట్ల వాడికి వున్న శ్రద్ధాసక్తులకు

శేషగిరి మాష్టారు ముగ్ధుడయ్యాడు. వాడి మితభాషిత్వం, వినయవిధేయతలు, చక్కని దస్తూరీ చూసి రాణిస్తాడనుకున్నాడు.

ఆ ఊరినుంచి వెళ్ళిపోయేరోజు రాఘవయ్యగారి ఇంటికి వెళ్ళి, "రామకృష్ణని బాగా చదివించండి" అని చెప్పాడు.

"ఎందుకు చదివించం. వాడు ఎంతవరకూ చదువుకుంటే అంతవరకూ చదివిస్తాం" అన్నాడు రాఘవయ్య.

"వాడికి చదువుకోవాలనే వుంది. మీరు కాస్త శ్రద్ధ తీసుకోవాలి. ఎందుకంటే ఇక్కడ చాలామంది పిల్లల్ని ఐదవ తరగతితో చదువు ఆపుచేయించి పొలంపనిలో పడేస్తున్నారు. మీరాపని చెయ్యకండి. ఒక్కడే కొడుకు. కూతురు. పార్వతిని ఎలాగూ మానిపించారు" శేషగిరి మాష్టారు అంటూ వుంటే, "దానికి చదువెందుకులే పంతులూ... పెద్దమనిషి అవ్వగానే మా బావమరిదికి ఇచ్చి పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాం" అని చెప్పాడు రాఘవయ్య.

"సరేలెండి అయ్యిందేదో అయిపోయింది. రామకృష్ణని మాత్రం చదువు మాన్పించకండి" అని చెప్పి వెళ్ళిపోయాడు శేషగిరి మాష్టారు.

అప్పుడు శాఖవరంనుండి వెళ్ళిన ఆ మాష్టారు పదిహేను ఏళ్ళకి అదే ఊరి స్కూలుకి బదిలీ అయి వచ్చాడు.

అప్పటికి రామకృష్ణ ముగ్గురు కొడుకుల తండ్రి అయ్యాడు. పెద్దవాడు నరేష్‌కి నాలుగేళ్ళు, రెండోవాడు మహేష్‌కి రెండేళ్ళు, మూడోవాడు గణేష్‌కి ఆరవనెల.

లంఖణాలు చేసినవాడిలా పీక్కుపోయిన మొహం, పెరిగిన గడ్డం, దిగులు, విచారంతో బలహీనంగా రామకృష్ణ వుండడం చూసి అయోమయం అయ్యింది శేషగిరి మాష్టారుకి.

"నేను శాపగ్రస్థుణ్ణి మాష్టారూ" అని శేషగిరి మాష్టారుకి ఎదురుగా వచ్చి కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

శేషగిరి మాష్టారు చలించిపోయాడు. ఏం జరిగిందోనని విషయం తెలుసుకోడానికి ప్రయత్నిస్తే "నాకు చచ్చిపోవాలనుంది మాష్టారు. భార్యా పిల్లలూ ప్రతిబంధకాలుగా వున్నారు. వాళ్ళు ఏ ఆధారమూ లేక అనాథలవుతారన్న ఆలోచన భయంకరంగా కనిపిస్తోంది. లేకపోతే..." ఆ తర్వాత రామకృష్ణ నోట మాటలు దొర్లలేదు.

రామకృష్ణకేసి చూశాడు శేషగిరి మాష్టారు.

"నా పరిస్థితి మీకు తెలిస్తే జాలిపడతారు మాష్టారు. చెప్పుకోవాలంటే సిగ్గుగా వుంది. చెప్తే నమ్మరు. మా అమ్మానాన్నకి నేను, నా భార్యాపిల్లలు కొరగాని వాళ్ళం అయ్యాం మాష్టారు. ఇంట్లో మా అక్కదే పెత్తనం అయ్యింది. ఆమె పెద్ద కూతురు స్వాతిని చిన్నప్పటినుంచీ మేమే తెచ్చి పెంచుకున్నాం. ఇప్పుడు దానికి వున్న స్థానం ఇంట్లో నాకు లేదు. రోజూ గొడవే. నేను చదువుకోవాలని ఎంత మొత్తుకున్నా వినకుండా బి.కాం. తోటే ఆపుచేయించి పెళ్ళిచేశారు. ఇప్పుడేమో నన్నూ, లక్ష్మినీ, పిల్లల్నీ శత్రువుల్లా చూస్తున్నారు. నాకు తోచడం లేదు. వేరే వుందామంటే ఒక్కడే కొడుకు భార్య మాటలు విని వేరుకాపురం పెట్టాడని అనుకుంటారు. అనుకుంటే అనుకొన్నారులే అని ధైర్యం చేస్తే ఎలా బతకాలి. నాకేపనీ రాదు. ఏదన్నా ఉద్యోగంలో చేరదామంటే ఇప్పటికిప్పుడు నాకేం ఉద్యోగం వస్తుంది. దిక్కు తోచడంలేదు" రామకృష్ణ చెప్తూ వుంటే విషయం అర్థమయ్యింది శేషగిరి మాష్టారుకి.

రామకృష్ణ సెవెన్త్ క్లాస్ చదువుతున్నప్పుడే పార్వతిని భూదేవమ్మ తమ్ముడు శివరామయ్యకిచ్చి పెళ్ళి చేశారు. ఆమెకి ముగ్గురు కూతుళ్ళు. పెద్దకూతురయిన స్వాతిని ఆరు నెలల వయసప్పుడే భూదేవమ్మ, రాఘవయ్య తమదగ్గరే వుంచుకొని ప్రేమగా పెంచుకున్నారు. వాళ్ళకి లక్ష్మి పరాయిద



య్యింది. చీటికీ మాటికీ ఛీత్కరింపులు, చీదరింపులు, అత్త అధికారం, ఆడబిడ్డ అహంకారం కలిసి ఆమెమీద పనిచేస్తు న్నాయి.

అలాంటి సంఘర్షణలు ఎక్కడో తప్ప అన్ని ఇళ్ళలో సర్వసాధారణమే. అవే కాల క్రమంలో సర్దుకుంటాయి అనుకున్నాడు శేష గిరి మాష్టారు.

కానీ ఆ అగ్నిగుండం ఆరేదికాదు. కూతు రుగా పార్వతికి ఆ ఇంట్లో స్థానం అలానే వుంది. ఆమెకి ముగ్గురూ కూతుళ్ళేకావడం, లక్ష్మికి ముగ్గురూ కొడుకులే అవడం. వాళ్ళు తన కూతుళ్ళకన్నా చిన్నవాళ్ళు కావడం సహించరానిదై ఆమెలో లక్ష్మిపట్ల ఈర్ష్యా అసూయలు పెనవేసుకుని బుసలు కొడుతు న్నాయి.

అరుపులూ, కేకలూ, ఈసడింపులూ, ఏడు పులతో ఇల్లు రణరంగంగా మారింది. లక్ష్మిని ఒంటరిని చేసి భూదేవమ్మా, పార్వతి, స్వాతి చెవులు కొరుక్కోవడం, వాళ్ళు చెప్పే మాటలు రాఘవయ్య చెవికె క్కించుకుని ఆవేశపడడం దినదిన గండంగా వుంది.

★ ★ ★

అమ్మానాన్నా, అక్కేగదా అనుకొని రామకృష్ణ ఎంత సహనంగా ఉందామను కున్నా ఉండలేకపోతున్నాడు. ఏదో ఒక సందర్భంలో కోప్పడి అరవడం, అందుకు "ముందు నీ పెళ్ళానికి బుద్ధి చెప్పు" అని పార్వతి దెప్పడం, "పెళ్ళాం మాటలు విని పైకొస్తావురా?" అంటూ అమ్మానాన్నా రంకెలేసి తగాదాకు రావడం, ఇంటి ముందు జనం చేరి వింతగా చూస్తుంటే సభ్యత గుర్తుకు వచ్చి తననుతాను తమా యించుకోవడం...

రామకృష్ణ పరిస్థితి అర్థం చేసుకున్న శేష గిరి మాష్టారికి అతనిపట్ల జాలి కలిగింది.

చదువు నేర్పిన సంస్కారం అతనిని విజ్ఞత కోల్పోనియ్యకుండా చేసింది. అక్ష రాలు దిద్దుకున్న తొలిరోజుల్లో మాష్టారు పలికించిన మాతృదేవోభవ, పితృదేవోభవ అనే పదాలు హృదయంలో హత్తుకుని పోయి సృష్టిలో అమ్మానాన్నల స్థానం ఎంత గొప్పదో వాళ్ళకు ఇవ్వవలసిన గౌరవం ఎంత పవిత్రమైనదో తెలిసింది.

ఫైనల్ బి.కాం. పరీక్షలు రాసి ఇంటికి రాగానే అమ్మానాన్నలు పెళ్ళి ప్రయత్నాలు చేస్తుంటే "నాకిప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు. యూనివర్సిటీకి పోయి ఎం.కాం. చెయ్యాలి" అని చెప్పాడు.

ఆ మాటలు వాళ్ళకు నచ్చలేదు.

"ఇంకా ఏం చదువు? బి.కాం. చదివా వుగా అది చాల్లే" అన్నాడు రాఘవయ్య.

"అదేందిరా మాకు దూరంగా పోతానం టావు" అంది భూదేవమ్మ.

పార్వతి ఏయే ఊరినుండి సంబంధాలు వస్తున్నాయో చెప్పి ఎవరెవరు ఎంతెంత కట్నం ఇస్తారో చెప్పింది.

రామకృష్ణకి అప్పుడే పెళ్ళి చేసుకోవాలని లేదు.

అమ్మానాన్నల మాట కాదనలేడు. వాళ్ళు దైవస్వరూపులు. బిడ్డ సుఖసంతోషాలు కోరుకుంటారే తప్ప వేరే ఆలోచన వుండదు.

తను చదువుకోవాలని, వాళ్ళు పెళ్ళి చెయ్యాలని. ఏం చెయ్యాలో తోచలేదు.

"చదువుకున్నవాళ్ళకి ఉద్యోగాలు లేక బజార్ల వెంట తిరుగుతున్నారు. డబ్బూ పలుకుబడి వుంటేనే అది దొరికేది. పెళ్ళి చేసుకుని పొలంపని చేసుకో" అని చెప్పాడు శివరామయ్య.

ఇంట్లో అందరిదీ ఒకటేమాట. వాళ్ళకి పెళ్ళి ఆలోచన తప్ప మరింకేంలేదు. అదే పట్టుమీద ఉన్నారు.

రామకృష్ణ ఆలోచించసాగాడు. మొండిగా అమ్మానాన్నలకు ఎదురు చెప్పలేడు. అలా





అని చదువు ఆపడం ఇష్టంలేదు.



ఆ రోజు...

ఆ ఊరికి పది మైళ్ళ దూరంలో వున్న పాలెంనుండి కుమారయ్య వచ్చాడు వాళ్ళ చెల్లెల్ని ఇవ్వడానికని. శివరామయ్యతో వాళ్ళ ఇంటి విషయాలు చెప్పాడు.

"మా చిన్నప్పుడే నాన్నగారు పోయారండీ. మా అమ్మే మమ్మల్ని పెంచింది. నేను చదువుకోలేదు. నాలుగు ఎకరాల మెట్టపొలం వుంటే దాన్ని సాగు చేసుకుంటున్నాను. మా చెల్లెలు మాత్రం ఏడు తరగతులు చదువుకొంది. ఇంటిపనులన్నీ చక్కగా చేస్తుంది. ఒకసారి వచ్చి చూడండి. నచ్చితే అన్ని విషయాలూ మాట్లాడుకుందాం" అని చెప్పాడు.

కుమారయ్య మాటతీరు బాగా నచ్చింది.

"సరే... రేపులేదు ఎల్లుండి వస్తాం" అని చెప్పాడు శివరామయ్య.

రామకృష్ణ అవాక్కయ్యాడు. కనీసం తనతో విచారించకుండానే శివరామయ్య అలా అనడం నచ్చలేదు. అసహనంగా వుంది. అప్పుడు తను అడ్డుచెప్తే బావ బాధ పడతాడని నోరు మెదపలేకపోయాడు.

యాంత్రికంగా ఆ మరుసటిరోజు అక్కా, బావలతో పాలెం పెళ్లిచూపులకి వెళ్ళక తప్పలేదు.

చిన్న పెంకుటిల్లు వాళ్లది. వెనకాముందు పంచ, మధ్యలో హాలు, దొడ్లో బావి, బాత్రూమ్, సన్నజాజుల చెట్టు ముచ్చటగా వుంది.

ముందు పంచలో రెండుమంచాలు వేసి పరుపులు పరిచి వుంచారు. కాళ్ళూచేతులూ కడుక్కోడానికని పంచ మెట్లమీద బకెట్‌తో నీళ్ళు పెట్టారు.

రామకృష్ణ, శివరామయ్య కాళ్ళు కడుక్కొని వచ్చి చెరొక మంచంమీద కూర్చున్నారు. పార్వతి నేరుగా ఇంట్లోకి నడిచింది.

కుమారయ్య భార్య మాధవి మంచినీళ్ళు ఇచ్చి కాఫీకని పొయ్యిమీద డికాషన్ పెడుతూ వుంటే పార్వతి ఇంట్లోంచి బయటకు వచ్చి రామకృష్ణ పక్కన కూర్చుని, "అమ్మాయి బావుంది" అని చెవిలో చెప్పేసి పోయింది.

మాధవి అందరికీ కాఫీలు అందించి అమ్మాయిని చూపించడానికి నట్టింట్లో చాప పరిచి గోడవారగా కుర్చీలు వేసింది. బయటకు వచ్చి రామకృష్ణా వాళ్ళని లోపలికి ఆహ్వానించింది. వాళ్ళు కూర్చోగానే అమ్మాయిని తీసుకుని వచ్చి చాపమీద కూర్చోబెట్టి తనూ ఆమె పక్కనే కూర్చుంది. పార్వతి వచ్చి రెండోవైపున కూర్చుంది. అమ్మాయి తల్లి శాంతమ్మ వెనుక వాకిట్లోకి వచ్చి కూర్చుంది. అప్పటిదాకా ఆమె వితంతువనని దొడ్లోనే వుంది.

"అమ్మాయితో మాట్లాడు బాబూ" అంది.

ఇబ్బందిగా అమ్మాయికేసి చూస్తున్న రామకృష్ణకి కాస్త ధైర్యం వచ్చింది. ఒకటో తరగతినుండి డిగ్రీవరకు అమ్మాయిలతో కలిసి చదువుకొన్నాడేగానీ అతనికి వాళ్ళతో పరిచయంలేదు.

"మీ పేరేమిటి? " అనడిగాడు.

"లక్ష్మి" అని అమ్మాయి కాస్త తల పైకెత్తి రామకృష్ణని చూసింది.

పచ్చటి మొహం, ఎర్రటిబొట్టు, కాటుకతో మెరుస్తున్న అందమైన కళ్ళు, మొనదేలిన ముక్కు, ఎర్రటి పెదాలు... చూపులు మరల్చుకోవాలనుకున్నా మరల్చుకోలేకపోయాడు.

మూడుపేటల ముత్యాలదండతో శంఖం మెడ అందంగా కనిపిస్తూ వుంటే ఇంకా మాట్లాడాలనిపించింది.

"ఎంతవరకు చదువుకున్నారు" అడిగాడు.

"ఏడో తరగతి వరకు"

ఇంక ఏం అడగాలో తోచలేదు.

"నువ్వూ ఏదన్నా అడుగు" పార్వతి లక్ష్మిని ఉద్దేశించి అంది.

అందుకు లక్ష్మి పార్వతికేసి చూసి చిరునవ్వు నవ్వింది. ఆమె ఏదన్నా అడుగుతుందేమోనని ఎదురుచూశారు. కానీ పెదవి కదపనేలేదు.

మౌనంగా రెండు నిమిషాల కాలం గడిపింది.

ఏం మాట్లాడకుంటే బావుండదని "మీ పేరు చెప్పండి అన్నయ్యగారూ?" అని మాధవి అడిగింది.

"రామకృష్ణ" చెప్పాడు.

"మీరూ ఏదన్నా మాట్లాడండి" కుమారయ్య శివరామయ్యతో అన్నాడు.

"నేను మాట్లాడడానికి ఏం వుంటుంది" శివరామయ్య అంటూ వుంటే "అమ్మాయికి ఇంటి పనులన్నీ తెలుసు. ఒకరి జోలికి పోదు. ఒకరి ప్రస్తావన పట్టించుకోదు. అది కావాలి, ఇది కావాలి అని అడిగే మనిషి కాదు" అని శాంతమ్మ చెప్పుకుపోతూ వుంది.

లక్ష్మి వదిన కేసి చూసింది.

"ఇంకా ఏదన్నా అడుగుతారా అన్నయ్యగారూ?" అని మాధవీ రామకృష్ణని అడిగింది.

రామకృష్ణ లక్ష్మికేసి చూశాడు.

ఏం అడుగుతాడోనని తలెత్తి చూసిన లక్ష్మి చూపులు రామకృష్ణ చూపులతో కలిసిపోయి అప్రయత్నంగా ఇద్దరికళ్ళూ పలకరించుకోవడం, పెదాలు నవ్వుకోవడం క్షణంలో జరిగిపోయింది.

రెండు నిమిషాలు గడిచాయి.

మాధవి లక్ష్మిని లోపలికి తీసుకుపోయింది. కక్కొచ్చినా, కళ్యాణం వచ్చినా ఆగదన్నట్టు అప్పుడే కట్నకానుకల ప్రస్తావన రావడం, ఇరువర్గాల మధ్యా ఒక అవగాహన కుదరడం, మంచిరోజు చూసుకుని ముహూర్తాలు పెట్టుకోవడం, అంతా ఒక నెలలోనే.

★ ★ ★

లక్ష్మి కాపురానికి వచ్చింది.

వచ్చినరోజు స్వాతిని ఆప్యాయంగా ఎత్తుకొని ముద్దాడి అందరితో కలిసిపోయింది.

రామకృష్ణకి హుషారుగా వుంది.

రాత్రి వెంట పగలు, పగలునంటి రాత్రి పరుగులు తీస్తున్నాయి.

భర్త సాత్వికుడు, సంస్కారవంతుడు అని సంతోషిస్తున్న లక్ష్మికి అత్తా, ఆడబిడ్డల వాస్తవ మనస్థత్వాలు తెలిసి ముందు ముందు కాపురం చెయ్యడం కత్తిమీద సాము అని భయపడింది.

ఇద్దరిదీ ఒకటే మాట. గొంతెత్తితే కంచు మోగినట్లే.

పార్వతికి పెళ్ళయి ఎనిమిదేళ్ళు దాటినా ఆమెకి పుట్టింట్లో స్థానం అలానేవుంది. నెలకు రెండు, మూడుసార్లు వచ్చి అదీ, ఇదీ అని లక్ష్మిమీద పెత్తనం చలాయిస్తూ నాలుగైదు రోజులుంటుంది. పప్పుపల్చగా వుందనో, కూరలో కారం లేదనో, ఏదో ఒక సాకుమీద సణుగుతూ తక్కువ చేసి మాట్లాడుతుంది. అవన్నీ లక్ష్మి పట్టించుకోదు. సహనంగా సర్దుకుపోతూ వుంది.

కాలం కదుల్తూనే వుంది.

ఉరుములు, మెరుపులు, వానలు, వడగాల్పులకు పుడమితల్లి వెరవడంలేదు. అన్నిటినీ భరిస్తూ రుతువుకు అనుగుణంగా తన ధర్మాన్ని తాను నిర్వర్తిస్తూ ప్రకృతికి శోభను

ఇస్తూనేవుంది.

పార్వతి సాధింపులూ, భూదేవమ్మ అజమాయిషీలు తట్టుకుంటూ లక్ష్మి అత్తింట నాలుగు వసంతాలు నెట్టుకొస్తూ ఇద్దరు కొడుకులకు జన్మనిచ్చింది. పెద్దవాడు నరేష్, రెండవవాడు మహేష్.

పచ్చటిరంగులో ముచ్చటగా వాళ్ళిద్దరూ కళ్ళముందు కనిపిస్తుంటే పార్వతికి చికాకుగా వుంది.

లక్ష్మి గర్భవతి అయిన రెండుసార్లూ 'నీకు పుట్టేది ఆడముండేలే' అంటూ పార్వతి దెప్పిపొడిచింది. అందుకు భిన్నంగా జరగడంతో ఆమెకి అసూయగా ఉంది. ఏదో సాకుమీద గొడవకు దిగడం, ఆమెకి వంత పలుకుతూ భూదేవమ్మ కోడలిమీదకి వంటికాలిమీద దూకడం, రాఘవయ్య మూర్ఖంగా వాళ్ళిద్దరినీ వెనకేసుకురావడం భరింపరానిదయ్యింది లక్ష్మికి.

ఆమె ఎక్కడ ఏ అఘాయిత్యానికి పాల్పుడుతుందోనని రామకృష్ణ భయం. అమ్మానాన్నలు దైవసమానులు అనుకున్నాడు. కానీ వాళ్ళు రాక్షసులకన్నా హీనంగా ప్రవర్తిస్తారని ఊహించలేదు.

లక్ష్మిని ఓదార్చుతూ ప్రేమగా చూసుకుంటూ ఆమెకి మనో నిబ్బరాన్ని కలిగిస్తున్నాడు. భర్త హృదయంమీద సేదదీరుతూ దుఃఖాన్ని దిగమింగుతూ లక్ష్మి మరోబాటుకి జన్మనిచ్చింది. వాడికి గణేష్ అని పేరు పెట్టాడు రామకృష్ణ.

★ ★ ★

అప్పటికి స్వాతికి పన్నెండో ఏడు వచ్చింది. అమ్మమ్మ, తాతయ్యల అతిగారాబంతో పెద్ద ఆరిందాలా మాట్లాడుతుంది. దాని మాటకున్న విలువ లక్ష్మికి లేదు ఆ ఇంట్లో. ఎంత మాటంటే అంత మాట లెక్కలేకుండా అంటుంది. లక్ష్మి ఏదన్నా అంటే అమ్మా, అమ్మమ్మలు యుద్ధం ప్రకటిస్తారు. స్వాతి చాడీల ఆజ్యానికి పార్వతి ఈర్ష్యాగ్ని గుండంనుండి మంటలు వెలువడి లక్ష్మిని చుట్టుముడుతున్నాయి.

రామకృష్ణలో భయం మొదలయింది.

ఏదో ప్రళయం జరగనుంది. హత్యలూ, ఆత్మహత్యలను గురించి తను విన్నాడు.

తెగిస్తే-

చావుకి, బతుక్కీ మధ్య కాలం కేవలం క్షణం.

ఆలోచిస్తున్న రామకృష్ణకి అమ్మా, నాన్న, అక్క అంటే అసహ్యం పుట్టుకువస్తోంది. వాళ్ళమీద కోపం తన్నుకువస్తోంది. చంపి పారెయ్యాలనిపిస్తోంది.

అంతలోనే విజ్ఞత పనిచేసి ఆవేశాన్ని చల్లబరుస్తోంది.

అయినా మనశ్శాంతి లేదు. అమ్మానాన్నల ప్రవర్తన భరింపరానిదిగా వుంది. వాళ్ళమీద శత్రుత్వం పెరుగుతూ వుంది. పగ రగుల్తూవుంది.

"ఇదంతా మా అక్క చేస్తోంది" అన్నాడు శేషగిరి మాస్టారుతో.

శేషగిరి మాస్టారు రామకృష్ణకేసి చూస్తూ పెదాలమీదికి నవ్వు తెచ్చుకొన్నాడు.

"మనిషి దేనికీ కర్తకాదు నాయనా, వాల్మీకి రామాయణంలో అడవులకు బయల్దేరినప్పుడు రాముడు ఏమంటాడో తెలుసా 'నేను అడవులకు వెళ్ళుటకు, నాకు రాజ్యం రాకపోవుటకు తండ్రే కారణమని ఎందుకు అనుకోవాలి? అన్నింటికీ దైవమే కారణం. కాకపోతే తల్లి అయిన కైకకు ఇట్టి బుద్ధి ఎందుకు పుట్టింది? నన్నూ భరతుని సమానమైన ప్రేమతో చూసింది కదా అట్టి ఆమె నన్ను అడవులకు పంపసంకల్పించిందంటే దైవ సంకల్పం కాక మరేమవుతుంది' అని అంటాడు" అని అన్నాడు.

"ఎంత దైవసంకల్పమయినా ఇదేమిటి మాస్టారు ఇంతలోక విరుద్ధంగానా"

దైవ సంకల్పానికి దయాదాక్షిణ్యం, ప్రేమ, ద్వేషం, భయం వంటి గుణాలేవీ వుండవు. తన, మన అనే తారతమ్యం వుండదు. ఎవరూ దానికి అతీతులు కారు"

శేషగిరి మాష్టారు చెప్తూవుంటే రామకృష్ణ కొడుకు నరేష్ పరిగెత్తుకుంటూ వచ్చి "నాన్నా...నాన్నా... అత్తా, నాయనమ్మా కలిసి అమ్మని తంతున్నారు" అని చెప్పాడు ఆందోళనగా.

శేషగిరి మాష్టారి నోట మాటలాగి పోయాయి.

మూడు రోజులక్రితం "అత్త, ఆడబిడ్డల చేతిలో అసువులు బాసిన అబల" అని పేపర్‌లో వచ్చిన వార్త గుర్తుకువచ్చి చలించిపోయాడు.

రామకృష్ణ ఊపుగా లేచి ఇంటివైపు పరిగెత్తాడు.

గణేష్‌ని ఎత్తుకొనివున్న లక్ష్మిని భూదేవమ్మా, పార్వతి ఒకరు రెక్క, మరొకరు జుట్టు పట్టుకొని బరబరా ఈడ్చుకొచ్చి పంచలోంచి లాగి బయటకు తోసేశారు. చంకలో వున్న గణేష్, పక్కనేవున్న మహేష్ భయపడి పెద్దగా ఏడ్చేశారు.

ఆ దృశ్యాన్ని చూసిన రామకృష్ణ స్థాణువై పోయాడు. క్షణకాలం మెదడు మొద్దుబారింది. తేరుకొని చూసేసరికి లక్ష్మి జుట్టంతా వూడిపోయి చీరె సగంవూడి రవిక చినిగి రక్తం మరకలు కనబడుతున్నాయి.

ఎదురుగా రాఘవయ్య, భూదేవమ్మ, పార్వతి పంచలో నిలబడి వున్నారు. వాళ్ళకేసి తీక్షణంగా చూశాడు. పార్వతి మెల్లగా అక్కడినుండి లోపలికి జారుకొంది.

అసహనం, ఆగ్రహం ఆవేశంతో అదుపు తప్పాడు రామకృష్ణ.

"మీ..." అంటూ వూగిపోతూ అక్కడే గోడవారగా పడేసివున్న దోకుడుపార కర్ర అందుకొన్నాడు.

అందుకు రాఘవయ్యగానీ, భూదేవమ్మ గానీ చెలించలేదు.

"రారా...రా" అంటూ ఆవేశంగా దూకింది భూదేవమ్మ. రాఘవయ్య పరిగెత్తి కర్రెత్తుకొచ్చాడు. అక్కడికి ఎప్పుడొచ్చాడో శేషగిరి మాష్టారు "రామకృష్ణా" అంటూ రామకృష్ణని వడిసి వాటేసుకొన్నాడు.

"వదలండి...వదలండి మాష్టారు. వీళ్ళు నాకు అమ్మానాన్నలుకాదు. శత్రువులు. పరమ కిరాతకులు. వీళ్ళు బతకకూడదు. చంపి తగలబెట్టాలి." అంటూ దూకుతున్న రామకృష్ణని శక్తినంతా కూడదీసుకొని లాక్కొచ్చి చేతిలో కర్రను పీకిపారేశాడు.

"ఏమిటి మాష్టారు మీరు..." ఆవేశాన్ని అణచుకోలేకపోతున్నాడు రామకృష్ణ.

శేషగిరి మాష్టారు రామకృష్ణ మొహంలోకి కోపంగా చూశాడు.

"ఏమిటి నీవు చేస్తున్నపని. ఎవరనుకొన్నావు వాళ్ళు. నీకు జన్మనిచ్చిన అమ్మానాన్నలు. కనిపెంచి పెద్దచేసినందుకా వాళ్ళని తన్నడానికి పోతున్నావు. చదువుకొన్నందుకు ఇదా తెలివి..."

"మీరు చూస్తున్నారుగా మాష్టారు వాళ్ళు అమ్మానాన్నల్లాగా ప్రవర్తిస్తున్నారా, మా చావు కోరుకుంటున్నారు. మమ్మల్ని ఇంట్లోంచి తరిమెయ్యాలని చూస్తున్నారు..." అంటూ చుట్టూచేరి చూస్తున్న జనం జాలి చూపు తట్టుకోలేకపోయాడు. మాష్టారి మొహంలోకి చూస్తూ ఏడ్చేశాడు. అతన్ని చూడలేకపోయాడు శేషగిరి మాష్టారు.

"ఛ,ఛ, ఏమిటి రామకృష్ణా చిన్నపిల్లాడిలా" అంటూ రామకృష్ణ భుజంమీద చెయ్యివేసి సముదాయిస్తూ పోయి భూదేవమ్మ, రాఘవయ్యలతో "మీరు పెద్దవాళ్ళు, అన్నీ తెలిసినవాళ్ళు, కాస్త పట్టూవిడుపూ వుండాలి. పంతాలకు పోకూడదు" అని సర్దిచెప్పబోయాడు.

ఆ మాటలు చెవికి ఎక్కించుకొనే స్థితిలో లేరువాళ్ళు.

"వాడు మా ఇంట్లో వుండటానికి వీల్లేదు" అన్నాడు పంతంగా రాఘవయ్య.

భూదేవమ్మ ఇంట్లోకిపోయి లక్ష్మికి సంబంధించిన పెట్టెను తీసుకొచ్చి విసిరి పారేసింది. అది మూతవూడి అందులోంచి

చీరెలు, నగలూ, చిందరవందరగా పడిపో యాయి.

"నా గడప తొక్కితే నేను ఒప్పుకోను" చెయ్యెత్తి వేలు చూపుతూ ఖచ్చితంగా అన్నది భూదేవమ్మ.

వాళ్ళు ఆవేశంలో వున్నారు. తన మాటలు వినే స్థితిలో లేరు. అహంకారంతో పంతంగా మాట్లాడుతున్నారు. కొడుకు అనే ఆలోచన లేకుండా ఇంట్లోకి రావద్దని శాసి స్తున్నారు.

చుట్టూ చేరిన జనం వాళ్లని వింతగా చూస్తున్నారు.

'ఇలాంటి అమ్మానాన్నలు కూడా వుంటారా ఈ లోకంలో' అని విస్తుపోతు న్నారు.

శేషగిరి మాష్టారుకి అసహ్యంగా వుంది ఆ వాతావరణం. వాళ్ళసలు రామకృష్ణకి తల్లి దండ్రులేనా అనే అనుమానం కలిగింది. రామకృష్ణకి ఎదురుగా వచ్చి నిలబడి "నీకు కాళ్ళూచేతులూ పనిచేయడంలేదా? వంట్లో శక్తిలేదా పెళ్ళాం పిల్లల్ని పోషించుకోలేవా" అంటూ భుజంతట్టి "అధైర్యపడకు రామ కృష్ణా" అన్నాడు.

రామకృష్ణ చెల్లాచెదురై పడిన నగలు, చీరెలు, పెట్టెలోకి సర్ది "మేం వెళ్తున్నాం మాష్టారు" అంటూ లక్ష్మిని, పిల్లల్ని తీసు కొని బయల్దేరాడు.

శేషగిరి మాష్టారికి బాధేసింది.

"ఎక్కడికని వెళ్తావు" అని అడిగాడు.

"ఎక్కడో చోటుకి మాష్టారు" నిర్లిప్తంగా అన్నాడు.

"ఎక్కడికీ పోనవసరం లేదు. నేనున్నాను" అంటూ రామకృష్ణనీ అతని భార్యా పిల్లల్నీ తనవెంట తీసుకొనిపోయాడు శేషగిరి మాష్టారు.

★ ★ ★

ఆప్యాయంగా ఆదరించింది పద్మావ తమ్మ.

రాత్రి భోజనాలయ్యాక "నువ్వేం దిగులు పడకు నాయనా, అన్నీ సవ్యంగానే సర్దుకొం టాయి" అని అన్నది ధైర్యంచెప్తూ.

"సర్దుకోకపోయినా ఏంపర్వాలేదు లోకంలో అందరూ వున్నవాళ్ళేనా వున్నది? లేనివాళ్ళు లేరా? వాళ్ళు బతకడంలేదా? సెంటుపొలం కూడా లేక లక్షలు సంపా యించిన వాళ్లున్నారు. దిగులుపడితే దిగజా రిపోవడం తప్ప ఇంకేం వుండదు. జరిగే వన్నీ మంచికేనని ఓర్చుకుంటూ ముందుకు పోవాలి. సీతాపహరణం జరుగబట్టే రావణ సంహారం జరిగింది" అంటూ శేషగిరి మాష్టారు రామకృష్ణని హితోక్తులతో ధైర్యప రచి భవిష్యత్తుని గురించి ఒక అవగాహన కలిగించాడు.

పొద్దుపోయింది. అందరూ పడుకొ న్నారు. రామకృష్ణకు నిద్రపట్టడంలేదు. లక్ష్మికి కూడా నిద్రరావడంలేదు. వాళ్ళని గురించి ఆలోచిస్తూ నిద్రలోకి జారుకొ న్నాడు శేషగిరి మాష్టారు.

డిమ్‌లైట్ వెలుగులో గోడకున్న గడి యారం శబ్దంచేస్తూ నిశ్శబ్దాన్ని భంగప రుస్తూ వుంది. రామకృష్ణకి అమ్మా, నాన్నల ప్రవర్తన గుర్తుకొచ్చి తనమీద తనకే జాలి కలిగింది. కళ్లల్లో నీళ్ళూరాయి. తుడుచుకో బుద్ధి కాలేదు. ద్వేషం, రోషం, అసహనం, అసహ్యం. మనస్సు స్థిమితం కోల్పోయింది. లేచి కూర్చున్నాడు. లక్ష్మిని లేపాడు. ఇద్దరూ పిల్లల్ని తీసుకొని ఇంట్లోంచి బయ టకు నడిచారు.

చీకటి రోడ్డు నిర్మానుష్యంగావుంది. వూరు దాటి మామిడి తోపులో వున్న గిలక బావి దగ్గరకు వచ్చారు. దాని అంచుమీద నిల బడి ముగ్గురి పిల్లల్ని ఒకరు మార్చి ఒకరు ముద్దాడి క్షణం ఆలస్యం చెయ్యకుండా వాళ్ళ తోసహా బావిలోకి దూకేశారు. ఆ దృశ్యం చూసిన శేషగిరి మాష్టారు చలించిపోయి రామకృష్ణా అని పెద్దగా అరిచాడు.

ఆ అరుపుకి ఇంట్లో అందరూ అదిరిపడి లేచారు.



"ఏంమాష్టారూ, ఏమయ్యింది" అంటూ రామకృష్ణ ఆదుర్దాగా లేచివచ్చి శేషగిరి మాష్టారిని తట్టిలేపాడు. కళ్ళు తెరిచిన శేష గిరి మాష్టారికి ఎదురుగా రామకృష్ణ కనబ డడంతో "నాయనా రామకృష్ణా నీవిక్కడేవు న్నావా" అంటూ శేషగిరి మాష్టారు రామకృ ష్ణను తడుముతూ లేచి "అమ్మాయీ, పిల్లలూ..." అంటూ తిరిగి అక్కడ లక్ష్మి, పిల్లలు వుండటం చూసి కుదుటపడ్డాడు.

మిగిలిన రాత్రి నిద్ర పట్టలేదు శేషగిరి మాష్టారుకి.

మరుసటిరోజు రామకృష్ణని వెంటబెట్టుకొ నిపోయి కందుకూరులో ప్రయివేట్ మేనేజ్ మెంట్ జూనియర్ కాలేజీలో గుమాస్తాగా చేర్పించాడు. వెయ్యి రూపాయలు జీతం.

అదే మహద్భాగ్యం అనుకొని సంబరపడి పోయాడు రామకృష్ణ. శేషగిరి మాష్టారిపట్ల గౌరవం పెరిగింది. ఆయన మాట ప్రకారం శాఖవరంలోనే కాలనీలో ఇల్లు రెంటుకు తీసుకొని అందులో పాలు పొంగించి కాపురం పెట్టాడు. బస్‌పాస్ తీసుకొని రోజూ పొద్దున్నే కందుకూరు పోవడం, కాలే జీలో పని చూసుకొని రాత్రికి ఇంటికి రావడం దినచర్య అయ్యింది.

★ ★ ★

వర్షాలు పడ్డాయి.

చెరువునిండి మాగాణి పనులు మొదల య్యాయి. శివరామయ్యవచ్చి పొలం సాగు చేసి వరి నాటించాడు. పార్వతి తన చిన్న కూతుళ్ళు, వాణీ, రాణిని కూడా తీసుకొచ్చి వదిలేసింది. వాళ్ళకి ఏలోటూ రాకుండా రాఘవయ్యా, భూదేవమ్మ అతిగారాబంగా చూసుకొంటున్నారు.

రామకృష్ణ బతుకు పోరాటంలో ముందు కుపోవడానికి అష్టకష్టాలు పడుతున్నాడు. వెయ్యి రూపాయల జీతంతో ఇల్లు గడవడం కష్టంగా వుంది. అయినా రెండో కంటికి తెలియకుండా కాపురం గుట్టుగా నడుపుకొ స్తున్నాడు.

అతని స్థితిగతుల్ని శేషగిరి మాష్టారు గమనిస్తూనే వున్నాడు. ఇల్లు గడపడంలో లక్ష్మి నేర్పు, రామకృష్ణ ఓర్పు ఆయనకు బాగానచ్చాయి.

రోజులు, వారాలు, నెలలు భూతకాలంలోకి వెళ్ళిపోతున్నాయి.

పొద్దున్నే రామకృష్ణ కందుకూరుకు బయ ల్దేరుతూవుంటే శేషగిరి మాష్టారు వచ్చాడు. వస్తూనే "బాబుకి ఎలా వుంది" అని అడి గాడు.

మూడురోజులుగా గణేష్‌కి జ్వరం వూళ్ళో వున్న ఆర్.యం.పి జానీ భాషాకి చూపించి మందులు వాడుతున్నారు. ఆ కారణంగా విచారించి పోవడానికి వచ్చాడేమో అనుకొ న్నాడు.

"రండి మాష్టారూ" అంటూ మంచం వాల్చాడు రామకృష్ణ.

శేషగిరి మాష్టారు గణేష్ చేయిపట్టుకొని చూసి "బావుంది. తగ్గినట్లుంది... ఇంకో సారి జానీ భాషాకి చూపించండి. మందులు వాడమంటే వాడొచ్చు..." అని చెప్తూ మంచంమీద కూర్చుని రామకృష్ణని దగ్గరకి పిలిచాడు. రామకృష్ణ ఎదురుగా రాగానే "నీకు డబ్బులు అవసరమయితే నన్నడుగు. అప్పులు చేయకు" అంటూ జేబు లోంచి వందరూపాయల నోట్లుతీసి "అమ్మాయి మెడలో గొలుసు కుదువ పెట్టావు కదూ" అన్నాడు.

గతుక్కుమన్నాడు రామకృష్ణ.

"ఇవిగో వెయ్యి రూపాయలు, విడిపించు కురా"

రామకృష్ణ ఏదో చెప్పబోయాడు.

"నాకు తెలుసు నీకు రెండు నెలలుగా జీతం రాలేదని.... నన్ను అడగొచ్చుకదా. నాదగ్గర మొహమాటం ఎందుకు. ఇంకె ప్పుడూ అప్పు చెయ్యకు. నీదగ్గర వున్నప్పుడే ఇద్దువుగాన్లే. సరేనా..." అంటూ రామకృష్ణ జేబులో డబ్బులు పెట్టి "దిగులు పడకు, భయపడకు, ధైర్యంగా వుండు. కష్టాలకో





ర్చుకో సుఖపడతావు" భుజం తట్టి ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు శేషగిరి మాష్టారు.

రామకృష్ణకి మెదడు మొద్దుబారింది. నోటమాట రాలేదు. మౌనంగా ఇంట్లోకి నడిచాడు. ఎదురుగా లక్ష్మి అతనికేసి చూస్తూ దగ్గరగా వచ్చింది.

"మాష్టారికి నువ్వు చెప్పావా" అని అడిగాడు.

"లేదే"

"మరి ఆయనకి ఎలా తెలిసింది"

"అదే నాకూ అర్థంకావడంలేదు"

రామకృష్ణలో గూడుకట్టుకొనివున్న దుఃఖం కట్టలు తెంచుకొని వచ్చింది. ఆపుకోలేక ఒక్కసారిగా ఏడ్చేశాడు. అదిచూసి చలించిపోయింది లక్ష్మి.

"ఏవండీ ఏమిటండీ" అంటూ రామకృష్ణని పట్టుకొని ఏడ్చింది.

"ఏం లేదు లక్ష్మీ ఏం లేదు" అంటూ కళ్ళు తుడుచుకుని "మాష్టారికి వున్న ఆదరణా ఆప్యాయతా అమ్మా, నాన్నకి లేకపోయింది" అని అంటూ వుంటే "అయితే మాన్లేండి మనకు దేవుడున్నాడు. దేవుడిలాంటి బాబాయిగారున్నారు. మీరు దిగులు పడొద్దు. మీరు కంట నీరు పెట్టుకొంటుంటే నేను బతకలేను. దయచేసి యింకెప్పుడూ యిలా" అంటూ రామకృష్ణ కంటినీరు తుడుస్తూ "బస్సు టైం అయ్యింది. మీరు బయల్దేరండి" అని రామకృష్ణని బయల్దేరదీసింది.

రామకృష్ణ బస్సులో కూర్చున్నాడేగానీ అతని మనసంతా వికలంగా, వికృతంగా ఆలోచిస్తూ వుంది. ఆలోచించేకొద్దీ అమ్మా, నాన్నలమీద ఏవగింపు పుట్టి కోపం తన్నుకొస్తూ వుంది.

కందుకూరులో బస్సు దిగుతూనే పోయి కుదువ కొట్లో డబ్బు కట్టి గొలుసు విడిపించుకొని కాలేజీకి వెళ్లాడు.

రాత్రి యింటికి రాగానే "నాన్నా, మావయ్య వచ్చిపోయాడు" అని నరేష్ చెప్పాడు. రామకృష్ణ అదేం పెద్దగా వినిపించుకోలేదు. "అలాగా" అని నేరుగా శేషగిరి మాష్టారి ఇంటికి వెళ్ళి తప్పు చేసిన వాడిలా గొలుసు చూపించాడు.

"ఎప్పుడూ కష్టాలే వుండవు రామకృష్ణా దేవుడి దయవల్ల నాకే లోటూ లేదు. కొడుకు గానీ, కూతురుగానీ నా నుంచి ఏమీ కోరుకోవడంలేదు. వాళ్ళు జీవితంలో స్థిరపడిపోయారు. నీకెప్పుడు ఏ అవసరం వచ్చినా నన్నడుగు" అని శేషగిరి మాష్టారు భరోసాగా చెప్పాడు.

అందుకు రామకృష్ణకి ఆనందంతోపాటు ఆవేదన కూడా కలిగింది. ఇంటికి వెళ్ళగానే "అన్నయ్య బియ్యం తెచ్చిపోయాడు" అని లక్ష్మి చెప్పింది. నిర్లిప్తంగా వుండిపోయాడు రామకృష్ణ.

★ ★ ★

ఆ రాత్రి నిద్రపట్టలేదు.

ఆలోచిస్తూ ఆకాశంలోకి చూశాడు. అర్ధ చంద్రుడిని మబ్బులు మింగి వదిలేస్తున్నాయి. కార్యరూపం దాల్చలేని ఆలోచనలు మనసులోకి వచ్చి మాయమవుతున్నాయి.

లక్ష్మి వచ్చి పక్కలో కూర్చుంటూ "ఏమిటీ ఆలోచిస్తున్నారు" అని అన్నది.

రామకృష్ణ తల తిప్పి లక్ష్మికేసి చూశాడు. ఆమె తలలో వాళ్ళ అన్నయ్య తెచ్చిన మల్లెపూలు తెల్లగా మెరుస్తున్నాయి.

తను రోజూ టౌన్‌కి పోయి వస్తున్నాడు. ఒక్కసారిగూడా మూరెడు పూలు తేలేకపోవడం గుర్తుకు వచ్చి మెల్లగా ఆమె భుజం మీద చెయ్యివేశాడు.

లక్ష్మి రామకృష్ణ గుండెలమీద వాలిపోయింది. ఒకరి గుండె చప్పుడు ఇంకొకరి గుండెకు వినబడుతూ వుంది.

మాటలు లేవు.

అయిదు నిముషాలు మౌనం.

"మీరు దిగులుపడొద్దండీ" అంటూ లక్ష్మి రామకృష్ణ నుదుటిమీద చెయ్యివేసింది.

రామకృష్ణ మాట్లాడలేదు.



"మాట్లాడరా. మీరు మౌనంగా వుంటే నాకు భయంగా వుంటుందండీ"

"ఛ...ఎందుకు భయం" అక్షరాలు కూడ బలుక్కొన్నట్టుగా అన్నాడు రామకృష్ణ.

"ఉదయం మీరు ఏడ్చేసరికి నాకు కాళ్ళు వణికాయండీ."

రామకృష్ణ లక్ష్మి తలమీద చెయ్యివేసి నిమిరాడు.

"మగవాళ్ళు కంట తడిపెట్టగూడదు"

"నాకు చచ్చిపోవాలని వుంది లక్ష్మి"

"ఆ ఆలోచన నాకూ వుందండీ. మన దారిన మనం పోతే మన పిల్లలు అనాథలై పోతారు. ఆ స్థితి వాళ్ళకొద్దండీ. వాళ్ళకోసం బతుకుదాం. వాళ్ళని బతికించుకొందాం. ఇంకెప్పుడూ ఇలాంటి ఆలోచన వద్దండీ. సరేనా... నా మాట వినరూ"

తెల్లవారింది.

నిద్రలేస్తూనే "బాబుకి మళ్ళీ జ్వరం వచ్చిందండీ" అని చెప్పింది లక్ష్మి.

రామకృష్ణ లేచి గణేష్ పొట్టమీద చెయ్యి వేసి చూశాడు. బాగా వేడిగా వుంది. ఇంట్లో వున్న సెప్ట్రాన్, మెటాసిన్ మాత్రలు మింగించి వేడిగా పాలు తాగించాడు. గంటలో వళ్లు చల్లబడింది.

మళ్ళీ జ్వరం వస్తే మెటాసిన్ మాత్ర మింగించమని లక్ష్మికి చెప్పి కందుకూరు వెళ్ళిపోయాడు రామకృష్ణ.

పదకొండు గంటలప్పుడు గణేష్‌కి జ్వరం వచ్చింది. లక్ష్మి మాత్ర మింగించింది. పది నిముషాల తరువాత వాడు వాంతి చేసుకుని నీరసంగా వాలబడిపోయాడు.

లక్ష్మి భయపడిపోయింది. కాళ్ళు వణికాయి. నరేష్‌ని, మహేష్‌ని పక్క ఇంట్లో ఉంచి గణేష్‌ని భుజాన వేసుకొని జానీ భాషా ఆసుపత్రికి పరుగెత్తింది.

"జ్వరం తిరగబెట్టింది. కందుకూరు తీసుకునిపోయి పెద్ద డాక్టర్‌కి చూపించండి" అని చెప్పాడు జానీ భాషా.

అయోమయంలో పడిపోయింది లక్ష్మి. ఏం చేయాలో తోచలేదు. అత్తామామలు గుర్తుకొచ్చి అక్కడినుంచి నేరుగా వాళ్ళ ఇంటికి పరుగెత్తింది.

రాఘవయ్య, భూదేవమ్మ, పార్వతి ముగ్గురు కూతుళ్ళూ పంచలో ఉన్నారు. లక్ష్మి రావడం చూసి భూదేవమ్మ రాఘవయ్యవైపు చూస్తూ మొహం చిట్లించింది.

"అత్తయ్యా! గణేష్‌కి జ్వరం. మాటా, పలుకూ లేకుండా వాలబడిపోతున్నాడు. మీ అబ్బాయి ఊళ్ళోలేరు. కందుకూరు పోయారు" అంటూ ఆందోళన పడింది.

"మాకు చెప్పడం దేనికి? " అని ఈసడించింది భూదేవమ్మ.

"జానీ భాషా కందుకూరు తీసుకెళ్ళమన్నాడు"

"అయితే తీసుకొని పో"

"నాకు భయంగా వుంది. నువ్వు కూడా రా అత్తయ్యా"

"నాకు అవసరంలేదు నేను రాను" భూదేవమ్మ కఠినంగా అంది.

లక్ష్మికి ఏడుపొచ్చేసింది. రాఘవయ్యవైపు తిరిగి, "మావయ్యా నువ్వయినా రా ఆలస్యం అయితే ప్రమాదమని జానీ బాషా చెప్పాడు" అంటూ చెప్తుంటే, "ఏం చావడులే... అంతగా చస్తే చెరువంతా ఖాళీగా వుంది. ఎక్కడో ఒకచోట బొందతీసి పెట్టొచ్చు. పోపో అవతలకి" అంది భూదేవమ్మ నిర్దాక్షిణ్యంగా.

లక్ష్మికి ఏడుపులో కోపం తన్నుకొచ్చింది. "ఛీ నువ్వసలు ఆడదానివేకాదు, రాక్షసివి. జంతువుకన్నా హీనం. దేవుడు నీ పాపం పండిస్తాడ్లే" అని శేషగిరి మాష్టారికోసం బడికి పరుగెత్తింది.

అప్పుడే శేషగిరి మాష్టారు బడిలోంచి బయటకు వస్తూ లక్ష్మి రావడం చూసి కంగారుపడ్డారు.

ఆమె బాబు పరిస్థితి, జానీ బాషా చెప్పిన విషయం, భూదేవమ్మ అన్నమాటలూ చెప్పి ఏడ్చేసింది.

"నేనొస్తాను పదమ్మా" అంటూ శేషగిరి మాష్టారు మిగతా మాష్టార్లకి క్లాసు చూసు కోమని చెప్పి లక్ష్మితో బయల్దేరాడు.

కందుకూరులో బస్సు దిగుతూనే బస్టాం డ్‌లో వున్న యస్.టి.డి. బూత్‌నుండి రామకృష్ణకి విషయం చెప్పి వాళ్ళు వెళ్తున్న హాస్పిటల్ కి రమ్మన్నాడు.

రామకృష్ణ వెంటనే ప్రిన్సిపాల్ దగ్గర పర్మిషన్ తీసుకుని హాస్పిటల్‌కి వెళ్ళాడు.

ఓ.పి.లో జనం గుంపుగా వున్నారు. ఆ గుంపులోంచి ఏడుపు వినబడడంతో రామ కృష్ణ గుండె ఝల్లుమంది. జనాన్ని తోసు కుంటూ లోపలికి వెళ్ళాడు. అక్కడ గణేష్ మీద మొహం ఆనించి రోదిస్తున్న లక్ష్మి, పక్కనే నోటికి గుడ్డ అడ్డం పెట్టుకుని పొంగుకొస్తున్న ఏడుపును ఆపుకుంటున్న శేషగిరి మాష్టారిని చూసి కూలబడిపో యాడు.

తలతిప్పి చూసిన లక్ష్మికి భర్త కనబడ డంతో "ఏవండీ గణేష్ పోయాడండీ" అంటూ అతనిమీద పడి విలపించింది.

చుట్టూ వున్న జనం అంతా హృదయం వున్నవాళ్ళులా వుంది. కళ్ళు తుడుచుకుంటు న్నారు.

అక్కడ అన్ని మానవతా హృదయాలూ ద్రవించినా కర్టసీకైనా కాలం క్షణం ఆగి ఆ వైపుకి కనీసం తొంగిచూడలేదు. అది నిర్దా క్షిణ్యంగా, నిర్మోహమాటంగా, నిర్భయంగా ముందుకి సాగిపోతూ వుంటే, శేషగిరి మాష్టారికి కర్తవ్యం గుర్తుకు వచ్చింది. తన్ను తాను తమాయించుకున్నాడు.

జీవుడులేని గణేష్‌ని భుజాన వేసుకుని లక్ష్మిని, రామకృష్ణని ఓదార్చుతూ అక్కడి నుండి బయల్దేరదీశాడు.

ఊళ్ళో బస్సుదిగి ఇంటికి వస్తూనే లక్ష్మి శోకాలు తీస్తూ పందిట్లో కుప్పలా కూలిపో యింది.

ఆ ఏడుపుకి ఇరుగుపొరుగువాళ్ళు పరుగె త్తుకుంటూ వచ్చి, కళ్ళారా చూసినా నమ్మ లేక అవాక్కయ్యారు. ఆనోటా ఆనోటా ఆ విషయం ఊరంతా తెలిసిపోయింది. రాఘ వయ్యగానీ, భూదేవమ్మగానీ ఆ ఛాయలకు రాకపోవడంతో వాళ్ళను గురించి 'పాపి ష్టోళ్ళు' అంటూ శాపనార్థాలు పెట్టిపోతు న్నారు.

శేషగిరి మాష్టారు పాలెం మనిషిని పంపించాడు. సాయంకాలానికి శాంతమ్మ కొడుకూ, కోడలుతో వచ్చింది. అమ్మనీ,అన్నా వదిననీ చూడగానే ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి వున్న లక్ష్మికి ఎక్కడలేని దుఃఖం వచ్చే సింది. ఒక్కొక్కరినీ పట్టుకొని పడిపడి ఏడ్చింది.

ఆ ఏడ్పులో...

'ఏం చావడులే... అంతగా చస్తే చెరు వంతా ఖాళీగా వుంది. ఎక్కడో ఒకచోట బొంద తీసిపెట్టొచ్చు' అన్న భూదేవమ్మ మాటలు గుర్తుకువచ్చి కోపంతో ఊగిపో యింది.

"అది ఆడదికాదు. రాక్షసి. నా బిడ్డ చావు కోరుకుంది. చస్తే చెర్లో బొందతీసి పెడతా నంది. పాపాన పోద్ది పాషాణబండ. ఇప్పుడు కళ్ళు చల్లబడ్డాయి గావాల. అది చావదు గావాల. దానిమొగుడు చావడుగా వాల. శిలేసుకుని శాశ్వతంగా వుండిపోతారు గావాల..." అలా లక్ష్మి అనడం శేషగిరి మాష్టారుకి నచ్చలేదు. కానీ ఆమె కావాలని కోరికతో అనడంలేదు. పుట్టెడు దుఃఖంతో గతం గుర్తుకువచ్చి తన్నుతాను మర్చిపో యింది. ఆవేదనతో ఆక్రోశించింది.

ఆమె బాధని చూడలేకపోయింది పద్మావ తమ్మ. పైటకొంగుతో కళ్ళనీళ్ళు తుడుచు కుంటూ ఓదార్చబోయింది. లక్ష్మి రోదిస్తూ ఆమె ఒళ్ళో వాలిపోయింది.

శేషగిరి మాష్టారు అనునయించబో యాడు.

"మీకంతా తెలుసుగదా బాబాయిగారూ!" ఏడుపు ఆపుకోలేకపోయింది.

"తెలుసమ్మా... తెలుసు. నాకంతా



తెలుసు. తెలిసిమటుకు నేనేం చెయ్యగలి గాను. నేనేకాదమ్మా ఎవ్వరూ ఏం చెయ్యలేరు. మనమంతా బొమ్మలం. దేవుడి చేతిలో తోలుబొమ్మలం. ఊపిరిపోసినా, తీసినా ఆయనే. నవ్వించినా, ఏడిపించినా అంతా ఆయన ఇష్టమే. కనబడకుండానే అంతా చేస్తుంటాడు" అంటూ ఊరడిస్తుంటే లక్ష్మి వెక్కి వెక్కి ఏడ్చింది.

కుమారయ్య, శేషగిరి మాష్టారు, ఇరుగు పొరుగువాళ్ళతో కలిసి చీకటిపడేసరికి గణేష్‌ని మట్టిలో కలిపేసి వచ్చారు,

★ ★ ★

ఆ రాత్రి...

కాలానికి కదలబుద్ధి కాలేదేమో! నిశ్శబ్దంగా, విషాదంగా, భయంకరంగా వుంది.

ఏడ్చి ఏడ్చి అలసిపోయిన లక్ష్మి శక్తిలేక నీరసంగా శాంతమ్మ ఒడిలోకి వాలిపోయింది.

గోడకి ఆనుకుని రామకృష్ణ మౌనంగా కూర్చుండిపోయాడు.

నరేష్, మహేష్ బిక్కమొహాలతో అమ్మనీ, నాన్ననీ చూస్తూ మాధవికి చెరొక పక్కా అతుక్కుపోయారు.

వాళ్ళని అలా వదిలేసి పోబుద్ధికాలేదు శేషగిరి మాష్టారికి. పద్మావతితో అక్కడే వుండిపోయాడు.

ఎవరినోటా మాటలు పెగలడంలేదు.

దిగులు, విచారం.

ఆవేదన, ఆలోచన

రామకృష్ణలో బడబాగ్ని పొంగుతూ వుంది.

ఊరు ఊరంతా వచ్చి అయ్యోపాపం అన్నారు. జాలిపడ్డారు. ఓదార్చారు.

కనీసం విచారింపుకయినా అమ్మానాన్న రాకపోవడంతో 'తనకన్నా దరిద్రుడు లోకంలో వుండడు' అని గూడుకట్టుకుని వున్న దుఃఖాన్ని ఆపుకోలేకపోయాడు. పొగిలి పెద్దగా ఏడ్చేశాడు.

ఆ ఏడుపుకి పిల్లలిద్దరూ దడుసుకుని ఏడ్చేశారు. వాళ్ళని దగ్గరికి లాక్కుని లక్ష్మి రోదించింది.

ఊహించని విధంగా ఇంట్లో వాతావరణం భయంకరంగా మారింది.

ఆగిపోయినట్టున్న కాలానికి కాళ్ళొచ్చినట్టుంది. కదిలిపోసాగింది.

శేషగిరి మాష్టారు రామకృష్ణని ఓదారుస్తున్నాడు.

"నేనింక ఈ వూళ్ళో వుండను మాష్టారు. ఎక్కడకన్నా వెళ్ళిపోతాను" అంటూ కళ్ళు తుడుచుకున్నాడు రామకృష్ణ.

"అలాగే రామకృష్ణా... అలాగే. ఈ వూళ్ళోనేకాదు ఈ ఊరి పరిసర ప్రాంతాలలో ఎక్కడా ఉండద్దు. దూరంగా వెళ్ళిపోవాలి. ఈ పాప కూపానికి నువ్వెంత దూరంగా వుంటే అంత మంచిది" అన్నాడు శేషగిరి మాష్టారు.



ఆయనకి నిద్ర రావడంలేదు.

ఆలోచిస్తున్నాడు.

పొద్దుపోయింది, చాలా పొద్దుపోయింది.

ఎప్పుడో నిద్రపట్టింది. తెల్లవారినా ఆలోచిస్తూనే వున్నాడు.

బడికి వెళ్ళినా, తిరిగి ఇంటికి వచ్చినా రామకృష్ణ గురించే ఆలోచన. అతనింక ఈ

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో *100* పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో *100* పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

**★, ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

**★ అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన *4* వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: *3000/-* పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఏప్రిల్ 'చతుర' నవల మాస్టారు

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

ఊళ్ళో వుండకూడదు. ఈ పరిసరాలలో వుండకూడదు, దూరంగా వెళ్ళి బతకాలి.

అందుకు మార్గం ఆలోచిస్తున్నాడు.

కందుకూరులో కాపురం పెడితే కాలేజీవాళ్ళిచ్చే వెయ్యి రూపాయిలతో జరుగుబాటు కష్టం. పైగా వాళ్ళు జీతాలు సరిగ్గా ఇవ్వడం లేదు. గట్టిగా అడిగితే ఉద్యోగంలోంచి తీసేస్తారు.

ఎలా? అని ఆలోచిస్తున్నాడు.

ఆరోజు...

ఆ మరుసటిరోజు గడిచింది.

మూడవరోజు ఉదయం పోస్ట్‌మాన్ వచ్చి శుభలేఖ ఒకటి అందించిపోయాడు.

విజయవాడలో బంధువుల పెళ్ళి.

ఆ పెళ్ళికి వెళ్ళాడు శేషగిరి మాష్టారు.

బంధువులతో సందడిగా వుందక్కడ. ఒకరినొకరు పలకరించుకుంటూ కలుపుగోలుగా కబుర్లు చెప్పుకుంటున్నారు. అందులో మోహన్‌రావు భార్య వర్ధనమ్మ శేషగిరి మాష్టారిని చూసి వాళ్ళ పెదతాత మనవడిగా గుర్తించి మాటలు కలిపింది.

ఆ సందర్భంగా పాత బంధుత్వం కలుపుకుంటూ కుటుంబ విషయాలు చర్చించుకుంటూ వుంటే మోహన్‌రావు వాళ్ళు పదిహేను సంవత్సరాల క్రితం హైదరాబాద్‌లో సెటిలైనట్లు, వాళ్ళకి ఇద్దరు కొడుకులు, ఓ కూతురు అని, పెద్దకొడుకు బెంగుళూరులో, చిన్నకొడుకు మద్రాసులో ఉద్యోగాలు చేస్తున్నారని, అల్లుడికి హైదరాబాద్‌లోనే ఉద్యోగం కావడంవలన కూతురు కూడా అక్కడే వుందని తెలిసింది.

అప్పుడు శేషగిరి మాష్టారికి రామకృష్ణ గుర్తుకు వచ్చాడు. వెంటనే రామకృష్ణని గురించి మోహన్‌రావుకి చెప్పి అతనికి హైదరాబాద్‌లో జీవనోపాధికి ఉద్యోగం చూసి పెట్టమని అడిగాడు.

అందుకు మోహన్‌రావుకన్నా ముందుగా తన పుట్టింటి పేరు గలవాడు, అన్నయ్య వరసైనవాడూ అడగడంతో "అదేమంత పెద్దపనట అన్నయ్యా... అబ్బాయిని హైదరాబాదు పంపించు" అని భరోసాగా అంది వర్ధనమ్మ. శేషగిరి మాష్టారు వెంటనే హైదరాబాద్‌లోని వాళ్ళ ఇంటి అడ్రస్ రాయించుకుని బస్టాండ్‌నుంచి ఇంటికి ఎలా వెళ్ళాలో కూడా కొండ గుర్తులతో మ్యాప్ గీయించుకున్నాడు.

ఆ మ్యాప్ ఆధారంగానే రామకృష్ణ మోహన్‌రావుగారింటికి శ్రమపడకుండా వెళ్ళాడు.

★ ★ ★

సంతోషంగా వుంది రామకృష్ణకి.

అయిదువందల రూపాయల్లో ఎర్రగడ్డలో ఇల్లు దొరికింది.

వంటగది, హాలు. ఏటవాలుగా సిమెంట్ రేకులు వేసిన పోర్షన్ అది.

"ఇరుగ్గా వుంటుంది" అన్నాడు సురేష్.

"ఫర్వాలేదు, సరిపోతుంది" తృప్తిగానే అన్నాడు రామకృష్ణ.

"ప్రస్తుతానికి అడ్జస్ట్ అవ్వండి, తర్వాత మారొచ్చు" అన్నాడు సురేష్.

ఇంటికి అడ్వాన్స్ ఇచ్చి తిరిగి వచ్చేటప్పుడు "మీరు చాలా సింపుల్‌గా వుండేట్లున్నారు" అన్నాడు సురేష్.

రామకృష్ణ మాట్లాడలేదు. పెదాలమీదికి అదోలా నవ్వు తెచ్చుకుంటూ, 'భార్యాపిల్లల్ని పస్తులు పెట్టిన రోజులు కూడా వున్నాయి' అని అనుకున్నాడు నిర్లిప్తంగా.

ఆ రాత్రి అబిడ్స్ వెళ్ళి ఇల్లు దొరికిన విషయం వర్ధనమ్మకీ, మోహన్‌రావుకీ చెప్పాడు.

తక్కువ రెంటులో ఇల్లు దొరికినందుకు వాళ్ళు సంతోషం వ్యక్తపరుస్తూ వుంటే "ఆరు నెలలనుంచి కాళీగా వుందట నాకోసమేనేమో...!" అన్నాడు రామకృష్ణ.

"ఇల్లు శుభ్రంగా కడిగించి, దేవుడి పటం తీసుకునిపోయి అందులో వుంచు" అని చెప్పాడు మోహన్‌రావు. రామకృష్ణకి ఆ మాటలు నచ్చలేదు. తనకు దేవుడిమీద నమ్మకం పోయింది. మొదట్లో తను ఆస్తి

కుడే దేవుడంటే భయభక్తులుండేవి. బాధల సుడిగుండంలో చిక్కి బయటకు రాలేక ఎందరి దేవుళ్ళకో ముడుపులు కట్టి మొక్కులు మొక్కాడు. కానీ ఏ దేవుడూ తనకు సాయపడకపోవడంతో, దేవుడిపట్ల విశ్వాసం పోయి ద్వేషం పెరిగింది. దైవ దూషణ చేశాడు. నాస్తికత్వం నెలకొని 'దేవుడి' పదం అంటేనే అసహ్యం ఏర్పడింది.

అతని దృష్టిలో శేషగిరి మాష్టారే నిజమైన దేవుడు. కన్నవాళ్ళు వీధిలోకి విసిరేస్తే జాలిపడి అక్కున చేర్చుకున్నాడు. ఆకలికి అలమటిస్తుంటే అన్నం పెట్టాడు. బాధల్లో ఆదుకొని బతుకుమార్గం చూపించాడు.

కనబడని దేవుడి పటం పెట్టి పూజించడం కన్నా నిత్యం శేషగిరి మాష్టారి పాద పద్మాలను మననం చేసుకుంటే జన్మ ధన్యం అవుతుంది.

కానీ మోహన్‌రావుగారి మాట కాదనలేక పోయాడు రామకృష్ణ.

మరుసటిరోజున ఆఫీసు నుంచి వచ్చి వర్ధనమ్మ ఇచ్చిన సీతారామలక్ష్మణుల పటం తీసుకుని ఎర్రగడ్డకి వెళ్ళాడు.

ఇంటి ఓనర్ శ్రీకాంతమ్మ రామకృష్ణని చూస్తూనే "రా నాయనా! మీరెప్పుడైనా చేరొచ్చు సున్నం కొట్టించి శుభ్రం చేయించాను" అంటూ తాళంచెవి తీసుకొచ్చి తలుపు తీసింది. రెండుగదుల ఇల్లే అయినా నీట్‌గా వుందనిపించింది రామకృష్ణకి. వంటగదిలో పటం పెడుతూ వుంటే "అలాగే దీపారాధన చేసి అగరొత్తులు వెలిగించు నాయనా" అని చెప్పి శ్రీకాంతమ్మ వాళ్ళ ఇంట్లోంచి అగరొత్తులు, అగ్గిపెట్టె, దీపారాధన కుందిలో నూనె, వత్తి వేసుకుని తెచ్చింది. రామకృష్ణ ఆమె చెప్పినట్లే చేసి పటానికి దణ్ణం పెట్టుకున్నాడు.

అప్పుడు సమయం ఏడున్నర దాటింది.





శ్రీకాంతమ్మతో ఆమాటా, ఈమాటా మాట్లాడుతూ పదిహేను నిమిషాలున్నాడు. తర్వాత తలుపేసి తాళంచెవిని ఆమెకిచ్చి మెయిన్‌రోడ్‌లోకి వచ్చాడు.

ఆ సెంటర్‌లో వాహనాల పరుగు, జనం రద్దీ వున్న షాపులూ చూస్తూ అక్కడే టీ తాగి పదినిమిషాలు నిలబడ్డాడు. తర్వాత రోడ్డుదాటి సనత్‌నగర్ వెళ్ళాడు.

సుమతి, సురేష్ పిల్లలతో కబుర్లు చెప్పుకుంటున్నారు. రామకృష్ణ రావడంతో సుమతి లేచి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఇంట్లో పటం పెట్టి దీపారాధన చేసిన విషయం చెప్పాడు రామకృష్ణ.

"గుడ్... మంచి పనిచేశావు" అంటూ సురేష్ మెచ్చుకున్నాడు.

రామకృష్ణ మాట్లాడలేదు. టీ పెట్టుకురావడానికని సుమతి పోబోతుంటే సెంటర్‌లో తాగొచ్చానని చెప్పి ఆమెను వారించాడు. రాత్రికి అక్కడే భోజనం చేసి పడుకున్నాడు.

నిద్రపట్టలా.

'అడవిలో పుట్టింది - అడవిలో పెరిగింది' అనే పొడుపుకథ గుర్తుకొచ్చింది.

తను పుట్టింది, పెరిగిందీ మామూలు పల్లెటూరులో ఇప్పుడు వుంటున్నది మహానగరంలో.

బంధువులుకాదు, స్నేహితులు కాదు. అసలు పరిచయమేలేని వాళ్ళ మధ్య ఆప్యాయంగా ఆదరింపబడుతున్నాడు.

నిజంగా తను అదృష్టవంతుడే.

అష్టదరిద్రాలను అనుభవించాడు. తన కన్నా దురదృష్టవంతుడు లేడని అనుకున్నాడు. నిరాశా నిస్పృహల మధ్య నిస్తేజంగా జీవిస్తూ జీవితంపై విరక్తి కలిగిన తరుణంలో దైవత్వం ఉట్టిపడుతున్న సహృదయుల మధ్యకు తనను చేర్చిన శేషగిరి మాష్టారుకి మనసులోనే నమస్కరించాడు.

గణేష్ గుర్తుకొచ్చాడు. కళ్ళు నీళ్ళతో నిండాయి.

వచ్చిన దుఃఖాన్ని కష్టంమీద ఆపుకు

న్నాడు. ఆ తర్వాత ఎప్పుడో నిద్రాదేవి ఒడిలో సేదదీరాడు.

★ ★ ★

సాయంత్రం ఆఫీసునుంచి రాగానే వర్ధనమ్మ వేడివేడిగా టీ ఇచ్చింది. రామకృష్ణ తాగుతూ సోఫాలో కూర్చున్నాడు.

"ఏమిటయ్యా రామకృష్ణా నువ్వు చేసిన పని" అని అంటూ మోహన్‌రావుగారు వచ్చి సీరియస్‌గా రామకృష్ణ పక్కన కూర్చున్నాడు.

రామకృష్ణకి అయోమయం అయ్యింది. తనేం చేశాడు? ఏదన్నా కానిపని చేశాడా, విషయం తెలియక ప్రశ్నార్థకంగా మోహన్‌రావు మొహంలోకి చూశాడు.

"ముందు టీ తాగు" అన్నాడు మోహన్‌రావు.

తాగబుద్ధి కాలేదు. అయినా తాగాడు. గ్లాసు టీపాయ్‌మీద పెడుతుంటే జేబులోంచి ఓ ఇన్‌లాండ్ లెటర్ తీసి "దీన్ని చదువు" అంటూ చేతికిచ్చాడు మోహన్‌రావు.

టు అడ్రస్ చూశాడు రామకృష్ణ 'మోహన్‌రావుగారు' అని వుంది. ఫ్రమ్ అడ్రస్‌లో శేషగిరి, శాఖవరం అని వుంది. శేషగిరి మాష్టారు మోహన్‌రావుగారికి లెటర్ రాశారు అని అర్థమయ్యింది. మడత విప్పాడు.

'గౌరవ శ్రీ మోహన్‌రావు బావగారికి మీ బావమరిది శేషగిరి కృతజ్ఞతా పూర్వక నమస్సులతో రాయునది, ఉభయకుశలోపరి.

రామకృష్ణ ఉత్తరం రాశాడు. సంతోషంగా వుంది. అతనిని నేను మీ వద్దకు పంపినందుకు నా గౌరవం కాపాడారు. మీ రుణం తీర్చుకోలేనిది. మంచివాళ్ళకే శాపాలుంటాయని అనడానికి రామకృష్ణ ఒక ఉదాహరణ. ఇరవై ఏడేళ్ళ వయసుకే అరవై ఏళ్ళ అనుభవంతో అలసి మీ వద్దకు వచ్చాడు. ఆదరించారు. ఆధారం చూపారు. అండగా మీరున్నారు. ఇంక నేను నిశ్చింతగా వుండగలను.

పోతే రామకృష్ణకి మొహమాటం ఎక్కువ. ఏదీ అడిగేమనిషికాదు. ఉన్నదాంతోనే సంతృప్తిపడే మనస్తత్వం. మీపట్ల అతనికి ఎంతో గౌరవం వుంది. ఉత్తరంలో మీ గురించి 'దైవత్వం ఉట్టిపడే సభ్య సంస్కారాలున్న మానవతామూర్తుల మధ్యకు నన్ను చేర్చిన మీ రుణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేను మాష్టారూ...' అని రాశాడు. ఆ వాక్యం చదివి నేనెంత గర్వపడ్డానో... అది అనిర్వచనీయం. చెల్లాయి వర్ధనమ్మకు నా ఆశీస్సులు చెప్పండి. అతిగా రాశానేమో క్షంతవ్యుణ్ణి. మానవత్వం పరిమళించే మీ పవిత్ర హృదయాల శుభాశీస్సులు రామకృష్ణకు ఉంటాయని ఆశిస్తూ ముగిస్తున్నాను"

ఇట్లు
మీ బావమరిది,
శేషగిరి

ఉత్తరం చదవడం పూర్తిచేసి రామకృష్ణ తల పైకెత్తి మోహన్‌రావుకేసి చూశాడు. మోహన్‌రావు రామకృష్ణ భుజంమీద చెయ్యి వేసి "మమ్మల్ని గురించి బాగా పొగిడేశావు రామకృష్ణ" అన్నాడు.

"లేదు బాబాయిగారూ మనిషిని మనిషిగా గుర్తించే మహోన్నతమైన వ్యక్తిత్వం మీలో చూస్తున్నాను. ముఖస్తుతి కోసం అంటున్నానని అనుకోవద్దు. స్వార్థపూరితమైన ఈ సమాజంలో నేనూ, నాది, నాకు అనే ఆలోచన తప్ప ఎదుటివాడు కూడా మనిషే, వాడూ బతకాలి అనుకొనేవాళ్లు కరువయినారు. ఈర్ష్యా, ద్వేషం, అసూయలతో అమానుషంగా ప్రవర్తిస్తున్నారు. వీటన్నింటికీ మీరు అతీతులు. మీలో కల్మషం లేదు. ఆప్యాయంగా ఆహ్వానించారు. ఆత్మీయంగా అన్నం పెట్టారు. స్నేహితుడిలా సురేష్, సోదరభావంతో సుమతి నన్ను చూస్తున్నారు" మోహన్‌రావు మాట్లాడలేకపోయాడు. తమపట్ల రామకృష్ణకు వున్న గౌరవానికి ముగ్ధుడయ్యాడు.



వర్ధనమ్మకి సంతోషం కలిగింది.

"అదేముందిలే బాబూ... ఒకరికొకరు సహాయం చేసుకోకపోతే ఈ మానవజన్మకు సార్థకం ఏముంటుంది. బతికే నాలుగురోజులూ మనం శుద్ధంగా బతికితే చాలు..." అని అంటూ ఉంటే "రేపు మనం పోతూ ఎత్తుకుపోయేది ఏమీలేదు" అన్నాడు మోహన్‌రావు.

"నీకేం ఫరవాలేదు బాబూ! మేం ఉన్నాం. ఏమవసరమయినా మమ్మల్ని అడుగు, మొహమాట పడకు" అంది వర్ధనమ్మ.

రామకృష్ణకి ఆనందం కలిగింది. ఆమెకి చేతులెత్తి నమస్కరించాలనిపించింది.

కొట్లోంచి గొలుసు విడిపించుకొనిపోయి చూపించినప్పుడు 'ఎప్పుడూ కష్టాలే వుండవు రామకృష్ణా! దేముడి దయవల్ల నాకేలోటూ లేదు. కొడుకుగానీ కూతురుగానీ నానుంచి ఏమీ కోరుకోవడంలేదు. వాళ్ళు జీవితంలో స్థిరపడిపోయారు. నీకు ఎప్పుడు ఏ అవసరం వచ్చినా నన్నడుగు' అన్న శేషగిరి మాస్టారి మాటలు చెవిలో వినిపించాయి.

ఊరుకానిఊర్లో 'నీకు మేం ఉన్నాం' అనే వాళ్ళున్నారు. నిజంగా తను అదృష్టవంతుడే అని అనుకున్నాడు రామకృష్ణ.

★ ★ ★

శ్రీకాంతమ్మకి రామకృష్ణ మంచివాడిలా కనిపిస్తున్నాడు. అతను రోజు మార్చి రోజు వచ్చి ఇంట్లో దీపారాధన చేసి పోతున్నాడు. వచ్చినప్పుడల్లా శ్రీకాంతమ్మ కుందిలో వత్తి వేసి ఇస్తుంది. కూర్చోడానికి కుర్చీ తెచ్చి ఇస్తుంది. మంచినీళ్లు ఇచ్చి ఆమాటా ఈమాటా చెబుతూ తన కుటుంబ విషయాలు చెప్పేది. ఓపిగ్గా వినేవాడు రామకృష్ణ. వినేకొద్దీ ఏమిటో ఈ జన్మ. క్షణభంగురం అనిపించింది. ఎదిగిన కొడుకూ, కోడలూ ఏక్సిడెంట్‌లో పోతే మనవడి బాధ్యత శ్రీకాంతమ్మపై పడింది. భర్త ఆటో నడుపుతాడు. ఆ మనవడే ప్రస్తుతం వాళ్ల ఆనంద చిహ్నం.

శ్రీకాంతమ్మ మనవడి పేరు చంద్రశేఖర్. వాడు రామకృష్ణకి దగ్గరయ్యాడు. అంకుల్ అంకుల్ అంటూ ఇంటి కబుర్లు చెబుతాడు. తాత నారాయణయ్య ఎప్పుడో పొద్దుపోయి ఇంటికి వస్తుండడంవల్ల అతను ఎలా ఉంటాడో కూడా చూడలేదు.

సురేష్ మంచి స్నేహితుడయ్యాడు రామకృష్ణకి. ఇద్దరిమధ్యా చనువు ఏర్పడింది. నువ్వు నువ్వు అనుకునేంత దగ్గరయ్యారు.

మాకూ, మా అంకుల్‌కీ డబుల్ సిలెండర్లున్నాయి అని చెప్పి సురేష్ తనకు తెలిసిన షాపులో రామకృష్ణకి స్టవ్వూ, రెగ్యులేటర్ ఇప్పించాడు.

ఒకటో తారీఖు. ఆఫీసులో పని అయిపోగానే మేనేజర్ గదిలోకి వెళ్లాడు రామకృష్ణ.

"కమాన్ రామకృష్ణా! ఏమిటి విశేషాలు? శాలరీ తీసుకున్నారా? " అని అడిగాడు మేనేజర్.

"తీసుకున్నాను సార్! ఊరికిపోయి ఫ్యామిలీని తీసుకురావాలనుకుంటున్నాను"

"ఎప్పుడు వెళ్తున్నారు? "

"మీరు పర్మిషనిస్తే రేపు వెళ్లి రెండు మూడు రోజుల్లో వచ్చేస్తాను" అన్నాడు రామకృష్ణ.

ఒప్పుకున్నాడు మేనేజర్.

థాంక్స్ చెప్పి బయటపడిన రామకృష్ణ సురేష్ ఇంటికెళ్లాడు.

వెళ్తూనే "బట్టల షాపుకి వెళ్దాం" అన్నాడు.

"ఇప్పుడా" సురేష్ కాస్త అసహనంగా అన్నాడు.

"పంచలచాపు, పైపంచా తీసుకోవాలి"

"అర్జెంటా"

"మా గురువుగారికి పెట్టాలి"

సురేష్ నోటికి మాటలు రాలా. వాచికేసి చూసి "ఆరూముప్పావు కావస్తోంది. లేటయితే బస్సులు లేక ఇబ్బంది పడతావేమో" అన్నాడు.

"నాకు బస్సులకేం, చాలావున్నాయి.




డైరెక్టు కందుకూరు బస్సులు మిస్సయినా నెల్లూరూ, తిరుపతి పోయే బస్సులన్నీ అటే గాపోయేది. సింగరాయకొండలో దిగితే కందుకూర్లో వున్నట్టే. ఒంగోలు బస్సులె క్కినా, ఒంగోలులోదిగి కందుకూరు బస్సెక్కి వెళ్ళొచ్చు ఎట్లా పోయినా తెల్లవారి ఏడుగం టలకల్లా ఇంటికి చేరుకోగలను" అన్నాడు రామకృష్ణ.

"అయితే ఇంకేం..."

"ఒకపనిచేద్దాం. గ్యాస్ సిలీండర్ తీసుకొని పోయి ఇంట్లో దించేసి బట్టలషాపుకి వెళ్దాం. అక్కడ పంచలచాపు తీసుకొని అబిడ్స్ వెళ్ళి పిన్నికీ బాబాయికీ చెప్పేసి బస్టాండ్‌కి వెళ్దాం"

"అలాగే..." సురేష్ అంటూవుంటే "అదే మిటి అన్నయ్యా సిలిండర్ అంటున్నావు. నేరుగా ఇక్కడికి రారా ఏంటి" అని అడి గింది సుమతి.

"లగేజీ వుంటుంది కదమ్మా! బి. హెచ్. ఇ. ఎల్ బస్సులో వచ్చి ఎర్రగడ్డ సెంటర్‌లో దిగేసి నేరుగా ఇంటికి వెళ్ళిపోవచ్చు ఇంట్లో దిగిన గంటకల్లా ఇక్కడికి వచ్చేస్తాం సరేనా..."

"బావుంది. నీ ఆలోచన బావుంది" మెచ్చుకొన్నాడు సురేష్.

"సరే" అంది సుమతి.

"రామకృష్ణ విషయం చెప్పగానే శేషగిరి బావగారిని అడిగినట్టు చెప్పు" అన్నాడు మోహన్‌రావు.

"ఒకసారి అన్నయ్యని రమ్మని చెప్పు బాబూ" అని చెప్పింది వర్ధనమ్మ.

"అలాగే" అని చెప్పి రామకృష్ణ వాళ్ళ దగ్గర సెలవు తీసుకున్నాడు.

బస్టాండుకొచ్చేసరికి కందుకూరు డిపో సూపర్‌డీలక్స్ బస్సు నిలబడి వుంది.

"హలోసార్ వూరికేనా" బస్సు డోర్‌కి దగ్గర్లో కాస్త ముందుగా నిలబడివున్న కండ క్టర్ రామకృష్ణ అటుగారావడం చూసి అడి గాడు.

"అవును సార్" బస్సులోకి ఎక్కబోయిన రామకృష్ణ కండక్టర్ దగ్గరకొచ్చి "సీటేమైనా వుందా" అని అడిగాడు.

"నా వెనక సీట్లో కూర్చోండి" చెప్పాడు కండక్టర్.

రామకృష్ణ వెనక్కి తిరిగి బస్సులోకి వస్తుంటే "కండక్టర్ తెలుసా ఏమిటి? " అని అడిగాడు సురేష్.

"లేదు... కందుకూరివాడేగా. అక్కడ నా మొహం చూసి వుంటాడు" అని చెప్పాడు రామకృష్ణ. బస్సు కదుల్తూ వుంటే రామ కృష్ణ సీట్లో కూర్చుని కిటికీలోంచి చూస్తూ సురేష్‌కి చెయ్యి వూపాడు.

విద్యుత్ దీపాల వెలుగులో వాహనాల రద్దీని దాటుకుంటూ బస్సు ముందుకు పోతూవుంటే-వేగంగా వెనక్కి పరిగెడుతూ వుంది సిటీ.

ఆ సిటీ ఆదరిస్తుందని అనుకోలేదు తను. కానీ-ఆదరించింది, ఆశ్రయమిచ్చింది.

లేకుంటే దిగాలు మొహంతో తిరిగి పోవ లసివచ్చేది. అప్పుడు తన పరిస్థితి ఏమిటి? బతుకుదారి ఏమిటి? భార్యా, పిల్లలూ, తనూ పోషణ ఎలా?

ఉద్యోగంలేక, సంపాదనలేక, కుటుంబాన్ని పోషించుకోలేక, ఆకలి బాధలు భరించలేక ఆత్మహత్యలు చేసుకొన్న కుటుంబాలను గురించిన వార్తలు తను చదివాడు. శేషగిరి మాష్టారి దయవల్ల తనకాస్థితి తప్పింది. తల్లిదండ్రులు ఇంట్లోంచి తరిమేస్తే పెళ్ళాం, పిల్లల్ని బతికించుకోవడం చేతకాక చచ్చాడని అపవాదునుండి తప్పించాడు. నిజంగా ఆయన దేవుడు. ఆ దేవుడే మాష్టారి రూపంలో వచ్చాడు. అప్రయత్నంగా చేతులు రెండూ గుండెమీదకు చేర్చి నమ స్కరిస్తూ,

గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుసాక్షాత్ పరబ్రహ్మా
తస్మై శ్రీ గురవే నమః- అంటూ స్తోత్రం



మననం చేసుకొన్నాడు. చేతులు రెండూ అలాగేవుంచి ఆ శ్లోకాన్ని మళ్ళీ మళ్ళీ అనుకొన్నాడు. అలా అనుకొనేకొద్దీ ఆ స్తోత్రం లోంచి ఏవో మహోన్నతమైన భావాలు సాక్షాత్కరిస్తున్నాయి.

ఆ గురు శబ్దమే మహోన్నతమైనది- మహత్తరమైనది. గౌరవనీయులలో ప్రథమ స్థానం ఆ గురువుదే.

శేషగిరి మాష్టారు తనకు కేవలం అక్షర జ్ఞానం కలిగించిన గురువు మాత్రమే కాదు, తనకోసం తపించాడు. అభిమానంతో ఆదరించాడు. ఆకలితీర్చి జీవనమార్గం సుగమం చేశాడు.

ఆ మహాత్ముడి రుణం తీర్చుకోలేనిది. నిలువెత్తు బంగారంతో సన్మానించినా అది తీరేది కాదు. పవిత్రత పోతపోసిన ఆ మహనీయుడి పాదాలముందు మోకరిల్లి స్తోత్రించినా తీరేదికాదు.

అంత మంచి గురువు అండగా వున్న తను నిజంగా అదృష్టవంతుడే... ఆనందం అనుభవిస్తూ వుంటే వేగంగా పరుగెడుతున్న బస్సుకి ఒక్కసారిగా బ్రేకు పడ్డట్టు అమ్మా, నాన్నలు గుర్తుకు వచ్చి ముల్లు గుచ్చుకున్నట్లయ్యింది. వెంటనే సంతోషం అంతా తుఫాను గాలికి కొట్టుకొనిపోయినట్లయిపోయి నీరసించిపోయాడు. తను అదృష్టవంతుడు అని అనుకొన్నాడు కానీ కాదు. ముమ్మాటికి కాదు. తను దురదృష్టవంతుడే. తనలాంటి కష్టాలు ఎవరికీ వద్దు. కన్నతల్లి దండ్రులవల్ల ఎవరూ అవస్థలు పడకూడదు.

ఆలోచనల్లో...

చీకటి తెలియకుండా తెల్లవారినట్టుంది. సరిగ్గా ఆరున్నర అయ్యేసరికి బస్సు కందుకూరు బస్టాండులోకి వచ్చి ఆగింది.

శాఖవరం వెళ్ళే బస్సు రావడానికి అర గంట టైం వుంది.

రామకృష్ణ బస్టాండ్‌లోంచి బయటకు వచ్చి యస్.టి.డి. బూతునుంచి హైదరాబాదుకి ఫోన్ చేశాడు.

"హలో ఎవరు" అవతల సురేష్ ఫోన్ ఎత్తాడు.

"నేనూ రామకృష్ణని. ఇప్పుడే కందుకూరులో దిగాను"

"గుడ్... జర్నీ బాగా జరిగిందా? "

"ఆహా...! పిన్నీ, బాబాయికి చెప్పు"

"అలాగే... నువ్వొచ్చేటప్పుడు ఫోన్ చెయ్యి. నేను ఎర్రగడ్డ సెంటర్‌కి వస్తాను"

"లేదు. నేను ఫోను చెయ్యను"

"అదేం"

"సారీ ప్లీజ్. నీకు శ్రమ కల్పించడం ఇష్టంలేదు. ఫోన్ పెట్టేస్తున్నా, వుంటాను" అంటూ ఫోన్ పెట్టేసి బిల్ చెల్లించి వచ్చాడు.

పక్కనే క్యాంటీన్‌లో నోరు పుక్కిలించి టీ తాగాడు. పళ్ళూ, పూలు తీసుకొని బస్టాండ్‌లోకి వచ్చేసరికి బస్సు వచ్చివుంది. ఎక్కి అందులో కూర్చుని గంటకల్లా శాఖవరం అంకమ్మ గుడిముందు దిగాడు.

★ ★ ★

ఆ గుడే ఆ వూరి బస్టాండ్.

ఊరికి పడమటిగా వున్న చెరువుకట్టకి వుత్తరాన వుందది. అది ఎప్పుడు కట్టించారో, ఎవరు కట్టించారో ఆ వూళ్ళో ఎవరికీ తెలియదు. ఒకే కప్పుకింద మూడు గుడులున్నాయి. ఒక గుడిలో అంకమ్మ, ఇంకో గుడిలో గంగమ్మ, మరో గుడిలో నాంచారమ్మ, బంగారమ్మ అమ్మవార్ల శిలలున్నాయి. కానీ పాపం ఆ దేవతలకి ధూప దీప నైవేద్యాల శాపం వున్నట్లుంది. అందులో పూజారి ఎవరో కూడా ఇదమిద్ధంగా తెలీదు. ఎప్పుడో జరిగే కొలువులు, జాతరలు తిరునాళ్ళవంటి సంబరాలలో మాత్రం కానుకల కోసం మేము మేమంటూ మోహన బొట్టుపెట్టుకొని కొందరు ముందుకొస్తారు. ఆ తర్వాత వాళ్ళు ఎంత వేగంగా ముందుకొచ్చారో అంత వేగంగా వెళ్ళిపోతారు. అయినా ఆ తిరునాళ్ళ సంబరాలు ఎప్పుడు జరుగుతాయో ఎవరికీ తెలియదు.




ఊళ్ళో పశువులకు రోగాలొచ్చి అకాలంగా చస్తుంటే అప్పుడు వూరికి శని పట్టిందని పెద్దలు అంకమ్మ తల్లికి ముడుపులు కట్టి గొడ్డుకింతని చందా వసూలు చేసి తిరునాళ్ళు జరిపిస్తారు. ఆ తంతు నెలరోజుల పైనే జరుగుతుంది. ఆ నెలరోజులూ అంకమ్మగుడి ప్రాంతం జనసంద్రంగా మారి రాత్రిళ్ళు పొద్దుపోయేవరకు కోలాహలంగా వుంటుంది.

సత్తెమ్మ, మారెమ్మ, పోలేరమ్మా, దుర్గమ్మ, గంగమ్మ, పేరంటాళ్ళమ్మ, అంకమ్మ దేవతలందరికీ కొలువులు జరిపించి పొంగళ్ళు పొంగించడం, తప్పెట్లూ తాళాలతో వీరతాళ్ళ వూరేగింపులు, కత్తిసామూ, కర్రసాముల ఉత్సాహాలతో గూడుబండ్ల పరుగులు, జముకుల కథలు, కొమ్ముకథలు, భజనలు, కోలాటం, మాతంగి సరసాలతో వూరు వూరంతా ఒకటే సందడి.

ఆ రోజుల్లో ఆ గుడి తెల్లగా ముస్తాబవుతుంది. అందులోని దేవతామూర్తులు ధూప, దీపాలతో కడుపారా నైవేద్యం ఆరగిస్తారు. ఆ తరువాత- అడపా దడపా వూళ్ళో వాళ్ళు తమ పిల్లలకి అమ్మవారు పోస్తేనో, పశువులు మేత మేయకపోతేనో, పాడిగేదెలు పాలివ్వకపోతుంటేనో వచ్చి గుడిలో వడపప్పూ పానకం పంచడం, చద్దిపెట్టడమో, పొంగలి పొంగించి పందారం చెయ్యడమో, కోడిని తిప్పి మెడతుంచి వండుకొని తినడమో- ఎవరికి వాళ్ళు అనుకున్నప్రకారం మొక్కులు తీర్చుకుంటుంటారు.

కొందరు పంట బాగా దిగుబడి అయితే గూడుబండి కడతామనీ, అప్పులు తీరితే వీరతాళ్ళేసుకుంటామని, కూతురి పెళ్ళయితే బొల్లావులు మోస్తామని మొక్కులు మొక్కుతారు.

బస్సు దిగగానే రామకృష్ణకి గుడి కనబడింది.

అంకమ్మతల్లి గుడికిపోయి కొబ్బరికాయ కొట్టొద్దామండీ అని లక్ష్మి ఇదివరలో తనతో అనడం గుర్తుకు వచ్చింది.

వెంటనే పక్కనున్న కొట్లో కొబ్బరికాయ కొనుక్కొని పోయి అంకమ్మగుడి ముందు నిలబడ్డాడు. భక్తిగా అంకమ్మ తల్లికేసి చూస్తూ కొబ్బరికాయకొట్టి దణ్ణంపెట్టుకొన్నాడు.

చిప్పలు రెండూ తీసుకొని ఇంటికి వెళ్ళేసరికి నరేష్, మహేష్ పంచలో కూర్చుని శాంతమ్మతో కబుర్లు చెప్తున్నారు. రామకృష్ణ రావడం చూసి "నాన్నొచ్చాడు" అంటూ వాళ్ళు లేచి ఎదురు వెళ్ళారు. రామకృష్ణ తన చేతిలోని కొబ్బరి చిప్పలను నరేష్‌కిచ్చి మహేష్‌ని ఎత్తుకొన్నాడు.

"ఏం బాబూ. కులాసానా" అని అడిగింది శాంతమ్మ.

"ఆ... మీరెప్పుడొచ్చారత్తయ్యా" అని అడిగాడు రామకృష్ణ.

"వారం రోజులయ్యిందయ్యా" అంటూ ఇంట్లోకి నడిచి "అబ్బాయి వచ్చాడు" అని దొడ్లో అంట్లు తోముతున్న లక్ష్మికి చెప్పింది.

లక్ష్మి చేస్తున్న పని ఆపి చేతులు కడుక్కొని వచ్చింది.

"ఇవ్వాళ గానీ, రేపుగానీ రావచ్చని బాబాయిగారు చెప్పారు" అంది.

రామకృష్ణ మంచంమీద కూర్చుని బ్యాగ్ లోంచి అరటిపళ్ళూ, పూలూ, పంచల ప్యాకెట్టూ తీసి లక్ష్మికిచ్చాడు.

లక్ష్మి ప్యాక్ తెర్చి చూసి "పంచలెందుకు" అని అడిగింది.

"మనం వెళ్ళేటప్పుడు మాష్టారుకి పెట్టాలి"

లక్ష్మి మొదట్లో ఆశ్చర్యపడి తర్వాత సంతోషపడింది.

"ఎప్పుడు వెళ్తున్నారు" శాంతమ్మ అడిగింది.

"ఏదో తారీకు అత్తయ్యా. ఇల్లు చూశాను. పిల్లల్ని స్కూల్లో చేర్చడానికి మాట్లాడాను" చెప్పాడు.

లక్ష్మి పంచలచాపు మళ్ళీ పొట్లాంకట్టి అల్మరాలో పెట్టింది. "మాష్టారిగారింటికి

వెళ్లొస్తా" అంటూ లేచి రామకృష్ణ తను తెచ్చిన పూలూ, పళ్లూ సగం తీసుకొని శేష గిరి మాష్టారుగారింటికి వెళ్ళాడు. అప్పుడే శేషగిరిమాష్టారు స్కూలుకి బయల్దేరుతు న్నాడు. రామకృష్ణని చూసి "ఇప్పుడేనా వచ్చింది" అని అడిగాడు.

"అవును మాష్టారు. ఇంట్లో బ్యాగ్ పెట్టేసి వస్తున్నాను"

"తెలుస్తూనే వుంది. ఏమిటి సంగతులు"

"అంతా బావుంది మాష్టార్లు" అంటూ పళ్లూ, పూలూ పద్మావతమ్మ చేతికిస్తూ "ఐదో తారీకు వెళ్లిపోతామమ్మా" అని చెప్పాడు.

"మంచిది నాయనా. ఇప్పటికయినా దేవు డికి దయకలిగింది. ఇంక కష్టాలు తొలిగిపో యినట్లేలే. పిల్లల్ని మంచి స్కూల్లో చేర్పించి చదివించు" అని ఆమె చెప్తూవుంటే రామ కృష్ణ శేషగిరి మాష్టారితో "వర్ధనమ్మా, మోహన్‌రావుగారు మిమ్మల్ని ఒకసారి రమ్మన్నారు మాష్టారు" అని చెప్పి వాళ్ళని గురించి, సుమతి, సురేష్‌ల గురించి, వాళ్ళు తనను గౌరవించిన విధం, చూపిన ప్రేమా దరాల గురించీ, వాళ్ళ దొడ్డమనస్సులను గురించి, తను రెంటుకు తీసుకొన్న యిల్లు, శ్రీకాంతమ్మను గురించి హుషారుగా పది హేను నిముషాలలో చకచకా చెప్పేశాడు. అలా చెప్తున్నప్పుడు రామకృష్ణ మొహంలో కనబడ్డ సంతోషాన్ని చూసి శేషగిరి మాష్టారు ఎంతగానో ఆనందపడ్డాడు. ధైర్యంచేసి తను పంపిన వ్యక్తిని ఆదరించి ఆధారం చూపిన వర్ధనమ్మా, మోహన్‌రావు లకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొని 'ఇంక రామకృష్ణకు ఏం ఫర్వాలేదు' అను కొని తృప్తిగా సంతోషించాడు.

★ ★ ★

మధ్యాహ్నం భోజనాలు అయిన తరు వాత "అమ్మ వూరికి పోతుందట" అని చెప్పింది లక్ష్మి రామకృష్ణతో.

"అదేం మనం వుండేది రెండురోజులేగా అందాకా వుండొచ్చుగా" అన్నాడు రామ కృష్ణ.

"అలా కాదట మనం పాలెం పోవాలంట"

"మనమా..." రామకృష్ణ అంటుంటే "అవును బాబూ మీరు దూరం వెళ్తున్నారు. ఇంకెప్పుడొస్తారో, ఏందో. రేపు అమ్మాయినీ, పిల్లల్ని తీసుకొని రా. సాయంకాలందాకా వుండొద్దురు గానీ" అని చెప్పింది శాంతమ్మ.

రామకృష్ణ ఆలోచించాడు. ఆమె అలా అడగడం సబబుగానే వుందనిపించింది.

"సరే... అలాగే వస్తాం" చెప్పాడు.

శాంతమ్మ మనసు తృప్తిపడింది. అప్పటి కప్పుడే ఆమె ప్రయాణమై "నేను వెళ్తాను. మీరు రేపు పొద్దున పెందళాడే రండి" అని చెప్పేసి పాలెం వెళ్ళిపోయింది.

ఆ రోజు చాలా తొందరగా చీకటిపడి తెల్లవారినట్టుంది.

లక్ష్మి పొద్దున్నే లేచి త్వరత్వరగా పాచి పని చేసింది.

ఎనిమిదింటికల్లా పప్పు పొంగలి చేసి పిల్లలిద్దరికీ మొహాలు కడిగించి బట్టలు తొడిగి రెడీ చేసి తనూ రెడీ అయ్యింది. ఈలోగా రామకృష్ణ రెడీ అయ్యాడు. అందరూ కలిసి పొంగలి తిని యింటికి తాళంవేసి పాలెం బయల్దేరారు.

వాళ్ళు రావడంతో ఇంట్లో పండగ వాతా వరణం ఏర్పడింది. కొడుకు పిల్లలు, కూతురు పిల్లలూ కల్లాకపటం లేకుండా ఆడుకొంటుంటే శాంతమ్మకి మహదానం దంగా వుంది. ఆమెకి కూతురూ, అల్లుడూ దూరంగా పోతున్నారని ఒకపక్క దిగులుగా వున్నా యింకోపక్క వాళ్ళు అక్కడ స్థిరపడి సుఖపడతారని సంతోషంగా వుంది.

మాధవీ, లక్ష్మి స్నేహితుల్లా కబుర్లు చెప్పుకొంటూ వంట చేశారు. స్పెషల్‌గా మినపగారెలు, సేమియా పాయసం. షడ్రు చుల భోజనం ప్రేమగా ఆత్మీయతను పంచుకొన్నట్లుగా అందరూ కలిసి భోంచే శారు. ఆనందంగా కబుర్లు చెప్పుకొన్నారు.




అయిదు గంటలవుతుండగా రామకృష్ణ లేచి ప్రయాణమయ్యాడు. లక్ష్మి పిల్లల్ని రెడీ చేసి తను ప్రయాణం అవుతూవుంటే మాధవి నట్టింటో పీటవేసి కూర్చోబెట్టి కాళ్ళకు పసుపుపూసి నుదుట బొట్టుపెట్టింది. "ఇప్పుడొద్దు వదినా ప్లీజ్" అని లక్ష్మి వారించినా వినకుండా చీరా, జాకెట్టు పెట్టింది.

"ఎల్లుండి నేనొస్తానులే బావా వూరికి" అన్నాడు కుమారయ్య రామకృష్ణతో సాగనంపుతూ.

"వదిననూ, అమ్మనూ తీసుకొని రా అన్నయ్యా" అని చెప్పింది లక్ష్మి.

"వాళ్లటు కందుకూరు బస్టాండుకి వస్తార్లేయ్యా" చెప్పాడు కుమారయ్య.



ఐదో తారీఖు వుదయం ఎనిమిది గంటల బస్సులో రామకృష్ణ కందుకూరు పోయి ఆరోజు సాయంకాలం ఏడుగంటలకు బయల్దేరే బి. హెచ్. ఇ. ఎల్ బస్సుకి రెండు టిక్కెట్లు రిజర్వు చేయించుకొని పదిగంటల బస్సులో తిరిగి వచ్చాడు.

అప్పటికే పాలెంనుంచి కుమారయ్య రావడంతో అన్నా చెల్లెలు కలసి సామాను ప్యాక్ చేస్తున్నారు.

రామకృష్ణ రాగానే "ఇక్కడ వంట చెయ్యవద్దని బాబాయిగారు చెప్పారు" అని చెప్పింది లక్ష్మి.

రామకృష్ణకి విషయం అర్థంకాక లక్ష్మికేసి చూశాడు.

"వాళ్ళయింటికి భోజనానికి పోవాలట"

ఆమాట వినగానే రామకృష్ణ ఏం మాట్లాడలేకపోయాడు. మంచం మీద కూర్చుని అలాగే ఐదు నిముషాలు వుండిపోయాడు. ఆ అయిదు నిముషాలలో అతని మనస్సు ఎక్కడెక్కడో పరిభ్రమించింది. అమ్మా, నాన్నా, అక్కా, బావలమీదుగా శేషగిరి మాష్టారి దగ్గరికొచ్చి ఆగిపోయింది.

ఆయనెవరు? తనెవరు? ఆయనకీ, తనకీ వున్న సంబంధం ఏమిటి? తనను గురించి ఆలోచించవలసిన అవసరం ఆయనకెందుకు? సాటి మనిషిగూడా సుఖంగా జీవించాలనే పవిత్రమయిన హృదయం వున్నవాడు కాబట్టి. కనుకనే అన్నం పెట్టి దీవించి పంపాలనుకొన్నాడు. అలా అనుకొంటుంటే రామకృష్ణ మనస్సుకి ఎంతో హాయిగా వుంది.

"ఇంటికి పోయి అత్తయ్యకీ, మావయ్యకి చెప్పొద్దామండీ" అన్నది లక్ష్మి.

చివుక్కున తలపైకెత్తి లక్ష్మిమొహంలోకి అదోలా చూసి "అఖ్ఖర్లేదు" అన్నాడు ఖచ్చితంగా.

"అదేమిటండీ అల్లా అంటారు"

"అంతే... ఇంకెప్పుడూ వాళ్ళ ప్రస్తావన తేవద్దు"

"దయచేసి మీరు కోప్పడకండి"

"కోపం కాదు... అసహ్యం, ఆవేదన"

"ఎన్నన్నా వాళ్ళు మీ అమ్మా, నాన్నా కదండీ"

"వద్దులక్ష్మి... ఇంక వాళ్ళ గురించి మాట్లాడకు"

"అలా అనకండి. చెప్పడం మన బాధ్యత"

"వాళ్ళంత సభ్య సంస్కారాలున్న మనుషులా. వాళ్ళను తల్లీ, తండ్రి అని చెప్పుకో

డానికి సిగ్గుపడుతున్నాను తెలుసా. కన్న వాళ్ళెవరయినా కొడుకు కష్టాన్నీ, చావునీ కోరుకుంటారా... వాళ్ళ మొహాలు చూస్తేనే పాపం వస్తుంది"

"ప్లీజ్... నా మాట వినండి"

"నో... ఈ విషయంలో నేనెవరి మాటా వినను"

"ఇందాక బాబాయిగారు కూడా చెప్పారు. ఎవరి పాపం వాళ్ళది. మీరు వెళ్ళి చెప్పి రండి అని"

రామకృష్ణ నోట మాటలాగిపోయాయి. మౌనంగా వుండిపోయాడు. కాసేపు చేత్తో గడ్డం తడుముకొన్నాడు, కాసేపు నుదురు రుద్దుకొన్నాడు.

"దయచేసి బాధ పడొద్దండీ" అంది లక్ష్మి.

రామకృష్ణ లక్ష్మి మొహంలోకి చూసి అదోలా పెదాలు కదిలించాడు. ఆ పెదాల కదలిక చూసిన లక్ష్మి కళ్ళు చెమ్మగిల్లకుండా వుండలేకపోయాయి. తలవంచుకొని తుడుచుకొన్నది.

పది నిముషాలకు మామూలు స్థితికి వచ్చారు.

"సరే పోయిచెప్పొద్దాం పద" అంటూ లేచాడు రామకృష్ణ

లక్ష్మి మనుసు కుదుటపడింది.

"అన్నయ్యా మేము అత్తయ్యవాళ్ళకి చెప్పొస్తాం" అని కుమారయ్యకు చెప్పి రామ కృష్ణ వెంట బయల్దేరింది.

ఆ సమయంలో స్వాతి, భూదేవమ్మ వీధి వాకిట్లో కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు. వీధిలో లక్ష్మి, రామకృష్ణ రావడం స్వాతి చూసి "అమ్మమ్మా మావయ్య, అత్తా వస్తున్నారు" అని చెప్పింది.

భూదేవమ్మ తల తిప్పి అటుకేసి చూసి కొడుకూ కోడలు అటే వస్తుండడంతో చటుక్కున లేచి "లే పోదాం" అంటూ స్వాతిని లేవదీసి రపీమని తలుపేసి లోపల గడి పెట్టి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మాడుమీద కొట్టినట్టయ్యింది రామకృష్ణకి. నిలబడి లక్ష్మికేసి చూశాడు. ఆమె నోట మాటలు రాలా.

"ఛీ... వీళ్ళ మొహం చూడగూడదు" అంటూ వెనక్కు తిరిగాడు. అతని వెనకాలే నడచి వచ్చింది లక్ష్మి. ఇంటికి వెళ్ళేసరికి "శేషగిరి మాష్టారుగారు రమ్మని చెప్పి పోయారు" అని కుమారయ్య చెప్పాడు.

అప్పుడు టైం చూశాడు రామకృష్ణ, ఒంటిగంటకావస్తోంది. తలుపేసి అందరూ శేషగిరి మాష్టారిగారింటికి వెళ్ళారు. అమ్మ తలుపేసిన విషయం చెప్పి బాధపడ్డాడు రామకృష్ణ.

శేషగిరి మాష్టారు చిన్నగా నవ్వి "నువ్వేం బాధపడకు వాళ్ళొట్టి మూర్ఖులు. ఇంకా లోకం తెలియడంలేదు" అన్నాడు. పద్మావతమ్మ హృదయపూర్వకంగా చేసిన వంట అమృతంలా వుంది. మాష్టారి మనసులా.

భోజనాలు అయ్యేసరికి రెండున్నర అయ్యింది. ఇంకో రెండున్నర గంటలే ఆవూళ్లో వుండేది అని అనుకొంటూవుంటే రామకృష్ణకి ఏదో పోగొట్టుకొంటున్నట్లుగా మనసుని తెలియని దిగులు ఆవహించింది.

అందరినీ అక్కడే వుండమని చెప్పి తను యింటికి వెళ్ళి పంచలచాపు ప్యాకెట్ తెచ్చాడు.

నట్టింట్లో కుర్చీవేసి "ఇలారండి మాష్టారూ" అంటూ శేషగిరి మాష్టారుని తీసుకొచ్చి అందులో కూర్చోబెట్టాడు. పంచ, పైపంచ, తాంబూలంతో తెచ్చి "నన్ను దీవించండి మాష్టారూ" అంటూ ఆయన చేతుల్లో పెట్టి వంగి పాదాలు పట్టుకున్నాడు.

అప్రయత్నంగా శేషగిరి మాష్టారి కళ్ళు చెమ్మగిల్లాయి. "నీకు శుభం కలుగుతుంది నాయనా" అంటూ రామకృష్ణని లేవదీసి అతని కళ్ళలో నీళ్ళుండడం చూసి, "దేవుడు నిన్ను చల్లగా చూస్తాడు" అన్నాడు.

"ఇంక నేను ఈ వూరికి రాను మాష్టారూ" అదురుతున్న పెదాలతో కట్టలు




తెంచుకొని దూకిన కన్నీటిమధ్య అన్నాడు రామకృష్ణ.

శేషగిరి మాష్టారు చలించిపోయాడు. ఆయన హృదయం బావురుమంది. కళ్ళ లోంచి నీటిచుక్కలు రాలాయి. పెదాలు తడబడ్డాయి. "రావద్దు రామకృష్ణా రావద్దు, ఈ వూరు రానేరావద్దు" అంటూ రామకృష్ణని తన హృదయానికి హత్తుకొని ఓదార్చి "నువ్వింక ఈ వూరినీ, ఈ వూరి జ్ఞాపకాలనూ మర్చిపో. మనుషులమధ్య మనుగడ సాగించు. నీకు మంచి భవిష్యత్తు వుంది" అంటూ వీపు తట్టి ధైర్యం చెప్పాడు.

రామకృష్ణలో వుత్సాహం వువ్వెత్తున ఎగిసింది. మనసు ఆనందనృత్యం చేసింది. మాష్టారి రూపం మూర్తీభవించిన పరబ్రహ్మంగా దర్శనమిస్తూ ఆయన మాట వేద భాష్యంగా ధ్వనిస్తూవుంది.

సెండాఫ్ ఇవ్వడానికి శేషగిరి మాష్టారు కందుకూరుకు వస్తానంటే "వద్దు మాష్టారూ, మీరెక్కడికీ రావద్దు. మీ ఆశీస్సులే మా వెంట వున్నాయి. ప్లీజ్" అంటూ రామకృష్ణ వారిస్తే "సరే అంకమ్మగుడిదాకా వస్తా" అంటూ ఐదుగంటల బస్సుకు వాళ్ళు బయల్దేరుతుంటే బస్టాండుకు వచ్చాడు. బస్సు కదిలేవరకూ, అక్కడే వుండి వెళ్ళగానే లెటర్ రాయమని చెప్పాడు.

మాస్టారికి దూరంగా పోతున్నామన్న భావన భరించలేకపోతున్నాడు రామకృష్ణ. బస్సు వేగం పుంజుకొంటుంటే తల అటూ ఇటూ తిప్పి బయటకు చూశాడు. పొలాలు దాటుకొంటూ పరిగెడుతోంది.

'ఈ ఊరికి, తనకి ఋణం తీరిపోయింది. గురువుగారిని మళ్లీ చూసే భాగ్యంలేదు. ఓ దేముడా! నా గురువుగారి దర్శనభాగ్యం నాకు మళ్లీ కలిగించు. ఓ అంకమ్మ తల్లీ నేను ఈ ఊరు రాకపోయినా నీ పేరుమీద కొబ్బరికాయ కొడతాను. మా గురువుగారిని నేను మళ్లీ చూసే భాగ్యం కలిగించు. ఆయన నాకు గురువేకాదు, దేముడు. దేముడికన్నా గొప్పవాడు. ఆయన పాదపద్మాలను కడిగే భాగ్యం కలిగించు తల్లీ' బస్సు ఊరు ఎప్పుడు దాటిందో- కందుకూరు వచ్చేసరికి బస్టాండ్‌లో శాంతమ్మ, మాధవి పిల్లలతో వచ్చి ఉన్నారు.

వాళ్లు ఒక బాక్సులో జంతికలు, ఇంకో బాక్సులో అరిసెలు తెచ్చారు.

"ఏంటో నాయనా! దూరం వెళ్లిపోతున్నారు" శాంతమ్మ కంట తడి పెట్టుకొన్నది.

"జాబులు రాస్తుండన్నయ్యా" అన్నది మాధవి.

"డబ్బు అవసరమైతే తెలియపరుచు బావా" అని చెప్పాడు కుమారయ్య. పిల్లలిద్దరినీ దగ్గరకు తీసుకుని వాళ్లు "వద్దు మామయ్యా"అని అంటున్నా చెరొక వందా జేబులో పెట్టాడు.

బంధాలు దూరమవుతున్నాయన్న భావనతో మనసులు బావురుమంటున్నాయి. బస్సు కదులుతూ ఉంటే ఆడవాళ్లు ముక్కులు చీది, కళ్లు తుడుచుకున్నారు.

కాలం చూస్తూనే వుంది.

చూస్తుండగా బి. హెచ్. ఇ. ఎల్ బస్సు కందుకూరు దాటిపోయింది.

★ ★ ★

చీకటిని చీల్చుకుంటూ దూకింది బస్సు సిటీలోకి. ఆరు గంటలవుతూండగా ఎర్రగడ్డ సెంటర్‌లో దిగి లగేజిని ఆటోలో వేసుకుని వెళ్లారు.

అప్పుడే శ్రీకాంతమ్మ ఇంటిముందు నీళ్లు జల్లి ముగ్గులు పెడుతోంది. రామకృష్ణ ఆటోలోంచి దిగుతూనే, "ఏం బామ్మగారూ! బాగున్నారా? " అంటూ పలకరించాడు.

"బాగున్నాం నాయనా!" అంటూ శ్రీకాంతమ్మ "ఏమ్మా సామానంతా తెచ్చేసుకున్నారా? " అని లక్ష్మితో మాటలు కలిపింది.

"మంచాలు తప్ప అన్నీ తెచ్చుకున్నాం బామ్మగారూ" చెప్పింది లక్ష్మి.

"సరేలేమ్మా అవి ఇక్కడ తీసుకోచ్చు" అంది శ్రీకాంతమ్మ.



రామకృష్ణ ఇంటితాళం తీసి సామాను ఇంట్లోకి చేర్చాడు.

పిల్లలతో ఇంట్లోకి పోయిన లక్ష్మి తలుపు చాటున ఉన్న చిన్న చీపురుతో ఇల్లు చిమ్మ బోయింది.

"దాంతో చిమ్మ లేవమ్మా మా ఇంట్లోంచి తెస్తానుండు" అంటూ శ్రీకాంతమ్మ వాళ్ల ఇంట్లోంచి చీపురు తెచ్చి ఇచ్చింది.

"నాన్నా! నాకు దప్పికవుతోంది" చిన్నగా అడిగాడు నరేష్ రామకృష్ణ దగ్గరగా వచ్చి.

"బామ్మగారూ, మంచినీళ్లు ఇస్తారా?" రామకృష్ణ అడిగాడు.

"ఇస్తావా ఏంది నాయనా ఇయ్యి బామ్మా అని అడుగు. మా దగ్గర మొహమాటం పడద్దు" అంటూ పోయి చెంబునిండా మంచినీళ్లు, గ్లాసు తెచ్చి ఇస్తూ "రాత్రంతా ప్రయాణం చేశారు. అట్లాగే కాస్త టీ తెస్తాను తాగండి" అనేసి పోయింది.

"బామ్మగారు మంచిదిలా ఉంది" అంది లక్ష్మి.

"మంచిదే పాపం" అన్నాడు.

లక్ష్మి ఇల్లు చిమ్మి ముందుగదిలో చాప వేసేసరికి శ్రీకాంతమ్మ టీ తెచ్చి ఇచ్చింది.

"పొద్దున్నే బామ్మగారిని శ్రమ పెడు తున్నాం" అంది లక్ష్మి.

"ఇందులో శ్రమేం ఉంది తల్లీ, మీరలా ఏం అనుకోవద్దు" అంది శ్రీకాంతమ్మ.

టీ తాగిన తర్వాత రామకృష్ణ చాపమీద దుప్పటి పరిచాడు. పిల్లలిద్దరూ పడుకొని అయిదు నిమిషాలలో నిద్రలోకి జారుకు న్నారు.

లక్ష్మి, రామకృష్ణ సామాను సద్ది నీళ్లు పట్టిపోశారు.

"అంకుల్ వచ్చారా?" అంటూ వచ్చాడు చంద్రశేఖర్.

వాడిని లక్ష్మికి పరిచయం చేశాడు రామ కృష్ణ.

"ఏంచదువుతున్నావు బాబూ?" అడిగింది లక్ష్మి.

"సెవెన్త్ క్లాస్ ఆంటీ" చెప్పాడు చంద్రశే ఖర్.

"మా పిల్లల్ని కూడా తీసుకువెళతావా?"

"ఎందుకు తీసుకువెళ్లను ఆంటీ. మొన్న అంకుల్ వచ్చి స్కూల్లో మాట్లాడాడుగా" అంటూ చంద్రశేఖర్ రామకృష్ణ కేసి చూసి "అంకుల్! పిల్లల్ని ఎప్పట్నించి పంపి స్తారు?" అని అడిగాడు.

"రెండురోజుల్లో" చెప్పాడు రామకృష్ణ.

పదినిమిషాల్లో వెళ్లిపోయాడు చంద్రశే ఖర్.

"నువ్వు స్నానం చేసి రెడీగా ఉండు లక్ష్మీ, ఈలోగా నే వెళ్లి పాలూ, కూరలూ తెస్తాను. తరువాత సురేష్ వాళ్లని, పిన్నీ బాబాయ్‌లనీ పిలిచివద్దాం" అని చెప్పాడు రామకృష్ణ.

"వాళ్లు వస్తారంటారా?" అనుమానం వెలిబుచ్చింది లక్ష్మి.

"సురేష్, సుమతి తప్పకుండా వస్తారు. పిన్నీ వాళ్లు పెద్దవాళ్లు. అబిడ్స్‌నుంచి రావడం వాళ్లకి కాస్త శ్రమే అవుతుంది. అయినా మనం పిలవాలి కదా"

"పిలుద్దాం. తప్పకుండా పిలుద్దాం. వద్దని కాదండీ. వాళ్లు పెద్దవాళ్లు కదా వస్తారా అని"

"మంచితనం, మానవత్వం ఉన్నవాళ్లు లక్ష్మీ. అలాంటి వాళ్ల అండ దొరకడం మన అదృష్టం. మనవల్ల ఏ లోపం జరక్కూ డదు. పిలవడం మన ధర్మం. రావడం, రాకపోవడం అది వాళ్ల ఇష్టం." అంటూ బ్యాగ్ తీసుకుని బయటకి వెళ్లాడు.

లక్ష్మి స్నానం చేసి రెడీ అయ్యేసరికి రామకృష్ణ రెండు పాల ప్యాకెట్‌లూ కూర గాయలూ తీసుకుని వచ్చాడు. అతను స్నానం చేసేసరికి ఎనిమిదిన్నరయ్యింది.

శ్రీకాంతమ్మకు చెప్పి సనత్‌నగర్ బయలు దేరారు.

సుమతి ఒక్కతే ఉంది ఇంట్లో. రామకృష్ణ భార్యాపిల్లలతో రావడం చూసి "రండి"




అంటూ సాదరంగా ఆహ్వానించి పిల్లలిద్దరినీ దగ్గరకు తీసుకుంటూ "మీ పేర్లేమిటీ? " అని ఆప్యాయంగా అడిగింది.

"నా పేరు నరేష్"

"నా పేరు మహేష్" చెప్పారిద్దరూ.

"గుడ్". వాళ్ళని మెచ్చుకుంటూ "పొద్దున్నే వచ్చారా? " అంటూ లక్ష్మికేసి చూసింది.

"అవును" లక్ష్మి చెప్తూవుంటే "పిల్లలే రమ్మా స్కూలుకు వెళ్ళారా" అని అడిగాడు రామకృష్ణ.

"అవునన్నయ్యా. ఇప్పుడే వెళ్ళారు"

"మరి సురేష్ ఏడి"

"ఆయన ఎనిమిదింటికే ఆఫీసుకు వెళ్ళారు"

"ఇంట్లో పాలు పొంగించాలమ్మా నువ్వొచ్చెయ్. అందరికీ అక్కడే మధ్యాహ్నం భోజనాలు. సురేష్‌ని నేరుగా అక్కడికే రమ్మని ఫోన్ చెయ్యి" అని చెప్పాడు రామకృష్ణ.

"భోజనాలూ, అవీ ఎందుకన్నయ్యా వూరికే పాలు పొంగిస్తే చాలు" సుమతి అంటూ వుంటే "లేదులేమ్మా ఈరోజు అందరం కలిసి భోజనం చెయ్యాలి. నువ్వు రెడీ అవుతూవుండు. మేం అబిడ్స్ వెళ్లి పిన్నికీ బాబాయికీ చెప్పేసి వస్తాం"

"వాళ్ళు లేరన్నయ్యా. బెంగుళూరు పెద్దన్నయ్య దగ్గరకి వెళ్లారు" అని చెప్పింది సుమతి.

"ఓ, అలాగా. ఎప్పుడొస్తారు? "

"వాళ్ళ ఇష్టం. పోయినసారి మద్రాసు చిన్నన్నయ్య దగ్గరికి వెళ్లి పదిహేను రోజులుండొచ్చారు. ఇప్పుడు పెద్దన్నయ్య దగ్గరికి వెళ్ళారు. ఎన్నిరోజులకొస్తారో..."

"సరేలేమ్మా, నువ్వు బయల్దేరు, వెళ్దాం" అన్నాడు రామకృష్ణ.

"టిఫిన్ చేసిపోదాం అన్నయ్యా... పదినిముషాల్లో" అంటూ లక్ష్మివైపు చూసి, "రా వదినా, దోశలపిండి వుంది. పోసుకొని తిని పోదాం" అని లక్ష్మినీ పిల్లలని తీసుకొని వంటింట్లోకి పోయింది. రామకృష్ణ హాల్లో వున్నాడు.

కిచెన్‌లోకి పోతూనే "సాదాదోశెలు పోసుకొందామా, ఉల్లిపాయలు వేసుకోందామా" అని అడిగింది సుమతి లక్ష్మిని.

"ఎట్లా అయినా పర్వాలేదు" చెప్పింది లక్ష్మి.

"మీరు చెప్పండిరా" సుమతి పిల్లలవైపు చూసి అడిగింది.

పిల్లలిద్దరూ లక్ష్మికేసి చూశారు.

"ఆంటీకి చెప్పండి" అన్నది లక్ష్మివాళ్ళతో

"మీ ఇష్టం అన్నాడు నరేష్" సుమతి వైపు తిరిగి.

"ఆరి భడవా" అంటూ సుమతి నరేష్ బుగ్గలు నిమిరి "నువ్వు చెప్పరా మహేష్" అని మహేష్‌ని అడిగింది.

"అన్నయ్య చెప్పినట్టే" అన్నాడు మహేష్.

"ఔరా! అన్నయ్య అంటే ఎంత గౌరవం నీకు" అంటూ సుమతి వాడి బుగ్గలు ముద్దాడి "ఉల్లిపాయలేసుకొని పోసుకొందాం లే వదినా" అని ఉల్లిపాయలు తీసింది.

"నేను తరుగుతాలే వదినా. మీరు స్నానం చేసేటట్లయితే చేసి రండి" అంటూ లక్ష్మి ఉల్లిపాయలు తీసింది.

"అట్లాగే దోశలు కూడా పోసేసి అన్నయ్యకీ, పిల్లలకీ పెట్టెయ్ వదినా. నువ్వేం మొహమాటపడొద్దు" అంటూ పెనం, పిండి గిన్నె, చట్నీ గిన్నె తెచ్చి దగ్గర పెట్టింది సుమతి.

లక్ష్మి కాస్త బిడియపడింది. తనెప్పుడూ గ్యాస్ స్టవ్‌మీద వంట చెయ్యలేదు. కట్టెల పొయ్యి, కిరోసినాయిల్ స్టవ్ అలవాటు.

"స్టవ్ వెలిగించి పో వదినా. నాకు గ్యాస్ స్టవ్ అలవాటులేదు" అంది.

"అదేముందొదినా" అంటూ సుమతి లైటర్ తీసుకుని స్టవ్ వెలిగించి లక్ష్మి చేతికి లైటర్ ఇచ్చి స్టవ్ వెలిగించడం నేర్పింది.

"రెండురోజులు పోతే అదే బాగా అలవాటవుతుందిలే" అనేసి బాత్రూమ్‌కి వెళ్ళిపోయింది.

లక్ష్మి ఉల్లిపాయలు తరిగింది. స్టవ్ వెలిగించి దోశలు పోసి పిల్లలకీ, రామకృష్ణకీ పెట్టింది. వాళ్ళు తిని హాల్లో కూర్చున్నారు.

సుమతి స్నానం చేసి రెడీ అయ్యివచ్చింది. అప్పటిదాకా లక్ష్మి స్టవ్ దగ్గర నిలబడి దోశలు పోస్తూనేవుంది.

"సారీ వదినా. నీకు పని పెట్టాను. లే, నేను పోస్తాను" అంటూ లక్ష్మి చేతులోంచి అట్లకాడ తీసుకోబోయింది.

"ఇదేం పనిలే వదినా. అయిపోయింది. ఇంక పోయడంలేదు" అంటూ స్టవ్ ఆర్పేసింది.

"అన్నయ్యకీ, పిల్లలకీ పెట్టావా? " అనడిగింది సుమతి.

"ఆ... పెట్టాను వదినా"

"అయితే మనం కూడా తినేద్దాం రా" అంటూ సుమతి దోశలు రెండు ప్లేట్లలో సర్ది డైనింగ్ టేబుల్ మీద పెట్టింది.

ఇద్దరూ ఎదురెదురుగా కూర్చున్నారు.

"రాగానే నిన్ను శ్రమపెట్టాను" అంది సుమతి దోశ తుంచి చట్నీలో అద్దుకుంటూ.

"అదేముందిలే వదినా"

"నాకోసం మిమ్మల్ని ఇక్కడ ఎక్కువసేపు కూర్చోబెట్టడం ఇష్టంలేకనే. పైగా మనం అక్కడ పాలు పొంగించాలి. అందుకని" కారణం చెప్తున్నట్టుగా సుమతి అంటూవుంటే, "అయితే ఇప్పుడేమయ్యిందిలే" అంది లక్ష్మి.

"ఏం కాలేదులే... వస్తూనే పని చేయించాను" సుమతి బాధపడడం సహించలేకపోయింది లక్ష్మి.

"అన్నయ్యగారికి ఫోన్ చెయ్యి వదినా" అంది.

"ఆయన ఆఫీసుకు పోయి గంట కాలేదు. మనం పోతూపోతూ చేసి పోదాంలే" అని చెప్పి టిఫిన్ తిన్న తర్వాత, "కాఫీ తాగి పోదాం" అంటూ స్టవ్ వెలిగించింది.

అయిదు నిమిషాల్లో కాఫీ తాగారు. ఖాళీ గ్లాసులు సింక్‌లో పడేసి, "పోదామా అన్నయ్యా" అంటూ బయల్దేరుతూ సురేష్‌కి ఫోన్ చేసి విషయం చెప్పి భోజనానికి అక్కడికి రమ్మంది.

★ ★ ★

"ఇల్లు చిన్నది అవుతుంది వదినా" అంది సుమతి ఇంట్లోకి వస్తూనే.

"సర్దుకోవచ్చులే వదినా. సామానేం పెద్దగాలేదు. ఇంటి ఓనరు కూడా మంచిదిలా వుంది" అంది లక్ష్మి.

రామకృష్ణ శ్రీకాంతమ్మ ఇంట్లోకి పోయి రెండు కుర్చీలు తీసుకుని వస్తూ ఆమెని కూడా రమ్మని పిలిచాడు.

ఆమె రాగానే "బామ్మగారూ మీరు కూడా ఈ పూట మాతోనే భోం చేయాలి" అని చెప్పింది లక్ష్మి.

"భోజనాలు దేనికమ్మా. పాలు పొంగించి తలా కాస్త చక్కెర కలిపి ఇవ్వు చాలు" శ్రీకాంతమ్మ అంటూవుంటే, "మా సుమతీ, మా సురేష్ ఇక్కడే భోం చేస్తున్నారు. మీరు కూడా మాతో భోం చెయ్యాలి" అని చెప్పాడు రామకృష్ణ.

"అలాగే నాయనా... శుభమా అని ఇంట్లో చేరి భోజనానికి పిలిస్తే కాదనడం భావ్యంకాదు" అంటూ లక్ష్మికేసి చూస్తూ, "స్టవ్ వెలిగించి పాలు పొంగించమ్మా" అని చెప్పింది శ్రీకాంతమ్మ.

లక్ష్మి లైటర్ తీసుకుని స్టవ్ వెలిగించబోయి "వదినా మీరు వెలిగించండి" అంటూ లైటర్ సుమతి చేతిలో పెట్టింది.

"ఎవరు వెలిగిస్తే ఏం వదినా" అంటూ సుమతి వెలిగించింది. లక్ష్మి గిన్నెలో పాలు పోసి స్టవ్‌మీద పెట్టి మూత వుంచింది. పది నిమిషాలలో బుసబుసమంటూ పాలు మూతను పడదోసుకుంటూ పొంగిపోయాయి.

"బాగా పొంగాయి. ఇంకేం ఫర్వాలేదు. దించి తలాకాసిని ఇవ్వమ్మా" చెప్పింది శ్రీకాంతమ్మ.

లక్ష్మి చక్కెర కలిపి గ్లాసుల్లో పోసి అంద




రికీ ఇచ్చింది.

"పిన్నీ, బాబాయివుంటే బావుండేది" అన్నాడు రామకృష్ణ పాలు తాగుతూ.

"ఇప్పుడేమయ్యిందిలే అన్నయ్యా" అంది సుమతి.

"అన్నంలోకి ఏం చేద్దాం వదినా? " లక్ష్మి అడిగింది సుమతిని.

"పప్పూ, పులుసు, ఒక కూరా, చేస్తే సరిపోదా? " అంది.

"పాయసం, గారెలు కూడా చేస్తే బావుంటుందేమో..."

"గారెలంటే మినపప్పు నానాలి. ఆలస్యం అవుతుంది. పాయసం చేసేద్దాం" చెప్పింది సుమతి.

"అలాగే వదినా"

"నేను వెళ్ళి పెరుగూ, అరిటాకులు తెస్తాను" అంటూ రామకృష్ణ లేచి బయటకు వెళ్ళాడు.

లక్ష్మి ఏదో గుర్తుకొచ్చినదానిలా చివ్వున లేచి రెండుప్లేట్లలో అరిసెలూ, జంతికలూ పెట్టుకుని "వీటిసంగతి మర్చిపోయాను" అంటూ తెచ్చింది.

"ఏమిటీ, అరిసెలూ, జంతికలూ తినాల్సినవే కానీ దోసెలూ, కాఫీ, పాలతో పొట్ట ఫుల్ అయ్యిందొదినా! ఆనక మీ అన్నయ్య వస్తే పెట్టు. ఆయనకి అరిసెలంటే చాలా ఇష్టం" అంటూ సుమతి ఒక అరిసె తీసుకుని మిగిలినవి నరేష్‌ని, మహేష్‌ని పిలిచి ఇవ్వబోయింది.

"వాళ్ళకు నేనిస్తాలే వదినా" అంటూ లక్ష్మి వారిస్తుంటే,

"ప్లీజ్ వదినా! నేను తినలేను" అని పిల్లల చేతిలో పెట్టింది.

"అయినా యిప్పుడెందుకమ్మా" శ్రీకాంతమ్మ కాస్త మొహమాటపడింది. "మీరు తిని రుచి చెప్పండి బామ్మగారూ. పూర్తిగా నేతితో చేసింది మా అమ్మ" అంది లక్ష్మి.

"వదినా నీకు అరిసెలు చేయడం వచ్చా? " అనడిగింది సుమతి.

"ఆ... వచ్చు వదినా"

"అయితే పండక్కి చేసిపెట్టాలి"

"ఓ... తప్పకుండా"

లక్ష్మి, సుమతి కబుర్లు చెప్పుకుంటూ వంటపనిలో పడిపోయారు. గంటలో వచ్చాడు రామకృష్ణ పెరుగు, అరిటాకులూ, కారప్పూస, మైసూర్‌పాక్ తీసుకుని.

సురేష్ సరిగ్గా ఒంటిగంటకు వచ్చాడు. వస్తూనే రామకృష్ణని విష్‌చేస్తూ పిల్లలిద్దర్నీ ముద్దాడాడు.

"నీకోసం అరిసెలు తెచ్చింది మీ చెల్లెలు" చెప్పింది సుమతి.

"నిజంగానా? " సురేష్ అంటూంటే, లక్ష్మి ప్లేట్లో జంతికలూ, అరిసెలూ పెట్టుకొని వచ్చింది. "భోజనం రెడీ అయ్యింది. కొబ్బరి కారం పెట్టి వంకాయకూర" చెప్పింది సుమతి.

"అవునా, ఆకలిగా వుంది పదండి భోంచేద్దాం" అంటూ రెడీ అయ్యాడు సురేష్.

"పిన్నీ, బాబాయి లేకపోతిరి" భోజనం చేస్తూ అన్నాడు రామకృష్ణ.

"వాళ్ళకి ఈ కూర తినే అదృష్టంలేదు" అన్నాడు సురేష్.

"రెండున్నరయింది. నేను వెళ్తాను రామకృష్ణా. సాయంకాలం కలుస్తాను" అంటూ సురేష్ బయల్దేరాడు.

"నేను కూడా వస్తున్నా" అంటూ సుమతి బయల్దేరపోతుంటే లక్ష్మి వారించింది.

"నువ్వు చూశావుగా వదినా, ఎక్కడి గిన్నెలక్కడే పడివున్నాయి" అని అంటూ "వస్తా వదినా, రేపు అన్నయ్య ఆఫీసుకు వెళ్ళగానే పిల్లల్ని తీసుకుని రా" అని చెప్పి సుమతి సురేష్‌తో వెళ్ళిపోయింది.

★ ★ ★

పిల్లలిద్దరూ నిద్రకుపక్రమించారు.

లక్ష్మి, రామకృష్ణ చెరొక కుర్చీలో కూర్చుని శేషగిరి మాష్టారుని గుర్తుచేసుకుని మాట్లాడుకుంటున్నారు. నారాయణయ్య అప్పుడే

ఆటో ఆపి వాళ్ళ ఇంట్లోకి వెళ్ళకుండా నేరుగా ఇటు వచ్చాడు.

"రండి" అంటూ రామకృష్ణ ఆయన్ని ఆహ్వానిస్తూ "ఇంటి ఓనర్, బామ్మగారి భర్త" అని లక్ష్మికి చెప్పాడు.

"కూర్చోండి" అంటూ లక్ష్మి లేచి తను కూర్చున్న కుర్చీని జరిపింది.

"పొద్దున్న వచ్చారా" అంటూ కూర్చుని పిల్లలు చాపలమీద నిద్రపోతుండడం చూసి "మంచాలు తెచ్చుకోలేదా" అని అడిగాడు.

"కొత్తవి తీసుకోవాలి" అని చెప్పాడు రామకృష్ణ.

"మీరు మధ్యాహ్నం వస్తారనుకున్నాం" అంది లక్ష్మి.

"వీలవలేదు. ఒక్కోరోజు భోజనం టైంలో బాడుగ దొరికితే రావడానికి కుదరదు. ఏదో క్యాంటీన్‌లో ఇంత తిని కాలం గడిపేస్తుంటాను" చెప్పాడు నారాయణయ్య.

"మీరు మహా బిజీ. ఎప్పుడు మాట్లాడదామన్నా దొరకరు" రామకృష్ణ అంటూవుంటే, "రెక్కాడితేగానీ డొక్కాడదు. మా పరిస్థితి మీ బామ్మ చెప్పేవుంటుంది"

నారాయణయ్య మాటల వెనుక వున్న భావం అర్థం చేసుకున్న రామకృష్ణకి బాధ కలిగింది.

"రాత్రి ప్రయాణంలో వాళ్ళకి నిద్రలేదు. మీరు లేచిరండి" అంటూ శ్రీకాంతమ్మ వచ్చింది.

"ఆ... వస్తున్నా" అంటూ, "మీరు మంచాలు తెచ్చుకునేవరకూ మా ఇంట్లోవి వాడుకోండి" అని చెప్పి లేచాడు నారాయణయ్య.

"నేన్రామాట పొద్దున్నే చెప్పాను. మీరొచ్చి వాటిని దించి దుమ్ము దులపండి. వాడుకుంటారు" అంటూ శ్రీకాంతమ్మ ఆయనతో కలిసి వెళ్ళిపోయింది.

లక్ష్మి తలుపేసి వస్తూ, "రేపు బాబాయిగారికి జాబురాయండి" అని చెప్పింది.

అలాగే అన్నాడు రామకృష్ణ.

★ ★ ★

రాత్రి తరిగిపోయింది.

ఊరుఊరంతా మేల్కొంది.

కానీ,

భానుడికి మాత్రం ఆ వూరివైపు కన్నెత్తి కూడా చూడబుద్ధికాలేదు.

అలా అని విధ్యుక్తధర్మాన్ని విస్మరించడం విజ్ఞుల లక్షణం కాదని అనుకున్నాడు. తన దర్శనంకోసం ఎదురుచూస్తున్న ప్రకృతిని నిర్లక్ష్యం చేయలేదు. ఒక్కొక్క మెట్టూ ఎక్కి తూర్పు కొండపైకి వచ్చాడు.

మొల ఎత్తు వరిపైరులో మాగాడి పొలం గట్లమీద నడుస్తున్నాడు రాఘవయ్య. కయ్యల్లో నీళ్ళు కిందికి పోకుండా కత్తవతో గట్టుకున్న రంధ్రాలను బిగిస్తున్నాడు.

"ఏంరోయ్ మావా, ఇంకా నీళ్ళు కడుతున్నావా ఏంటి?" అనే పలకరింపు వినబడి తలతిప్పి చూశాడు.

కాలువగట్టుమీద పోతురాజు, సింగరయ్య పోతున్నారు. వాళ్ళల్లో తనను పలకరించింది సింగరయ్య అని తెలుసుకొని, "ఆ... ఆ... యాడకి పోతున్నారు" అంటూ అడిగాడు.

"పైరు చూడ్డానికి పోతున్నాంలే" సింగరయ్య నడుస్తూనే చెప్పి, "కొడుకు హైదరాబాదులోనేనా వుంటుంది" అని అడిగినట్టుగా అన్నాడు.

రాఘవయ్య ఏం మాట్లాడలేదు. వినబడనట్టే వున్నాడు.

"వాడినెందుకురా కదిలించుకుంటావు అనవసరంగా" అన్నాడు పోతురాజు సింగరయ్యతో నాలుగడుగులు ముందుకు నడిచిన తర్వాత.

"ఉబుసుపోక అడిగాన్లే, కనబడితే"

"నీకు తెలుసా? వాడు హైదరాబాదులో బాగా సంపాదిస్తున్నాడంట" చెప్పాడు పోతురాజు.

"సంపాదించుకోవద్దంటరా, అష్టకష్టాలూ పడి పెళ్ళాం పిల్లలతో ఊరొదిలిపోయాడు





పాపం"

"అక్కడన్నా సుఖంగా వుంటే బావుండును"

"ఎవరన్నా బిడ్డని దూరం చేసుకుంటారట్రా? దరిద్రం కాకపోతే? " విచారం వ్యక్తంచేశాడు సింగరయ్య.

"దరిద్రంకాదు, అహంకారం"

ఆ మాటలు రాఘవయ్య వినలేదు గాబట్టి సరిపోయింది. వినివుంటే వాళ్ళతో గొడవకు దిగేవాడు.

పోతురాజు, సింగరయ్య ఇద్దరూ రాఘవయ్య వయసువాళ్ళే. కాడెద్దుల సేద్యం వున్న మామూలు రైతులు. వాళ్ళకి రాఘవయ్యలా మనవలూ మనవరాళ్ళు వున్నారు. పోతురాజుకి ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. పెద్దకొడుకు రమేష్‌కి కందుకూరులో ఫ్యాన్సీ వ్యాపారం. రెండోవాడు సూర్యం సేద్యం చేసుకుంటున్నాడు. కూతురు అత్తగారింట్లో వుంది. సింగరయ్యకి ఒక కూతురు, కొడుకు. కూతురు అత్తవారింటికి అంకితమైపోయింది. ఎపుడోగానీ రాదు, కొడుకు పొలం చూసుకుంటున్నాడు.

అయినా వాళ్ళ ఇళ్ళల్లో కూడా గృహఛిద్రాలు లేకుండా పోలేదు. అత్తల అధికారపు హుంకారాలు, కోడళ్ళ కరుకుమాటలు, ఆడబిడ్డల అహంకారపు ఈసడింపులూ, వదినల మూతివిరుపులూ, ఎత్తిపొడుపులు, అరుపులూ, అలకలూ, ఏడుపులూ, ముక్కుచీదుళ్ళు. ఆడవాళ్ళమూలంగా తండ్రీకొడుకుల వాగ్వాదాలతో ఇళ్ళు రణరంగాలుగా మారుతుంటాయి.

కానీ, వాళ్ళు కక్షలు పెంచుకుని బంధాలు తెంచుకోలేదు. అనురాగాలను, ఆప్యాయతలను వదులుకోలేదు. కుటుంబంలో ఉత్పన్నమయ్యే సమస్యలను ధైర్యంగా ఎదుర్కొంటూ, కష్టాలకూ, దుఃఖాలకు తలొగ్గుతూ జీవిత మాధుర్యాన్ని పంచుకుంటున్నారు.

మన కుటుంబవ్యవస్థ తీరే అంత. ఆటుపోట్లను ఎదుర్కొంటూనే అందరినీ కలుపుకుపోతుంది. అమ్మానాన్నా, కొడుకూ కోడలూ, కూతురూ అల్లుడూ, మనుమలూ, మనమరాళ్ళమధ్య అల్లుకుపోయే నిర్మాణ బంధం అది. అందులో హక్కులూ, బాధ్యతలూ పెనవేసుకుని వుంటాయి. హక్కులు వదులుకున్నా బాధ్యతల బరువుమాత్రం మోయకతప్పదు. అనివార్య కారణాలవల్ల ఒకరికొకరు దూరమైనా, బాధ్యతలు దగ్గరకు చేర్చుతాయి. ఆ బాధ్యతలను విస్మరించడానికి ఎవరూ ఇష్టపడరు. విస్మరిస్తే పాపంగా, కుసంస్కారంగా ముద్రవేస్తుందీ సమాజం.

అయినా ప్రకృతి అప్రకృతిక కృత్యాలను చూస్తూనేవుంది. అడపాదడపా అనాగరిక పైశాచిక దృశ్యాలు దర్శనమిస్తూనే వున్నాయి.

రాఘవయ్యకి చెంప చురుక్కుమంది. తలెత్తి తూర్పుదిక్కుకేసి చూశాడు. కోపంతో మండిపోతున్నాడు సూర్యుడు.

పొద్దెక్కిందని అనుకున్నాడు రాఘవయ్య. అయినా ఆయనకి పొలం వదిలి రాబుద్ధికాలేదు. అడుగులో అడుగేసుకుంటూ కాలువ గట్టుమీదికి వచ్చాడు. కత్తవను కాలువ పక్కన దిగేసి వంగి దోసిలినిండా నీళ్ళు తీసుకుని మొహం కడుక్కున్నాడు. తర్వాత లేచి పొలంకేసి కలియచూస్తూ కత్తువ భుజాన వేసుకొని ఊరివైపు నడక సాగించాడు.

ఆయనకోసం భూదేవమ్మ ఏ అయిదారు సార్లో వీధి గుమ్మంలోకి వచ్చి ఎదురుచూసింది. ఎంతకీ రాకపోవడంతో విసుక్కుని అసహనంగా ఇంట్లోకి వెళ్ళబోయి, సరిగ్గా అప్పుడే రాఘవయ్య రావడం చూసి "స్వాతి మూలన కూర్చుంది" అని చిన్నగా చెప్పింది.

"ఎప్పుడూ" అడిగాడు రాఘవయ్య.

"చీకటితోనే, నువ్వటుపోగానే" చెప్పింది భూదేవమ్మ.

రాఘవయ్య ఇంట్లోకి వెళ్ళాడు. ఒకమూ

లన పాత దుప్పటిమీద కూర్చునివుంది స్వాతి. రాఘవయ్యని చూడగానే కాస్త సిగ్గు పడింది.

"ఏమ్మా!" అన్నాడు.

సిగ్గుపడుతూనే స్వాతి చిన్నపాటి నవ్వు నవ్వి తల వంచుకుంది.

"నువ్వు ఊరికిపోయి అమ్మాయిని తీసుకునిరా" చెప్పింది భూదేవమ్మ రాఘవయ్యతో.

"సరే అన్నంపెట్టు తినేసిపోతా" అంటూ రాఘవయ్య ఇంట్లోంచి బయటకు వచ్చాడు. గడకర్రతో వేపచెట్టునుంచి పుల్ల కొట్టుకుని బరబరా పళ్ళు తోముకుని వచ్చాడు.

భూదేవమ్మ అన్నంపెడుతూ, "మూడో రోజు ఊర్లో పేరంటం చెప్పాలి. అమ్మలక్కలు కొబ్బరిగిన్నెలు తెస్తారు. మనం వాళ్ళకి చిమ్మిరి పెడతాం. సెనగపిండి పెట్టొచ్చు నువ్వుల పిండి పెట్టొచ్చు మనం రెండూ పెడదాం. గొప్పగా వుంటుంది. పదకొండో రోజు స్నానం. అట్లబంతి పెట్టాల" అంటూ చెయ్యవలసిన పనులు, పెట్టాల్సిన ఖర్చులూ చెప్తూవుంటే అన్నింటికీ తలూపుతూ అన్నం తిన్నాడు రాఘవయ్య. తర్వాత చెయ్యి కడుక్కుంటూనే ఊరికి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

★ ★ ★

రామకృష్ణకి సంతోషంగా వుంది.

అతనికి హైదరాబాద్‌లో స్థిరపడడానికి పరిస్థితులు అనుకూలిస్తున్నట్టు కనబడుతున్నాయి. వాళ్ళ అకౌంట్స్ సెక్షన్‌లో సీనియర్ అకౌంట్స్ ఆఫీసరుగా పనిచేస్తున్న రమాకాంత్ నెలవారీ లాటరీ స్కీంలో ప్లాట్ల వ్యాపారం చేస్తూ, రామకృష్ణని బలవంతం చేసి ఒక మెంబరుగా చేర్చుకున్నాడు. అదృష్టం తన్నుకొచ్చి రెండోనెల డ్రాలో రామకృష్ణకి ప్లాట్ తగిలింది. దాన్ని అప్పుడే అమ్మేసి క్యాష్ చేసుకున్నాడు. మరుసటి నెలలో జీతం ఐదొందలు పెరిగింది.





వాయిదా పద్ధతిలో స్కూటర్ తీసుకున్నాడు.

అప్పుడు ఇల్లు ఇరుకనిపించింది. "ఇప్పుడు మనం ఇల్లు మారొద్దండీ. చిన్నదే అయినా మనకు బాగానేవుంది. ఇక్కడ మనం అంటే గౌరవం వుంది. అందరూ కలివిడిగా వున్నారు" అని చెప్పింది లక్ష్మి.

"బండి మా పంచలో పెట్టుకో రామకృష్ణా" అని చెప్పింది శ్రీకాంతమ్మ.

రామకృష్ణకి కూడా ఇల్లు మారాలనిలేదు. ఉద్యోగంతోపాటు ఏదన్నా సైడ్ బిజినెస్ చెయ్యాలని వుంది. ఆ విషయం సురేష్‌కి చెప్పాడు.

"మంచి ఆలోచనే" అని మెచ్చుకున్నాడు సురేష్.

ఇద్దరూ కలిసి కొన్ని బిజినెస్‌లను చర్చించుకున్నారు. రిస్క్ లేకుండా చేస్తున్న ఉద్యోగానికి ఆటకం రాకుండా వుండేది ఏదా అని ఆలోచించసాగారు.

ఆరోజు రాత్రి ఎనిమిదిన్నరప్పుడు రామకృష్ణ సెంటర్‌కి వచ్చాడు. అక్కడికి వచ్చిన తర్వాత మోహన్‌రావుగారికి ఫోన్ చెయ్యాలనిపించింది. యస్.టి.డి. బూత్‌లోకి నడిచాడు. ఆ బూత్ అతను రామకృష్ణకు పరిచయమే. అప్పుడప్పుడూ అక్కడినుంచే ఫోన్ చేస్తుంటాడు.

రామకృష్ణ లోపలికి వెళ్ళేసరికి దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు కనిపించాడు.

"చేస్కోండి సార్" అంటూ ఫోన్ రామకృష్ణ ముందుకి నెట్టాడు. రామకృష్ణ ఫోన్ చేసిన తర్వాత బిల్ పే చేస్తూ, "ఏం సార్ డల్‌గా వున్నారు" అని అడిగాడు.

"ఏముందిసార్ బిజినెస్ డౌన్ అయ్యి పిచ్చిపడుతోంది"

రామకృష్ణలో ఏదో ఆలోచన కలిగింది. "మంచి సెంటర్‌కదా. బిజినెస్ డౌన్ కావడం ఏమిటి? " అనడిగాడు.

"సెంటర్‌కేం మంచిసెంటర్. బూత్‌లు ఎక్కువయ్యాయి. డిస్పోజ్ చేయడమో లేక లీజ్‌కివ్వడమో చెయ్యాలని చూస్తున్నాను.

ఎవరూ ముందుకు రావడంలేదు" అన్నాడు.

అది విని ఆలోచిస్తూ కూర్చున్నాడు రామకృష్ణ. ఐదు నిమిషాల తర్వాత "అలాగా" అంటూ తలతిప్పి గది అంతా కలియచూసి రూంరెంటు, అడ్వాన్సు, కంప్యూటరూ, ఫోన్లూ వగైరాలకైన పెట్టుబడి అడిగి తెలుసుకున్నాడు.

"ఎవరైనా వుంటే చెప్పండి సార్, ఇచ్చేస్తాను" అన్నాడు షాపతను.

"అలాగే" అనేసి రామకృష్ణ లేచి బయట కొచ్చాడు. ఆ విషయం అప్పుడే సనత్‌నగర్ వెళ్ళి సురేష్‌కు చెప్పాడు.

"ఆ సెంటర్‌లో రూం దొరకడం అదృష్టమే. వెంటనే సెటిల్ చేసుకోవడం బెటర్" అన్నాడు సురేష్.

"అయితే ఒకమాట" అన్నాడు రామకృష్ణ.

"ఏమిటి"

"ఏది చేసినా ఇద్దరం కలిసే చేసుకుందాం"

"నేనెందుకులే రామకృష్ణా, నువ్వొక్కడివే చేసుకో. ఏటూ జడ్ నేను నీకు సపోర్టు వుంటాను"

"నువ్వు సపోర్టు ఉండవని కాదు, ఇద్దరం కలిసి చేసుకోవాలని నా ఉద్దేశ్యం"

సురేష్ ఆలోచనలో పడ్డాడు.

"ఎందుకు ఆలోచిస్తున్నారు?" అంది సుమతి.

ఆమెకేసి చూశాడు సురేష్.

"అన్నయ్య మనసు నీకర్థమయినట్టులేదు" అంది.

"సరే" అన్నాడు సురేష్.

రామకృష్ణ కళ్ళలో వెలుగు మెరిసింది.

"యస్.టి.డి.తోపాటు ప్రయివేట్ బస్సుల బుకింగ్ కౌంటర్ ఒకటి పెడదాం" అన్నాడు రామకృష్ణ.

"అందుకు బస్సులవాళ్ళని మీట్ అవ్వాలిగా"

"ఆ పనులన్నీ నేను చూసుకుంటాను సరేనా?" భరోసా ఇచ్చాడు రామకృష్ణ.

"ఇంకా రెండు సెకండ్ హ్యాండ్ కంప్యూటర్లను కొనిపడేసి ఇన్‌స్ట్రక్టర్‌లని పెట్టామనుకో"

"సూపర్ ఐడియా... అయితే పబ్లిసిటీ వుండాలి"

"టి.వి. యాడ్ ఇద్దాం" చెప్పాడు సురేష్.

"ఓకే.. ఓకే..." రామకృష్ణలో హుషారు పెరిగింది.

మరుసటిరోజే రామకృష్ణా, సురేష్ యస్.టి.డి. బూత్‌కి పోయి అందులో వున్న ఫోన్లు, కంప్యూటర్లు, ఇంకా వున్న సామానంతా బేరం చేశారు. రూం అద్దె, అగ్రిమెంటు, తమ పేర్లమీద రాయించుకుని మూడోరోజు షాపు హ్యాండోవర్ చేసుకున్నారు. వారంరోజుల్లో ఆ యస్.టి.డి. బూత్ రూపం మారిపోయింది. నీట్‌గా పెయింట్ వేయించి, దానిముందు యస్.టి.డి., ఐ.యస్.టి.డి., బోర్డు, ట్రావెలర్స్ బోర్డు పెట్టించారు. షట్టర్ గోడపై కంప్యూటర్ సంస్థ అని రాయించారు.

కంప్యూటర్ల వింగ్ సైడు ఒక లేడీ ఇన్‌స్ట్రక్టర్‌ని, యస్.టి.డి., ట్రావెలర్స్ కౌంటర్లని చూసుకొనేందుకు ఇంకో లేడీని అపాయింట్ చేసుకొన్నారు. టి.వి.కి యాడ్ ఇచ్చారు. పాంప్లెట్స్ వేయించి ఎర్రగడ్డ, సనత్‌నగర్, కూకట్‌పల్లి ఏరియాలలో పంచారు. ఇన్విటేషన్స్ ప్రింట్ చేయించి తెలిసిన వాళ్ళందరినీ ఆహ్వానించారు.

ఓపెనింగ్ రోజు షామియానా కట్టించి కుర్చీలు వేయించారు. తొమ్మిది గంటలకల్లా వర్ధనమ్మ, మోహన్‌రావు వచ్చారు. పదినిమిషాలకి సుమతి పిల్లలను తీసుకొని వచ్చింది. తర్వాత పది నిమిషాల్లో నారాయణయ్య ఆటోలోంచి చంద్రశేఖర్, శ్రీకాంతమ్మ, లక్ష్మి, పిల్లలు దిగారు.

సందడి సందడిగా వుంది. వచ్చిన వాళ్ళందరినీ సాదరంగా రిసీవ్ చేసుకొంటూ పేపర్ ప్లేట్లలో బిస్కెట్లూ, డిస్పోజబుల్ గ్లాసుల్లో టీ సప్లయ్ చేశారు. ఆ

కంప్యూటర్ సంస్థలో ఏయే కోర్సులు చెప్పేదీ వివరంగా చెప్పారు.

ఆరోజే కొందరు విద్యార్థినీ, విద్యార్థులు అడ్వాన్స్ పే చేసి కంప్యూటర్ క్లాసులకి హాజరయ్యారు.

ఏదో వేడినీళ్ళకు చన్నీళ్లు- సంపాయించు కొనేందుకు చిన్నపాటి బిజినెస్ చెయ్యాలను కొన్న రామకృష్ణ ప్రయత్నం వూహించని రూపం దాల్చింది.

ఆ రాత్రికే రామకృష్ణ విషయం తెలు పుతూ శేషగిరి మాస్టారికి లెటర్ రాశాడు.



**ప**ద్మావతమ్మకి చాలా బాధగా ఉంది. స్వాతి పుష్పవతి అయిన మూడోరోజు సాయంకాలం పార్వతి ఊళ్లో ఇల్లిల్లూ తిరిగి పేరంటం పిలుస్తూ శేషగిరి మాస్టారి ఇంట్లో చెప్పలేదు.

ఇంటి చుట్టూ ఉన్నవాళ్లని బొట్టు పెట్టి పిలిచి తనను పిలవక పోవడంతో పద్మావ తమ్మకి తల కొట్టేసినట్లయింది. ఆ విషయం భర్తకు చెప్పింది.

"నీకేమయినా అయిందా ఏమిటే?" అన్నారు శేషగిరి మాస్టారు.

"నాకేం అవుతుంది? మీకు విషయం చెప్పానంతే. ఇంకా వాళ్లు పిలవక పోవడం వల్ల రెండు కొబ్బరి చిప్పలూ, ఒక రెవికల గుడ్డా మిగిలాయి" అన్నది పద్మావతమ్మ కాస్త కోపంగా.

"నీకింతకు ముందు ఎన్నో సార్లు చెప్పాను. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలనేవి మనిషికి అసలయిన శత్రు వులని. ఆ నిజం తెలుసుకోలేనివాళ్లు వాళ్ళు. అలాంటి వాళ్లు పేరంటం పిలవలేదని నువ్వు బాధపడడం ఒట్టి అవివేకం తప్ప ఇంకేం లేదు" అన్నాడు.

పద్మావతమ్మ ఇంకేం మాట్లాడలేదు. ఇరుగు పొరుగు ముత్తయిదువలు పోయి రాఘవయ్యగారి ఇంట్లో కొబ్బరి చిప్పలిచ్చి బొట్టు పెట్టించుకొని చిమ్మిరి తెచ్చుకొం టుంటే ఆమెకి బాధేసింది. తనని అంటరా నిదానిగా వెలివేసినట్లు విలవిల్లాడింది.

రెండు మూడు రోజులదాకా ఆమెని పట్టిన అసహనం వదిలిపోలేదు.

పదకొండోరోజు రాఘవయ్యగారింటికి పిలిచిన చుట్టాలంతా వచ్చారు. స్వాతిని స్నానం చేయించి- మధ్యాహ్నం చుట్టాలంద రికీ అట్లతో బంతిభోజనం పెట్టారు.

ఆ రాత్రి- స్వాతికి తలదువ్వి పూలజడ అల్లారు. పట్టుపావడాపైన పట్టు పైట వేశారు. మెడలో హారం, మూడుపేటల బంగారుగొలుసు వేశారు. ఒక చేతికి బంగా రుగాజులు తొడిగి రెండోచేతికి వాచీ పెట్టి- పందిట్లో కూర్చున్న ముత్తయిదువల మధ్య కుర్చీవేసి అందులో కూర్చోబెట్టారు.

పార్వతికి హుషారుగా వుంది. ఏదో గర్వం ఆమెలో కొట్టవచ్చినట్లు కనబడు తోంది.

పట్టుచీరె కట్టుకొని వచ్చిన ముత్తయిదువ లతో పందిరి కళకళలాడుతోంది. అయినా వాళ్ళందరికీ ఆ వేడుకలో ఇంటికోడలు లేక పోవడం వెలితిగా కనబడింది. ఆ విష యమై ఒకరిద్దరు చెవులు కొరుక్కున్నారు. ఉండబట్టలేక పోతురాజు భార్య నాగేశ్వ రమ్మ "కొడుకూ, కోడల్ని పిలవలేదా

ఏంది? " అని భూదేవమ్మని పిలిచి అడిగింది.

వెంటనే భూదేవమ్మ "మేం ఎవర్నీ పిలవ దలచుకోలా" అని రపీమని చెప్పి వెళ్ళిపోయింది.

ఆమె అలా చెప్పి వెళ్ళిపోయిన తీరుకి నాగేశ్వరమ్మ విస్తుపోయి ముక్కుమీద వేలేసుకొంది.

ఆ సమయంలో నాగేశ్వరమ్మ పక్కనే వున్న సింగరయ్య భార్య రాజేశ్వరి "అదేందీ యిందాక పార్వతి 'జాబు రాశాం, రాలా' అని చెప్పింది నాకు" అంది.

"అంతా ఉత్తదే. వాళ్ళనసలు పిలిచే వుండరు. పద్మావతమ్మ అయ్యావారమ్మని గూడా పిలవలేదంట" చెప్పింది నాగేశ్వరమ్మ.

"అందుకే గావాల పాపం ఆమె రాలేదు... వీళ్ళ బుద్ధే బయటపడింది" అక్కసు కక్కింది రాజేశ్వరి.

★ ★ ★

శేషగిరి మాష్టారు స్కూలునుంచి ఇంటికి రాగానే "రామకృష్ణ దగ్గరినుండి జాబొచ్చింది" అని చెప్పింది పద్మావతమ్మ.

"ఏమిటంట సంగతులు" అడిగాడు శేషగిరి మాష్టారు.

"బిజినెస్ చేస్తున్నాడంట. మీరే చదవండి" అంటూ పద్మావతమ్మ రేడియోమీద పెట్టిన ఇన్‌లాండ్‌లెటర్ తెచ్చి ఇచ్చింది.

కవరు విప్పాడు శేషగిరి మాష్టారు.

"మహారాజశ్రీ మాష్టారిగారి పాదములకు మీ శిష్యుడు రామకృష్ణ నమస్కరించి రాయునది. మేము క్షేమం. మీరూ క్షేమమేనని తలచుచున్నాను. నా సంతోషాన్ని మీతో పంచుకొంటేగానీ తృప్తి వుండదు మాష్టారూ. అందుకనే ప్రతి విషయాన్ని మీకు తెలియపరుస్తుంటాను. ఈ ఉత్తరం చదివిన తరువాత దయచేసి మీరు నన్ను అన్యథా భావించరనుకొంటాను. మీకు ఇంతకుముందే తెలియపరిచాను. లాటరీ పద్ధతిపై పెట్టిన ప్లాట్ల స్కీంలో నాకొక ప్లాటు వచ్చిందని దాన్ని అప్పుడు అమ్మేశానని. ఆ డబ్బుకి ఇంకాస్త చేర్చి నేనూ, సురేష్ కలిసి ఎర్రగడ్డ సెంటర్‌లో యస్.టి.డి. షాప్ ఒకటి ఎత్తేస్తుంటే దాన్ని తీసుకొన్నాము. అందులో యస్.టి.డి.తో పాటుగా ప్రైవేటు బస్సుల బుకింగ్ కౌంటరు ఒకటి ఓపెన్ చేశాం. అంతేకాక రెండు కంప్యూటర్లు కొనిపెట్టి కంప్యూటర్ సంస్థ పేరుతో శిక్షణ ఇప్పిస్తున్నాం. బిజినెస్ బాగానే సాగేట్టుగా వుంది.

మీకో శుభవార్త ఏమిటంటే నాకు జీతం ఐదొందలు పెంచారు. మిమ్మల్ని చూడాలనివుంది మాష్టారూ. మేడంకి నమస్కారాలు చెప్పండి. ఇంకా ఏమయినా విషయాలుంటే రాస్తాను. మీ ఆశీస్సులు ఆశిస్తూ ముగిస్తున్నాను.

ఇట్లు
మీ శిష్యుడు
రామకృష్ణ

ఉత్తరం చదవడం పూర్తికాగానే పడక కుర్చీలోకి వాలిపోయాడు శేషగిరి మాష్టారు.

"చూడాలంటున్నాడు. ఒకసారి హైదరాబాదు పోయిరండి. అలాగే వర్ధనమ్మ వదినా వాళ్ళని గూడా చూసిన వాళ్ళవుతారు" అంది పద్మావతమ్మ.

"పోతే నేనొక్కడినే కాదు ఇద్దరం కలిసి పోవాలి. అదీ ఇప్పుడు కాదు. ఇంకా టైం వుంది" చెప్పాడు శేషగిరి మాష్టారు.

"జాబులో ఇంటి సంగతి రాయలేదేం. వేరే ఇంట్లోకి మారాడో లేదో? "

"మారినట్టు లేదు. మారితే రాసేవాడుగా"

"పోయినసారి ఇల్లు ఇరుగ్గా వుంది, సైకిలూ, స్కూటరూ ఇంటి ఓనర్ వాళ్ళ పంచలో పెడుతున్నానని రాశాడుగా. అందుకని" అని అంటూ వుంటే "అతనికన్నీ తెలుసులేవే. అన్నీ చూసుకోగలడు" అంటూ శేషగిరి మాష్టారు లేచిపోయి దొడ్లో బావి

దగ్గర బక్కెట్ నీళ్లు చేదుకొని కాళ్ళూ చేతులూ కడుక్కొని అన్నానికి కూర్చు న్నాడు.

పద్మావతమ్మ ఆయన ముందు కంచం పెట్టి అన్నం వడ్డించింది. మంచినీళ్లు, పప్పూ, కూర, రసం, నెయ్యి, మజ్జిగలు ఎదు రుగా పెట్టి తనూ ఎదురుగా కూర్చుంది.

"రామకృష్ణ ఇంక ఈ ఊరు రాడేమో" అన్నది అన్నం తింటూ పద్మావతమ్మ.

"రాకపోవచ్చు...రాడుకూడా"

"మరి వాళ్ల అమ్మానాన్నకి ఏదన్నా అయితే..."

"ఛ..ఛ ఆ కోరిక మనకెందుకు? అందరూ సుఖంగా ఉండాలి" అంటూ శేష గిరి మాస్టారు చెయ్యి కడుక్కుని లేచాడు.

అరగంట సేపు పడుకుని నిద్ర పోయాడు. తర్వాత లేచి స్కూలుకి బయ లుదేరుతూ ఉంటే దారిలో పోతురాజు కలి శాడు.

"ఏం పోతురాజుగారూ! ఎక్కడికి పోతు న్నారు? " అని అడిగాడు.

"మాగాణికి పంతులూ. వరి కోతలు మొదలయ్యాయి కదా!" చెప్పాడు పోతు రాజు.

"ఈ సంవత్సరం పంట బాగానే పండిం దిట గదూ"

"అవును పంతులూ. బాగానే పండింది. ఏం లాభం? ధర పడిపోయిందికదా!"

"తొందరపడి అమ్ముకోకండి. నష్టపో తారు. కాస్త ఓర్పు చేసి స్టాకు పెడితే మంచి లాభాలు వస్తాయి. లేకుంటే ఆరు గాలం చేసిన కష్టమంతా మట్టిలో పోసినట్టే అవుతుంది" అని చెప్తూ ఉండగా స్కూలుకి వెళ్లేదారి రావడంతో "నేను వస్తానయ్యా" అనేసి స్కూలు వైపు వెళ్లిపోయాడు శేషగిరి మాస్టారు.

ఆయన చెప్పిన మాటలు పోతురాజు మీద బాగా పనిచేశాయి. తనకున్న మాగాడి ఎంత, ఎన్ని బస్తాలు వడ్లు పండుతాయి, అప్పుడున్న ధరకి అమ్మితే ఎంత వస్తుంది, స్టాకు పెడితే ఏ రేటుకి ధర పెరిగితే ఎంత వస్తుంది? పెట్టుబడికి అయ్యే వడ్డీని స్టాకు పెడితే అదనంగా వచ్చే దానితో పోల్చు కుంటూ మాగాడి గట్టు మీద నడుస్తు న్నాడు.

ఆ పక్కనే రాఘవయ్య కూలి మనుషుల చేత వరి కోయిస్తున్నాడు. ఆయన కోసం భూదేవమ్మ మధ్యాన్నం అన్నం తెచ్చిపెట్టి కాస్త చల్ల బడ్డాక వెళ్లొచ్చని గట్టుమీద పైట పరుచుకుని నడుం వాల్చింది.

కోత కోస్తున్న కూలీలు మంచినీళ్లు అడగ డంతో నేతెస్తానంటూ రాఘవయ్య బుంగ తీసుకుని రెండు కయ్యల అవతల ఉన్న దిగుడు బావి వైపుకి వెళ్లాడు.

పదినిమిషాలు దాటింది. పదిహేను- ఇరవై నిమిషాలయ్యింది. రాఘవయ్య తిరిగి రాలేదు.

"ఏంది మంచినీళ్లకని పోయినాయన ఇంకా రాలేదు" అన్నాడో కూలివాడు మిగ తావాళ్లతో

"పోయిగూడా చాలా సేపయింది గదా!..." అని ఇంకో కూలివాడు అనుమానం వ్యక్తం చేశాడు. "బావిదాకా పోయి చూసొస్తే బావుండు" అంటూ కొడవలి గట్టుమీద పడేసి బావి దగ్గరకు వెళ్లాడు.

అక్కడ మెట్లముందు, చెప్పులున్నాయి. బావిలోకి చూశాడు. నీళ్ళపైన బుంగ బోర్లా పడి తేలుతూవుంది. వాడికి విషయం అర్థమై కాళ్లు వణికాయి.

"రాఘవయ్య బావిలో పడ్డాడు..." అంటూ పెద్దగా కేకేశాడు. ఆ కేక విన్న భూదేవమ్మ "ఓరిదేవుడో" అని గుండెలు బాదుకొంటూ బావి దగ్గరికి పడుతూ లేస్తూ పొలానికి అడ్డంగా పరిగెత్తింది. చుట్టుప క్కల కోతలు కోస్తున్నవాళ్ళంతా క్షణంలో అక్కడికి వచ్చారు. వాళ్ళలో యీతొచ్చిన వాళ్ళు ముగ్గురు బావిలోకి దూకి రెండు మూడు సార్లు నీటి అడుక్కి పోయివచ్చి





రాఘవయ్య శవాన్ని బయటికి లాక్కొచ్చి వడ్డున పడుకోబెట్టారు. శోకండాలు తీస్తూ భూదేవమ్మ ఆయనమీద పడిపోయింది. మాగాణిలో దూరంగా వున్న వాళ్ళు కూడా పనిమానేసి అక్కడికి వచ్చేశారు. వాళ్ళల్లో ఒకరు వూళ్లోకి పోయి నులకమంచం ఒకటి తీసుకొచ్చారు. దానిమీద ఆయన్ని ఇంటికి చేర్చేసరికి సూర్యుడు పడమటి కొండల్లోకి దిగుతున్నాడు.

కొడుకు, కోడలు పిల్లలు కార్లో దిగారు.

"అమ్మా... అమ్మా..." అంటూ పోయి ఆమె చేతుల్ని గట్టిగా పట్టుకొన్నాడు రామ కృష్ణ. ఆ స్పర్శకి భూదేవమ్మ కళ్ళు తెరిచి చూసింది.

రాఘవయ్య పక్కనే కూర్చుని తన చేతుల్ని పట్టుకొని వున్నాడు.

"ఏమిటి, ఏమయ్యింది" అన్నాడు.

భూదేవమ్మ తలవిదిల్చి చుట్టూ చూసింది. వరిపైరు మధ్యలో వుంది తను. పక్కనే కూలిమనుషులు వరి కోస్తున్నారు.

"మీరు...మీరు..." అంటూ రాఘవయ్యా కేసి చూసింది.

"ఏదన్నా కలవచ్చిందా ఏంది?" అడి గాడు రాఘవయ్య.

"ఆఁ..."

★ ★ ★

రాత్రి-

పిల్లలిద్దరూ నిద్రపోతున్నారు. వాళ్ళ చదువుల గురించి చర్చించుకుంటున్నారు లక్ష్మి, రామకృష్ణ.

ఆ చర్చలో శేషగిరి మాష్టారి ప్రస్తావన వచ్చి అనూహ్యంగా సంభాషణ ఆయనమీద సాగింది.

"ఆ మహానుభావుడి దయవల్లేగా లక్ష్మి మనం బతకగలుగుతున్నాం" అన్నాడు రామకృష్ణ.

"అవునండీ. నేనసలు కలలో కూడా వూహించలేదు ఇలా ఉంటామని. పిల్లల అదృష్టం బావుంది. దేవుడికి దయ కలి గింది. లేకుంటే ఇంకా ఎన్ని ఇబ్బందులు పడాల్సివచ్చేది"

"నిన్ను, పిల్లల్ని పస్తుపెట్టాను..." అని రామకృష్ణ అంటూ వుంటే లక్ష్మి అడ్డువచ్చి "దయచేసి మీరామాట అనవద్దండీ" అంది.

"ఆ గతం మర్చిపోలేకపోతున్నాను. ఒక రోజు ఇంట్లో బియ్యం లేకపోతే పురుగు పట్టిన రవ్వ శుభ్రంచేసి ఉప్మా చేశావు. సరిగ్గా అప్పుడే మాష్టారు వచ్చారు. పరిస్థి తిని పసిగట్టి మనల్ని అన్నానికి పిల్చుకొని పోయాడు..." అంటున్న రామకృష్ణ కళ్ల ల్లోంచి నీళ్లు టపటపా రాలాయి.

"ఛఁ ఛఁ ఏమిటండీ..." లక్ష్మి చలించి పోయింది.

"బాధ లక్ష్మి... పడ్డ కష్టాలు తక్కువై నవేం కావు. అన్నీ వున్నాయి. ఏం లాభం అవస్థలు తప్పలా. అమ్మా, నాన్నా ఎదు రుగా వున్నారు. పిల్చి పట్టెడన్నం పెట్టడా నికి వాళ్ళకి మనసు రాలేదు"

"పోన్లెండి. మన మొహాన అలా రాసి వుంది. ఏం చేస్తాం..." లక్ష్మి అంటూ వుంటే "మనం కూడా పొరపాటు చేశాం లక్ష్మి. వాళ్ళు ఇంట్లోంచి పొమ్మనంగానే మనం బయటకు రాకుండా వుండాల్సింది. ఒకసారి పోతురాజు కూడా అదేమాట అన్నాడు. ఎదురుతిరిగి తగాదాపడి పొలం పంచుకోవాల్సిందని" అన్నాడు రామకృష్ణ.

"మనం అలా చెయ్యలేంలెండి. లేదా చేసి వుంటే ఊళ్ళో మనం చెడ్డవాళ్ళం అయ్యే వాళ్ళం. పైగా బాబాయిగారు కూడా అందుకు ఇష్టపడరు..." లక్ష్మి అంటూ వుంటే "అవును లక్ష్మి. ఆరోజు మాష్టారు గారు లేకుంటే మన పరిస్థితి ఏమిటి? ఎక్కడికని పోయేవాళ్ళం" అన్నాడు రామ కృష్ణ.

"ఏమిటండీ అలా అడుగుతున్నారు. మీరెన్నిసార్లు చెప్పలేదు నాకు. దిక్కులేనివా ళ్ళకి దేవుడే దిక్కని. ఆ దేవుడే బాబాయి గారి రూపంలో మనల్ని ఆదుకొన్నాడు"

అంది లక్ష్మి.

"ఆయన రుణం ఎన్ని జన్మలెత్తినా మనం తీర్చుకోలేం"

"మోహన్‌రావు మామయ్యా, సురేష్ అన్నయ్యా వాళ్ళ రుణం కూడా తీర్చుకోలే మండీ"

"మనుషుల్లో దేవుళ్ళంటే వీళ్ళే లక్ష్మీ. నువ్వు కనబడని దేవుళ్ళందరికీ మొక్కేదా నివి. అందుకని ఆ దేవుళ్ళందరూ కూడబలు క్కొని అంచెలంచెలుగా ఆదుకొన్నారు. మాష్టారు ధైర్యం చెప్పి దారిచూపితే మోహ న్‌రావు బాబాయి వూతం ఇచ్చాడు. స్నేహంతో సురేష్ చెయ్యి అందించాడు" రామకృష్ణ అంటూ వుంటే, "మనం దురదృ ష్టవంతులమని అనుకొనేదాన్నండీ నేను. నిజంగా మనం అదృష్టవంతులం. ఈ మహానగరంలో మనకు స్థానం దొరికింది. పిలిస్తే పలికే ఆప్తులున్నారు" అంది లక్ష్మి.

"అవును లక్ష్మీ. అయినవాళ్ళు లేకపో యినా ఆదరించి ఆదుకొనేవాళ్ళున్నారు" అన్నాడు రామకృష్ణ. అందుకు వెంటనే స్పందించింది లక్ష్మి.

"అయినవాళ్ళు మటుకు లేకుండా ఎక్క డికి పోయారులెండి. నిదానంగా మీ అమ్మా, నాన్నా వాళ్లు దగ్గరవుతారు" అంది.

ఆ మాటలు రామకృష్ణకు నచ్చలా. కాస్త కోపం, అసహనం అయింది. "ఛ ఛ... వాళ్ళను గుర్తు చెయ్యకు. వాళ్ళను తలచు కొంటేనే పాపం వస్తుంది. పోయిన జన్మలో నేనేదో పాపం చేసి వాళ్ళ కడుపున పుట్టాను. అనుభవించాను. దేశంలో తల్లి దండ్రులంతా వీళ్ళలాగానే ప్రవర్తిస్తున్నారా. మోహన్‌రావు బాబాయి వాళ్ళని చూశా వుగా. మన ఊళ్ళో పోతురాజు వాళ్ళని చూశావుగా. వాళ్ళకీ కొడుకులూ, కోడళ్ళూ, కూతుళ్ళూ, అల్లుళ్లూ వున్నారుగా. కాపురాలు చూడు ఎంత ముచ్చటగా నడుపుకొస్తు న్నారో. వీళ్ళకి వళ్లంతా ఈర్ష్యా, ద్వేషాలతో నిండిపోయాయి. నా ఇల్లూ, నా పొలం, నా డబ్బూ, నా బంగారం అనే అహంకారం తప్ప కొడుకున్నాడు, వాడి పెళ్ళాం, పిల్లలు కూడా బతకాలన్న ఆలోచనే లేకపోయె. అదేమంటే తగాదా. ఛ ఛ. వాళ్ళ ఆస్తి వాళ్ళ ఇష్టం. ఏమైనా చేసుకోనీ. మనకు అనవసరం. ఇంకెప్పుడూ వాళ్ళ ప్రస్తావన తేవద్దు"

"అదేమిటండీ అలా అంటారు. ఆ ఆస్తిని వదులుకోవచ్చు కానీ అమ్మా, నాన్నని..." లక్ష్మి మాటల్ని పూర్తి కానివ్వలేదు రామ కృష్ణ.

"ప్లీజ్ లక్ష్మీ. పదేపదే వాళ్ళని గుర్తుచె య్యవద్దు. వాళ్ళంటే నా కసహ్యం. పొలం వుంది. ఇంటినిండా ధాన్యం వుంది. మన కడుపుమీద తన్నారు. గణేశ్‌ని పోగొట్టు కున్నాం. మాష్టారి మాట కాదనలేక చెప్పి రావడానికి పోతే చెప్పుతో కొట్టినట్టు మన మొహంమీద ఠపీమని వీధి తలుపు వేసిపో యింది... ఏ తల్లి అయినా అలా చేస్తుందా? ఆ నిజాలు ఎవరికన్నా చెప్తే నమ్ముతారా, నన్నొక శాడిష్టుగా అనుకొం టారు. ఇన్ని అవమానాలు పడ్డాను. ఇంకా నాకు సిగ్గు లేదా వాళ్ళను గుర్తుంచుకోవడా నికి..."

"సరేలెండి ఎన్ని అన్నా అమ్మా, నాన్నా కదా"

"వద్దు లక్ష్మీ వద్దు. వాళ్ళ ప్రస్తావన ఎప్పుడూ తేవద్దు. వాళ్ళకీ మనకీ అసలు సంబంధాలు లేనేలేవు. బిడ్డ చచ్చి మనం ఏడుస్తూవుంటే కనీసం వచ్చి చూడ్డానికి వాళ్లకి మనసు రాలేదు.

వాళ్ళసలు మనుషులేనా, మనుషులైతే అంత కఠినంగా వుంటారా. వూరువూరంతా వచ్చి మనచుట్టూ మూగి అయ్యోపాపం అన్నారే. ఆమాత్రం మనసు లేదా వాళ్ళకి. రేపు వాళ్లు చ..."

"ఏమండీ" చెయ్యి అడ్డుపెట్టి రామకృష్ణ నోరు మూసేసింది లక్ష్మి.

రామకృష్ణ కళ్ళల్లో నీళ్ళూరి బుగ్గలమీదకి

జారాయి. తన పెదాలపై వున్న లక్ష్మి చేతిని పట్టుకొని "ఇంకెప్పుడూ వాళ్లను గుర్తుచెయ్యొద్దు. వాళ్ళంటే నాకసహ్యం"

లక్ష్మి ఇంకేం మాట్లాడలేదు. రామకృష్ణ మొహంలోకి చూస్తూ వుండిపోయింది.

అతను స్థిమిత పడుతూ వున్నాడు.

"పదకొండయ్యిందండీ" అంది.

"...."

"పడుకొందాం"

"ఊ..."

లక్ష్మి లేచి ట్యూబ్‌లైట్ ఆర్పేసి బెడ్‌లైటు వేసి వచ్చింది.

★ ★ ★

ఇంటిముందు ఆటో ఆగింది.

ఆ శబ్దం విని లక్ష్మి బయటకు తొంగి చూసి క్షణం ఆశ్చర్యపోయింది.

ఆటోలోంచి రాఘవయ్య, భూదేవమ్మ దిగుతున్నారు. లక్ష్మి ఆనందం పట్టలేక ఆదరాబాదరాగా ఆటో దగ్గరికివెళ్ళి "అత్తయ్యా" అంటూ భూదేవమ్మముందు నిలబడింది.

పట్టుచీరె కట్టుకొని వుంది. మెడలో రాళ్ళ హారం, నల్లపూసల గొలుసు, తాళిబొట్టు, ముక్కున వంటిరాయి కమ్మ, చెవులకు వెడల్పాటి కమ్మలు, చేతులకు బంగారపు వంకీ గాజుల మధ్య మట్టిగాజులు. బాగా వున్నోళ్ళు అనుకుంది శ్రీకాంతమ్మ.

ఆటోలోంచి రాఘవయ్య లగేజీతో బియ్యం బస్తా దించుతూవుంటే "ఏమిటి మామయ్య అంతదూరం నుంచి బియ్యం తెచ్చారు" అని అడిగింది లక్ష్మి.

"నెల్లూరు మొలకొలుకులమ్మా, మన మాగాట్లో పండినవే. మీ అత్తయ్య ఇంకో బస్తాతెమ్మంది. పురుగు పడుతుందని తేలా" చెప్పాడు రాఘవయ్య.

"అబ్బాయి ఎప్పుడొస్తాడమ్మా" ఇంట్లో కొచ్చిన తర్వాత అడిగింది భూదేవమ్మ.

"సాయంత్రం అయిదింటికొస్తాడత్తయ్యా"

"పిల్లలు బడికి వెళ్ళారా" రాఘవయ్య అడిగాడు.

"అవును మావయ్యా... మీరు లేచి మొహంకడుక్కోండి. కాఫీ తాగుదురుగాని. తర్వాత స్నానంచేసి టిఫిన్ తినొచ్చు" అని లక్ష్మి అంటుంటే "అలాగేలేమ్మా, ముందు ఇవి తీసి సర్దు" అంటూ భూదేవమ్మ తనతో తెచ్చిన సంచుల్లోంచి స్టీలు బాక్సులు ఒక్కొక్కటీ తీస్తూ "ఇది ఉసిరికాయ పచ్చడి, ఇది మామిడికాయ ఆవకాయ, ఇందులో నేతి అరిసెలున్నాయి" అంటూ బాక్సులన్నీ కింద పెట్టేసింది.

"ముందు మీరు మొహం కడుక్కోండత్తయ్యా" అంటూ లక్ష్మి బాక్సులన్నీ వంటింట్లోకి సర్దేసింది.

రాఘవయ్య, భూదేవమ్మ లేచి మొహం కడుక్కొని వచ్చారు. లక్ష్మి వేడివేడిగా కాఫీ ఇచ్చింది. వాళ్ళు కాఫీ సిప్‌చేస్తూ రామకృష్ణ వుద్యోగం గురించి, పిల్లల చదువుల గురించి అడుగుతూవుంటే సమాధానం చెప్తూ లక్ష్మి శేషగిరి మాష్టారిని, పద్మావతమ్మని గురించి అడిగి తెలుసుకుంది. తర్వాత వంటింట్లోకిపోయి ఒక పొయ్యి మీద నీళ్ళు పెట్టి, టిఫిన్‌కి పూరీలు చెయ్యాలని రెండోపొయ్యిమీద కూర కోసం ఆలుగడ్డలు తరిగి పెట్టింది.

అప్పుడే రామకృష్ణ వచ్చాడు.

"ఎవరు వాళ్ళు" అడిగాడు కోపంగా.

"మీ అమ్మా నాన్నలు"

"ఎందుకు రానిచ్చావు లోపలికి"

లక్ష్మికి వళ్ళంతా నీరసం వచ్చేసింది.

"నీకింతకుముందు ఎన్నోసార్లు చెప్పాను. నాకు వాళ్ళంటే అసహ్యమని, నాకసలు అమ్మానాన్నా లేరని"

"అదేమిటండీ మీరు... వాళ్ళకై వాళ్ళు మన ఇంటికొచ్చారు" లక్ష్మి అనునయిస్తూ వుంటే రామకృష్ణలో కోపం హెచ్చింది.

"వద్దు. వాళ్ళు మనింటికి రానవసరం లేదు. పంపించు. వెంటనే పంపించు"

"ఏమండీ ప్లీజ్. నా మాట వినరూ"

"వినను. విననుగాక వినను. వాళ్లు నా ఇంటికి రానవసరంలేదు. వెళ్లు, వాళ్ళను పంపించు. ఇంట్లో క్షణం గూడా వుండడానికి వీల్లేదు" రామకృష్ణ అరుస్తూవుంటే లక్ష్మికి ఏడుపొచ్చేసింది.

"ఏవండీ, వద్దండీ. నా మాట వినండీ... ఏవండీ... ఏవండీ" కళ్ళు నీళ్ళతో నిండాయి. ఏమీ కనబడడంలేదు. చీకటిగా వుంది, ఏదో భయం.

"ఏమండీ" అనబోయి గదిలోకి వెలుతురు రావడంతో "కరెంటు పోయిందాండీ" అని అడిగింది పక్కనే నిద్రపోతున్న రామకృష్ణని.

"అవును" అన్నాడు రామకృష్ణ నిద్రమత్తులోనే.

★ ★ ★

నిద్ర లేస్తూనే లక్ష్మి రాత్రి తనకొచ్చిన కలను గురించి చెప్పింది రామకృష్ణకి.

"సరేలే. నువ్వు కలలు కంటూనే వుండు" అన్నాడు రామకృష్ణ కాస్త వెటకారంగా.

లక్ష్మి మనస్సు చివుక్కుమంది.

"అంతేలే నేనేది చెప్పినా మీకు ఎగతాళే" అంది.

"ఏది చెప్పినా ఎందుకవుతుంది. వాళ్ళ మాటంటేనే నాకు పడదు. చచ్చినా వాళ్ళ మొహం చూడకూడదు" అంటూ బయట బండాగిన శబ్దం వినబడి అటు చూశాడు.

సురేష్ బండి ఆపి దిగుతున్నాడు.

"ఏమిటి పొద్దున్నే" అంటూ లక్ష్మికేసి చూశాడు రామకృష్ణ.

ఏదో అనుమానం వచ్చిన వాళ్ళలా ఇద్దరూ ఒకేసారి లేచి బయటకు వచ్చారు.

"ఏమిటన్నయ్యా" అంది లక్ష్మి.

"కూకట్‌పల్లిలో స్థలం వుంది. అమ్ముతారట చూద్దామా" అన్నాడు సురేష్ రామకృష్ణతో.

హమ్మయ్య అనుకొన్నారు.

"పొద్దున్నే వస్తేనూ ఏదో జరిగిందని కంగారుపడ్డాం. రా... కాఫీ తాగిపోదాం" అంటూ రామకృష్ణ ఇంట్లోకి దారితీశాడు.

లక్ష్మి లోపలికి వెళ్లి స్టవ్ వెలిగించి పాలు పెట్టింది. ఐదు నిముషాల్లో కాఫీ కలిపి రెండు గ్లాసుల్లో తెచ్చి సురేష్‌కి, రామకృష్ణకి ఇచ్చింది. సురేష్ కాఫీ సిప్ చేస్తూ స్థలం పొడవు, వెడల్పు, ఎంత ఖరీదు వుండవచ్చునో చెప్తూ "బ్రోకర్ మనకోసం అక్కడ వుంటాడు" అని చెప్పాడు.

రామకృష్ణ ఖాళీ గ్లాసు పక్కన పెట్టి స్కూటర్ తీసుకొని రావడానికని శ్రీకాంతమ్మగారి ఇంటికి వెళ్ళాడు. అతను స్కూటర్ తీసుకొని వచ్చేసరికి సురేష్ హోండా స్టార్ట్ చేశాడు. వెనుకనే రామకృష్ణ బయల్దేరాడు.

సొంత ఇల్లు కట్టుకోవాలనే ఆలోచనతో వున్నాడు రామకృష్ణ. అదీ ఎర్రగడ్డ సెంటర్ మెయిన్‌రోడ్డుకి దగ్గరయితే బావుండునని స్థలం అన్వేషిస్తూ- ఆ ఏరియాలో ధర అందుబాటులో లేకపోవడంతో కాస్త అటు ఇటుగా ఆ ప్రాంతానికి దగ్గరగా చూస్తున్నాడు. ఆ విషయం పై సురేష్ కూడా శ్రద్ధ తీసుకొని బ్రోకర్‌కి చెప్పి వుంచాడు.

రాత్రి తను ఇంటికి వెళ్లేసరికి బ్రోకర్ వచ్చి వున్నాడు. కూకట్‌పల్లిలోని ప్లాట్ విషయం చెప్పి వచ్చి చూసుకొంటే బేరం చేస్తానన్నాడు. అందుకు సురేష్ ప్లాటుకు సంబంధించిన వివరాలు, అడ్రస్సు, తెలుసుకొని పొద్దున్నే వస్తాను. అక్కడ వుండమని చెప్పాడు.

ఆ ప్రకారం వెళ్లేసరికి ప్లాట్‌దగ్గరే వున్నాడు బ్రోకర్. ఒక మంచి పోర్షన్ కట్టుకొనడానికి సరిపడే స్థలం అది. దగ్గరలో మంచి మంచి బిల్డింగులువున్నాయి.

"ఎలా వుంది" అడిగాడు సురేష్ రామకృష్ణని.

"నువ్వు చెప్పు" అన్నాడు రామకృష్ణ.

"బాగానే వుంది. పెద్దదూరమేం కాదు" చెప్పాడు సురేష్.

"సరే తీసుకుందాం" అన్నాడు రామకృష్ణ.

మరుసటిరోజే బ్రోకర్ బేరం సెటిల్ చే





శాడు.

డబ్బు కట్టడం, రిజిష్టర్ చేయించుకోవడం పది రోజుల్లో అయిపోయింది.

ఆ సంగతి శాఖవరం జాబురాసి శేషగిరి మాష్టారికి తెలియజేశాడు రామకృష్ణ.

★ ★ ★

ఎండ వేడెక్కుతూ వుంది.

వేపచెట్టు నీడలో వాలు కుర్చీ వేసుకొని పడుకుని వున్నాడు రాఘవయ్య. భూదేవమ్మ పంచలో ముగ్గురు మనుమరాళ్ళను ముందు కూర్చోబెట్టుకొని కబుర్లు చెప్తూ వుంది. పందిట్లో మంచం వాల్చుకొని పడుకొని వున్నాడు శివరామయ్య. పార్వతి రెండోసారి పాలల్లో బూస్ట్ పౌడర్ కలిపి తలా ఒక గ్లాసు ఇచ్చి తనూ తాగుతూ వచ్చి పంచలో కూర్చుంది.

భూదేవమ్మ ఖాళీ గ్లాసు పక్కనపెట్టి స్వాతి చేతికి వున్న వాచీ కేసి చూస్తూ "టైమెంతయ్యింది" అని అడిగింది.

"తొమ్మిదిన్నర" చెప్పింది స్వాతి.

"ఏందీ పడుకున్నావు. బస్సొచ్చే టైమయ్యింది" అంది భూదేవమ్మ రాఘవయ్యనుద్దేశించి.

"ఆ... ఆ" అంటూ రాఘవయ్య లేచాడు.

పార్వతి లేచి ఖాళీ గ్లాసులు తీసుకొని వంటింట్లోకి పోతుంటే అంకమ్మగుడి బస్టాండ్లోంచి బస్సు హారన్ వినపడింది.

"అదుగో వచ్చేసింది" అన్నాడు రాఘవయ్య.

స్వాతి గబుక్కున లేచి ఇంట్లోకి దూరింది. వాణి, రాణి వీధి వాకిట్లోకి పరిగెత్తారు. శివరామయ్య లేచి పందిట్లో రెండు నవ్వారు మంచాలు వాల్చి వాటిపైన పరుపులు పరిచి దిండ్లేశాడు.

భూదేవమ్మ కంగారు పడుతూనే ఉత్సాహంగా వుంది.

ఆమెకిగానీ, రాఘవయ్యకిగానీ స్వాతిని దూరంగా పంపడం యిష్టంలేదు. పిలిస్తే పలికేటంత దగ్గర్లో యివ్వాలని పెళ్ళిసంబంధాలు చూస్తున్నారు.

నాలుగు రోజులనాడు కందుకూరు పోయి విశ్వనాథంగారి అబ్బాయి చక్రవర్తిని చూసి వచ్చాడు రాఘవయ్య. చక్రవర్తి ఎర్రగా అందంగా వున్నాడు. బి.ఎ. వరకూ చదువుకున్నాడు. ఫైనాన్స్ బిజినెస్ అని చెప్పారు.

వాళ్ళారోజు స్వాతిని చూడ్డానికి పది గంటల బస్సులో వస్తున్నట్లు కబురంపారు.

ఆ బస్సు హారన్ వినబడి పదినిముషాలయ్యింది.

వాణి, రాణి వీధిలోకి ఎదురుచూడసాగారు. ఇరవై నిముషాలు దాటింది. ఎవరూ రాకపోవడంతో నీరసంగా మొహంపెట్టి లోపలకు వచ్చేశారు.

భూదేవమ్మకి ఏదో అనుమానం కలిగింది.

"పదిగంటల బస్సుకి వస్తామన్నారుగా" అంది రాఘవయ్యతో

రాఘవయ్య తల పైకీ కిందికీ ఆడించి "దాన్ని చదివిస్తే బావుండేది" అన్నాడు అదోలా.

"చదువు విషయం గురించి అడిగారా ఏంది వాళ్ళు"

"ఎంతవరకు చదువుకొందని అడిగార్లే... రెండు తరగతులు చదువుకుందని చెప్పా"

"అయితే వాళ్ళు రానట్టేనా..." భూదేవమ్మకి ఒళ్ళు చచ్చుబడ్డట్టయ్యింది.

అబ్బాయి బావుంటాడని రాఘవయ్య చెప్పినప్పుడు మహా సంతోషపడింది. కందుకూరు పెద్దదూరమేంకాదు. పది మైళ్ళు. గంటగంటకీ బస్సులున్నాయి. ముంగిట్లో వున్నట్లే. పైగా టౌను. అన్నిటికీ అనుకూలంగా వుంటుంది. కట్నం కాస్త ఎక్కువైనా సరే ఆ సంబంధం ఖాయం చెయ్యాలనుకుంది. కానీ వాళ్ళు రాకపోవడంతో నీరసం వచ్చి డీలాపడిపోయింది.

సరిగ్గా అప్పుడే వీధివాకిట్లో అంబాసిడర్ కారొచ్చి ఆగి అందులోంచి దిగుతున్నవాళ్లని

చూసి "కార్లో వచ్చారు" అని రాఘవయ్య అనడంతో ఆ నీరసమంతా ఎటో ఎగిరిపోయింది. ఫ్యాంటూ, ఫుల్‌హ్యాండ్స్ షర్టుతో టక్ చేసుకొని నీటుగా ఐదున్నర అడుగుల పైన పొడుగున్న చక్రవర్తిని చూడగానే ఆనందంతో వుక్కిరిబిక్కిరి అయ్యింది.

చక్రవర్తితోపాటు అతని తండ్రి విశ్వనాథం, తల్లి సరోజనమ్మ, చెల్లెలు రోహిణి వచ్చారు.

"రండి" అంటూ రాఘవయ్య ఎదురు వెళ్ళి తీసుకువచ్చాడు.

పార్వతి వాళ్ళకి మంచినీళ్ళు ఇస్తూవుంటే వాణి, రాణి చక్రవర్తిని ఓ.కే. చేస్తున్నట్లు కళ్ళెగరేసి దొడ్లోకి పోయి "బావున్నాడు" అని స్వాతి చెవిలో చెప్పేసి వచ్చారు.

"మీరు లోపలకి రండి" అంటూ పార్వతి సరోజనమ్మని, రోహిణిని యింట్లోకి పిల్చుకొని పోయి నట్టింట్లో చాపలు పరిచింది.

"మీరిప్పుడు కాఫీ, టిఫిన్‌ల పనేం పెట్టుకోవద్దు. ముందు అమ్మాయిని చూడాలి. తర్వాతనే అన్నీ" అంది సరోజనమ్మ కూర్చుంటూ.

భూదేవమ్మ "అలాగే చేద్దాం" అని దొడ్లోకి పోయి స్వాతిని వెంటబెట్టుకొని వచ్చి తనూ కూర్చుంది.

కక్కొచ్చినా, కళ్యాణమొచ్చినా ఆగదంటారు. అర్థగంటలో పెళ్ళిచూపుల తంతు ముగియడం, ఒకరినొకరు ఇష్టపడడం, మరో గంటలో కట్నకానుకల చర్చ సుఖాంతం కావడం, తాంబూలాలు యిచ్చిపుచ్చుకొన్న తర్వాత భోజనాలు చేశారు.

★ ★ ★

వారంరోజులు అయ్యింది పెళ్ళి అయ్యి.

ఈ వారంరోజుల్లో చక్రవర్తికి ఆ యింటి విషయాలు అవగాహనయ్యి తన అదృష్టం పండిందనుకొన్నాడు. భూదేవమ్మని పెద్దమ్మ అని, రాఘవయ్యని పెద్దనాయన అని పిలవడం మొదలెట్టాడు. అందుకు వాళ్ళు సంబరపడిపోయారు.

ఇరుగుపొరుగు వాళ్ళు స్వాతిని, చక్రవర్తిని చూసి ఈడూ-జోడూ బావుందని మెచ్చుకొంటుంటే భూదేవమ్మ, రాఘవయ్యలు ఎంతో గర్వపడ్డారు.

"నా చిట్టితల్లి సుఖంకంటే నాకేం కావాలి" అని అంది భూదేవమ్మ.

నేనున్నంతకాలం దానికి ఏలోటూ రానివ్వను అని రాఘవయ్య అన్నాడు.

వాళ్ళకి చక్రవర్తి బాగా నచ్చాడు.

అతను చేసేది తండల వ్యాపారం. వంద రూపాయలకి తొంభై రూపాయలిచ్చి వంద రోజుల్లో రోజుకు రూపాయ లెక్కన వంద రూపాయలూ వసూలు చేసుకోవడం. దాన్నే ఫైనాన్సు బిజినెస్‌గా ఫీలవుతూ చక్రవర్తి గొప్పలు చెప్తూవుంటే భూదేవమ్మకీ, రాఘవయ్యకీ మహాసంబరం. మా చక్రవర్తి, మా చక్రవర్తి... అంటూ తెగమురిసిపోతూ అతనిపట్ల అమితమైన ప్రేమను పెంచుకొన్నారు. సూర్యోదయం అయ్యేసరికి వేడివేడిగా ఇడ్లీలు, దోశలు, పూరీలు, పొంగలి... ఇలా రోజుకోరకం టిఫిన్. పప్పూ, తాలింపు, పులుసు, గడ్డపెరుగు భోజనం. సాయంకాలం ఫలహారం. ఈడూ-జోడూ బావుందని మెచ్చుకొన్న ఇరుగుపొరుగు అమ్మలక్కలే 'కొడుకు, కోడల్ని యింట్లోంచి తరిమి, కూతుర్ని, అల్లుణ్ణి మేపుతున్నారు ఆంబోతుని మేపినట్ట'ని చెవులు కొరుక్కున్నారు. అందుకు తగ్గట్టుగానే వుంది చక్రవర్తి ప్రవర్తనగూడా. భూదేవమ్మ రాఘవయ్యలపట్ల అతి మర్యాదను ప్రదర్శిస్తూ వాళ్ళ పక్కలో కూర్చుని ఏవేవో రహస్యాలు చెప్తున్నట్లు ఒకటే గుసగుసలు.

స్వాతిని కాపురానికి పంపేటప్పుడు ఏయే సామానులు ఇవ్వాలోనని చర్చించుకుంటుంటే "అవన్నీ ఇప్పుడెందుకులే పెద్దమ్మా. మొత్తంగా డబ్బులివ్వండి. అవసరాన్ని బట్టి నేనే కొనుక్కుంటాను" అని అన్నాడు భూదేవమ్మతో. అందుకు భూదేవమ్మ సంతోషప




డింది.

"అలాగే నాయనా. అదే మంచి పని. అనవసరంగా వున్నవీ, లేనివీ కొని పెట్టుకోవడం కన్నా మీకెప్పుడేమవసరమయితే అవి కొనుక్కోండి" అని కొంత డబ్బు యిస్తూ, "మీకేలోటూ చెయ్యం... అన్నీ జరుపుతాం" అంది.

చక్రవర్తి మొహంలోకి వెలుగొచ్చింది. ఆనందంగా డబ్బు అందుకున్నాడు.

స్వాతి ప్రయాణం అవుతూవుంటే రాఘవయ్యకి దుఃఖం ముంచుకొచ్చింది. చక్రవర్తికి ఏవేవో సలహాలిచ్చాడు. చీర, సారెలు పెట్టే విషయంలో ఏలోటూ చేయలేదు. మామకి పంచా, పై పంచా, అత్తా, ఆడబిడ్డకి చీర, జాకెట్ తీసుకుని భూదేవమ్మ తన నెక్లెస్ స్వాతి మెడలో అలంకరించి వాళ్ళతో బయల్దేరింది.

మూడురోజులు కందుకూరులో వుండి నాలుగోరోజు శాఖవరం బయల్దేరింది. అలా ప్రయాణమైనప్పుడు "నెక్లెస్ స్వాతికి బాగా నచ్చింది పెద్దమ్మా" అన్నాడు చక్రవర్తి ముద్దుముద్దుగా. ఆ మాటకి భూదేవమ్మ తడబడకుండా "అయితే నువ్వే వుంచుకోవే" అని భరోసాగా స్వాతితో అనేసి ఆ నెక్లెస్ ఆమెకిచ్చేసి వెళ్ళిపోయింది.

ఆ విషయం భూదేవమ్మ ఇంట్లో చెప్పగానే వాణికి కోపమొచ్చింది. "అన్నీ అక్కకే ఇస్తావు. దానిమీదనే నీకు ప్రేమ" అని చిరాకుగా కసిరి గోల చేసింది.

అందుకు పార్వతి కాస్త కోప్పడి, "నీకుమటుకు అమ్మమ్మ చేయించదా ఏమిటే. అంతకన్నా మంచిదే చేయిస్తుందిలే" అని సముదాయించింది.

"అంతేకాదమ్మా. నీకింకా మంచి సంబంధం తెస్తాను. ఉద్యోగస్థుడిని తెస్తాను" అని భరోసా ఇచ్చాడు రాఘవయ్య.

వాణి మొహం సిగ్గుతో మురిసిపోయింది.

సరిగ్గా వారంరోజులకి స్వాతి, చక్రవర్తి వచ్చారు. వస్తూనే చక్రవర్తి "మిమ్మల్ని చూడకుండా వుండలేకపోతోంది పెద్దమ్మా" అని చెప్పాడు భూదేవమ్మతో స్వాతిని ఉద్దేశించి.

భూదేవమ్మకి గర్వంగా వుంది.

"పిచ్చితల్లి, మమ్మల్ని విడిచి క్షణం కూడా ఉండి ఎరుగదు" అంటూ స్వాతిని దగ్గరకు తీసుకుంది.

"మా పరిస్థితి కూడా అలాగేవుంది నాయనా" అన్నాడు రాఘవయ్య.

"అందుకే పెదనాయనా తీసుకువచ్చాను. సాయంకాలందాకా వుండిపోవచ్చని" అని చక్రవర్తి చెప్తూవుంటే, "సాయంకాలం ఏం పోతార్లే రెండురోజులుండండి" అంది భూదేవమ్మ.

"సరేలే పెద్దమ్మా నీ మాట దేనికి కాదనాలి. రెండురోజులపాటు నేనే ఉదయం పోయి సాయంకాలం వస్తుంటాను" అని చెప్పాడు.

"అదీ... ఆ పని చెయ్యి నాయనా" అన్నాడు రాఘవయ్య.

భూదేవమ్మ చక్రవర్తిని మెచ్చుకొంది.

ఆమెకి స్వాతిని వదిలి వుండడం కష్టంగానే వుంది. వాణిని, రాణిని పెళ్ళి చేసి పంపించి తర్వాత, స్వాతిని తెచ్చుకుని ఇంట్లో వుంచుకోవాలని ఎప్పటినుంచో మనసులో వుంది. ఆ విషయం బయట పెట్టకుండా వాణికి ఉద్యోగం చేసే అబ్బాయిని చూడమని చక్రవర్తికి చెప్పింది.

"అలాగే పెద్దమ్మా" అని చక్రవర్తి వాణికి ఉద్యోగం చేసే అబ్బాయిని తెచ్చేపని తన భుజాలపైన వేసుకున్నాడు. అతను ఆ పని చేస్తాడని ఆ ఇంట్లో అందరికీ నమ్మకం వుంది.

★ ★ ★

ఒకరోజు సాయంకాలం చక్రవర్తి ఆరుగంటల బస్సులో వచ్చి "స్వాతికి వాంతులవుతున్నాయి. డాక్టరమ్మకు చూపిస్తే వేవిళ్ళు

అని చెప్పింది" అని చెప్పాడు.

ఆ వార్త ఇంటిల్లిపాదికీ శ్రవణానందం అయ్యింది. భూదేవమ్మకయితే కాలు నిలవ లేదు. వెంటనే పోయి స్వాతిని చూడాలని చక్రవర్తితో బయల్దేరింది. బస్సులో కూర్చున్నంతసేపూ ఆమె మనసు మనసులో లేదు. ఎప్పుడెప్పుడు కందుకూరు వస్తుందా అని ఆతృత పడుతూ స్వాతి తినడానికి పుల్లనిపండ్లు ఏవేవి తీసుకుపోవాలి, ఏ నెలలో శ్రీమంతం చెయ్యాలి, ఎంత ఖరీదులో చీర కొనాలి, ఏ ఆస్పత్రిలో కాన్పు చేయించాలి, కొడుకు పుడతాడా, కూతురు పుడుతుందా... ఇవే ఆలోచనలు.

"దిగుదామా పెద్దమ్మా" అన్నాడు చక్రవర్తి లేస్తూ.

భూదేవమ్మ ఆలోచించడం మానేసి బస్సు దిగింది.

ఆమె రావడం పంచలోంచి చూసిన సరోజనమ్మ "స్వాతీ మీ అమ్మమ్మ వచ్చింది" అని పక్క గదిలోవున్న స్వాతికి వినబడేట్టు అంది.

ఆ మాట వినడంతోనే స్వాతి పడకమీద నుంచి లేచి బయటకు గెంతింది. భూదేవమ్మను చూసి, "వస్తావనుకోలేదు" అంది సంతోషంతో.

"రాకుండా ఎలా వుంటానమ్మా?" అంటూ భూదేవమ్మ స్వాతిని ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంది.

"నీకు మునిమనుమడో, మునిమనువరాలో పుట్టబోతున్నారు పెద్దమ్మా" అంది రోహిణి.

"పుట్టేది మనిమనవడే" గర్వంగా చెప్పింది భూదేవమ్మ.

ఆ మాటకు చక్రవర్తి గాలిలో తేలిపోయాడు.

"అదే నిజమయితే పెద్దమ్మా నీ నోటి నిండా చక్కెర పోస్తా" అన్నాడు.

"నువ్వు చక్కెర పొయ్యటమేంటన్నయ్యా, పెద్దమ్మే నీకు పాయసం వండిపెడుతుంది" అంది రోహిణి.

భోజనాలకు కూర్చున్నప్పుడు మాటల సందర్భంలో "రేపు మునిమనుమడే పుడితే వాడికి ఏంచేయించి పెట్టబోతున్నావు" అని అడిగింది సరోజనమ్మ భూదేవమ్మని.

భూదేవమ్మ వూహించలేదు అలాంటి ప్రస్తావన వస్తుందని. వెంటనే ఏం చెప్పాలో తోచలేదు.

సరోజనమ్మే కలుగజేసుకొని, "మెడలోకి పులిగోరు చైను, చేతులకు మురుగులూ చేయించు బావుంటుంది" అంది.

వెంటనే "వెండి మొలతాడూ, కాళ్ళకి ఘల్లు పట్టీలు కూడా అయితే బావుంటాయి పెద్దమ్మా" అన్నాడు చక్రవర్తి.

"అలాగే చేయిస్తాను" గర్వంగా ఒప్పేసుకుంది.

చక్రవర్తి ఆనందం పట్టలేకపోయాడు.

మరుసటిరోజు స్వాతికి జాగ్రత్తలు చెప్పి సాయంకాలం ఆరుగంటల బస్సుకి ప్రయాణమయింది భూదేవమ్మ.

"రేపు పోవచ్చులే పెద్దమ్మా" అన్నాడు చక్రవర్తి.

"నేను రెండ్రోజులకొకసారి వస్తుంటానులే నాయనా. రేపు మీ పెదనాయన్ని పంపిస్తాను" అని చెప్పి బయల్దేరింది. చక్రవర్తి బస్టాండ్‌దాకా వచ్చి బస్సెక్కించి వెళ్ళిపోయాడు.

ఏడు గంటలయ్యింది, భూదేవమ్మ శాఖవరం వచ్చేసరికి. ఇంటికి వస్తూనే నట్టింట్లో కూర్చుని స్వాతి సంగతి చెప్తూ మునిమనవడికి చేయిస్తానన్న వస్తువుల గురించి చెప్పింది.

"సరేలే చేయిద్దాం" అన్నాడు రాఘవయ్య.

వెంటనే వాణికి వంట్లో రక్తం తుకతుక ఉడికింది. మొహం మాడ్చుకుని చివుక్కున అక్కడినుంచి లేచిపోయింది.

"దీనికెప్పుడూ కుళ్ళు" అని పార్వతి విసుక్కుంది.




"దానికేం తెలీదులేమ్మా? " అంటూ రాఘవయ్యా సర్దిచెప్తూ వుంటే లేచిపోయిన వాణి విసురుగా అక్కడికి వచ్చి, "నేనేం కుళ్ళుదాన్ని కాదు. మీరే సంవత్సరంనాడు చెప్పారు. నాకూ, రాణికి ముత్యాలదండ చేయిస్తామని. చేయించారా? కనీసం మా వొంటిమీదికి ఖరీదైన గుడ్డలు తీసుకొచ్చారా? అక్కని ఎన్నిసార్లు మీరు గుడ్డల కొట్టుకు తీసుకుని పోయి కావలసినవి తీసివ్వలేదు. మేము అట్లాంటివాళ్ళం కాదా? " అంటూ అక్కసు వెళ్ళగక్కిపోయి ఏడుస్తూ పడుకుంది.

అందరూ హతాశులయ్యారు.

అప్పటిదాకా భూదేవమ్మ పక్కన కూర్చున్న రాణి లేచిపోయి వాణి పక్కన కూర్చుంది.

వాళ్ళకి సర్దిచెప్పి సముదాయించడం మహాకష్టమయింది.

"రేపు కందుకూరు తీసుకుపోయి కోరిన గుడ్డలు తీయించి ముత్యాలదండలు చేయిస్తా"నని రాఘవయ్యా ఒప్పుకుంటేగానీ వాణీ, రాణీ అలక మానలేదు.

రాఘవయ్యా నవ్వుకొన్నాడు. భూదేవమ్మకి నిద్ర రాలేదు. ఆమెకి వాణి ప్రవర్తనపట్ల అసహనంగా వుంది. అది మహాకచ్చిది. దానికి అంతా స్వాతికి దోచిపెడుతున్నారని ఈర్ష్య. ఉండబట్టలేక కోపంతో వూగిపోతూ, వెనకాముందూ చూడకుండా నోటికి ఎంత వస్తే అంతమాట అనేస్తుంది. కోపం వచ్చేట్టు, మనసు విరిగేట్టు ప్రవర్తిస్తుంది. ఒక్కోసారి "ఊళ్ళోకి పోయి చూడండి. మీ మొహాన ఊస్తున్నారు. ఈ పాపిష్టి కొంపలో నేనుండలేను" అంటూ అరుస్తుంది. రామకృష్ణని గుర్తుచేసి "ఎప్పుడో వస్తాడు మావయ్య. మీ అందరి తలకాయలు పగలగొట్టి తగలేసిపోతాడు" అని కసితీరా అంటుంది. అది భరించలేక కోప్పడితే ఏడ్చి ఏడ్చి అలిగి కూర్చుంటుంది.

మరుసటిరోజు రాఘవయ్యతో వాణినీ, రాణినీ కందుకూరు పంపించి వాళ్ళకి కావలసిన గుడ్డలు తీయించి చెరొక ముత్యాల దండ చేయించాలని ఆలోచిస్తూ వాణి మాటలే ఆలోచిస్తూ నిద్రలోకి జారుకుంది- భూదేవమ్మ.

"అమ్మమ్మా మావయ్య వస్తున్నాడు" చెప్పింది రాణి.

తలెత్తి చూసింది భూదేవమ్మ. వీధి వాకిట్లోంచి రామకృష్ణ వస్తూ కనిపించాడు.

భూదేవమ్మకి గుండె ఝల్లుమని వేగంగా కొట్టుకోసాగింది. రాఘవయ్యా మొహం చిట్లించి చూశాడు. పార్వతి, శివరామయ్యా ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

రామకృష్ణ నేరుగా ఇంట్లోకి పోయి దొడ్డి తలుపు వేసివచ్చాడు. అందరూ బిత్తర పోయి తేరుకునేసరికి బయట తలుపులు మూసి తాళంవేసి పంచలో ఠీవిగా నిలబడి వున్నాడు.

"ఏమిటీ" అని అడిగాడు రాఘవయ్యా.

"ఆస్తిలో నాకు రావలసిన వాటా నాకు పంచి ఇవ్వండి" రామకృష్ణ ఎలాంటి తొట్రుపాటు లేకుండా అన్నాడు.

రాఘవయ్యకి చిర్రెత్తింది.

"ఈ ఆస్తి నాది, ఇందులో పైసా ఎత్తు కూడా రాదు. ఎవరికి చెప్పుకుంటావో చెప్పు" అన్నాడు.

"నేనెవరికీ చెప్పుకోను. ఆ అవసరం నాకు లేదు. నీకేదన్నా అవసరమయితే చెప్పుకో వూళ్ళోకి పోయి. నా వాటా ఆస్తి నాకు పంచివ్వంది మీరింట్లోకి పోలేరు"

చివుక్కున లేచింది భూదేవమ్మ. కోపంతో ఊగిపోతూ రామకృష్ణ మీదకిపోయింది.

యాడుందిరా నీకూ, నీ పెళ్ళానికీ ఆస్తిలో వాటా. మాది. మా సొంతం. మా ఇంటికి నువ్వు తాళం వేస్తే భయపడతామనుకొన్నావా? నేను పగలగొడతాను తాళం. అడ్డం వస్తే నీ తలకాయ పగలగొట్టి ఇంట్లోకి పోతాను" అంటూ పూనకం వచ్చినదానిలా తాళం పగలగొట్టడానికి తలుపు



దగ్గరికి పోతూవుంటే రామకృష్ణ అడ్డువచ్చాడు.

"ఒరేయ్" అంటూ పిడికిలి బిగించి అతని తలమీద గుద్ది చేతికి నొప్పి తగలడంతో కళ్ళు తెరిచి తను గుద్దింది మంచం పట్టె మీద అని తెలిసి చుట్టూ చూసింది. అందరూ నిద్రపోతున్నారు. తను లేచి మంచినీళ్ళు తాగి పడుకొని కళ్ళు మూసుకుంది.

మరుసటిరోజు మధ్యాహ్నం మూడుగంటల బస్సులో రాఘవయ్య వాణినీ, రాణినీ కందుకూరు తీసుకునిపోయి వాళ్ళకు కావలసిన గుడ్డలు తీయించి బంగారం, రెండు ముత్యాలదండలు పసివాడికి చేయమని అడ్వాన్స్ ఇచ్చారు.



ఒకటా, రెండా- ఆరేళ్ళు

గిన్నిస్ బుక్‌లోకి ఎక్కవలసిన విషయమే. అన్నేళ్ళు రామకృష్ణ వాళ్ళు శ్రీకాంతమ్మగారింట్లో వున్నారంటే అందరికీ ఆశ్చర్యమే. అక్కడ అంతకుముందు అందులో చేరిన వాళ్ళెవ్వరూ అయిదారు నెలలకన్నా ఎక్కువ వుండలేదు. వేరే ఇల్లు చూసుకుని వెళ్ళిపోయేవాళ్ళు.

రామకృష్ణా వాళ్ళకి అది తమకోసమే ఖాళీగా వుందనిపించిందేగానీ వేరే ఇంట్లోకి మారాలనిపించలేదు. మొదటిసారిగా అందులో దీపారాధన చేసిన రోజునుంచీ రామకృష్ణకి మనశ్శాంతిగానూ, హుషారుగానూ వుంది. లక్ష్మి, పిల్లలు అక్కడ బాగా కలిసిపోయారు. ఇల్లు ఇరుకే అయినా అది బాగా అచ్చొచ్చిందన్న భావం వాళ్ళలో నాటుకుపోయింది.

వాళ్ళు కూకట్‌పల్లిలో స్థలం కొన్న దగ్గరి నుంచీ ఇల్లు కట్టుకొని వెళ్ళిపోతారేమోనని శ్రీకాంతమ్మకి బెంగ పట్టుకొంది. ఆమెకి వాళ్ళు బాగా నచ్చారు. ఎలాంటి పొరపొచ్చాలు లేకుండా కలిసిపోయారు. కాలం ఎలా కరిగిపోయిందో కంప్యూటర్ సంస్థ బాగా స్టాండ్ అయింది. రెండు కంప్యూటర్లతో ప్రారంభించబడిన ఆ సంస్థ ఐదు కంప్యూటర్ల స్థాయికి దిగింది.

మంచితనం, మర్యాదా, స్వచ్ఛతా, సంస్కారం మనిషికి సమాజంలో ఎలా గుర్తింపు, గౌరవాన్ని తెస్తాయో- సురేష్, రామకృష్ణల కార్యదీక్ష, క్రమశిక్షణ, వాళ్ళ కంప్యూటర్ సంస్థ స్టాండ్ కావడానికి దోహదపడ్డాయి. క్వాలిఫైడ్ స్టాఫ్‌తో క్వాలిటీ ఎడ్యుకేషన్ ఇస్తూ పీస్‌ఫుల్‌గా నడుపుకొస్తున్నారు. రామకృష్ణ కూడా కంప్యూటర్ నేర్చుకుని సురేష్‌తోపాటే కొన్ని బ్యాచ్‌లకి శిక్షణ ఇస్తున్నాడు.

అతనిది పూర్తిగా వర్క్‌మైండ్. ముందు పనిచెయ్యాలి, తర్వాత ఫలితాన్ని ఆశించాలి అనే మనస్తత్వం. అహంలేదు. అందరితోనూ ఫ్రీ మూవ్‌మెంట్ ఉంది. సురేష్‌తో స్నేహం కలిసినందుకు కనబడని దేముడికి ఎన్నిసార్లు దణ్ణం పెట్టుకున్నాడో సురేష్‌ని తలుచుకుంటూ నేను అదృష్టవంతుడ్ని అనుకునేవాడు. అతనికి తన గతాన్ని గురించి చెప్పాలని ఎన్నోసార్లు అనుకున్నాడు. కానీ శేషగిరి మాస్టారు "ఇక్కడి విషయాలు ఇక్కడే మర్చిపోండి. అక్కడ ఎవరితోనూ ప్రస్తావించవద్దు" అని శాఖవరం నుంచి




వచ్చేరోజు గట్టిగా చెప్పాడు. ఆయన మాటంటే లక్ష్మికిగానీ, రామకృష్ణకిగానీ వేద వాక్కు. కనుకనే లక్ష్మి ఆ ఊరి విషయాలు మననం చేసుకోవడం మానేసింది. కానీ రామకృష్ణకు అనూహ్యంగా అప్పుడప్పుడు మనసుని తొలిచేస్తూంటాయి. 'తనకన్నా దరిద్రుడు, దురదృష్టవంతుడు వుండనే ఉండడు' అని.

తనలోతనే అదోలా నవ్వుకునేవాడు. అయినా తనేం చెప్పుకోగలడు? అమ్మానాన్నలు మంచివారు కాదు, ఇంట్లోంచి తరిమేశారు అని చెప్పుకోగలడా? చెప్తే అది నిజమని ఎంతమంది నమ్ముతారు? నమ్మినా తనేదో చేసివుంటాడు, లేకుంటే ఎందుకు తరిమేస్తారని అనుకుంటారు. లేకుంటే తనే పెళ్లాం మాటలు విని అమ్మా నాన్న మీద తిరగబడి బయటకొచ్చేశాడని తప్పు తనమీదనే తోసేస్తారు.

లోకంలో తన జీవితం తనకే వింతగానూ, విడ్డూరంగానూ కనబడుతోంది. అప్పుడప్పుడు అర్ధరాత్రిపూట మెలుకువ వచ్చి లేచి ఆలోచిస్తూ కూర్చునేవాడు. ఏడుపొచ్చేది. దుఃఖాన్ని దిగమింగి పడుకునేవాడు. తనకు తెలిసిన సమాజంలో తనలా కష్టాన్ని అనుభవించిన వ్యక్తులు ఎక్కడా తారసపడలేదు తనకు.

అమ్మానాన్నా, కొడుకూ, కోడలూ, కూతుళ్లూ, అల్లుళ్లు ఆప్యాయంగా ప్రేమానురాగాలు పంచుకోవడం చూశాడు. గౌరవ మర్యాదలు ఇచ్చి పుచ్చుకోవడం చూశాడు. అసహ్యపు అరుపులు, అమానుష ప్రవర్తన, అఘాయిత్యాలు చూడలేదు. అవన్నీ తనే అనుభవించాడు. ఏడేడు పధ్నాలుగు జన్మలకు సరిపడే అనుభవాలవి. కాలం వాటిని మరిపించే ప్రయత్నం చేస్తూ ఉంది. తనకూ మరిచిపోవాలని ఉంది. కానీ మనసు పొరల్లోంచి అప్పుడప్పుడు అవి పెళ్లగించినట్లు బయటకి వచ్చి నిర్వీర్యపరుస్తూనే ఉన్నాయి.

అయినా రామకృష్ణలో పట్టుదల సడలలేదు. ఆఫీసు, ఇల్లు, కంప్యూటర్ సంస్థ ఎక్కడో ఒకచోట బిజీ. అనుకూలవతి అయిన లక్ష్మి భార్య కావడం తన అదృష్టమని అనుకున్నాడు. ఏదీ కావాలని నోరు తెరిచి అడగదు. మంచీ, మర్యాదా తెలుసు. అబిడ్స్‌లోని మోహన్‌రావుగారింటికి వెళ్లినా, సనత్‌నగర్‌లోని సురేష్ వాళ్లింటికి వెళ్లినా- అక్కడ వాళ్ల పనిలో చెయ్యి పెట్టకుండా ఉండదు.

వాళ్ళంటే ఆమెకి అమిత గౌరవం.

"వాళ్ళకి వూడిగం చేసినా మనం వాళ్ళ రుణం తీర్చుకోలేమండీ" అని రామకృష్ణతో చాలాసార్లు అంది.

ఆమె ఆత్మసౌందర్యమే రామకృష్ణకి మహాబలమయ్యింది. దైవభక్తి వుంది. ధర్మబుద్ధి వుంది. ప్రేమ, జాలి మంచి, చెడు తెలుసు. భర్త అనురాగాన్ని పొందింది. ఆప్యాయంగా అతని ఎదను తడిమింది. తట్టుకోలేని దుఃఖంలో ఏడ్చేసినప్పుడు కళ్లు తుడిచి తన హృయదంమీదికి తీసుకుని సేదదీర్చింది.

పిల్లలిద్దరూ మంచి చురుకైన వాళ్ళు కావడం ఎంతో సంతోషం అయ్యింది. నరేష్ ఏడో తరగతిలోకి, మహేష్ ఆరవ తరగతిలోకి వచ్చారు. చదువులో ఎవరికి వాళ్లు వాళ్ళ క్లాసులో ఫస్టు మార్కులు తెస్తున్నారు. నరేష్‌కి కథలపుస్తకాలు చదవడం అంటే ఇష్టం. రామకృష్ణచేత నెలనెలా వచ్చే చందమామ, బాలమిత్ర, పత్రికలు తెప్పించుకొని చదివి ఆ కథల్లో నిజం వుందా, నీతి వుందా అని డిస్కస్ చెయ్యడం బాగా అలవాటు. మహేష్‌కి ఆటలపిచ్చి క్రికెట్ జరిగేరోజుల్లో టి.వి. పెట్టుకొనడానికి ఎప్పుడెప్పుడు వీలు దొరుకుతుందా అని చూస్తుంటాడు. క్యారమ్‌బోర్డు, చెస్‌బోర్డు కొనిపించాడు. అన్నదమ్ముల మధ్య మంచి అన్యోన్యత వుంది. వాళ్ళకి లక్ష్మి దగ్గర మంచి చనువు. స్కూల్లో సంగతులవీ చెప్పేవాళ్ళు

యాదృచ్ఛికంగా వాళ్ళ మాటల్లో వాళ్ళ అమ్మమ్మ ప్రస్తావన తెచ్చేవాళ్ళు. ఆమె అంటే పిల్లలకి మంచి ఇష్టం. అమ్మమ్మ ఇంట్లో వుంటే తినడానికి కొదువే వుండదనే వాళ్ళు. అలాంటి సందర్భాలలో లక్ష్మికి అమ్మ గుర్తుకు వచ్చేది.

శాఖవరంలో వున్నప్పుడు పాలెంనుంచి శాంతమ్మ నెలకోమారు వచ్చేది. వస్తూ వస్తూ కందులో, పెసలో, వేరుసెనగకాయలో, గడ్డపెరుగో పిల్లలకి తినుబండారాలు తెచ్చేది. ఆమె వున్నంతసేపూ పిల్లలకి మహా సంతోషం. ఒకపూటకన్నా ఎక్కువ వుండేదికాదు. పోతూ పోతూ పిల్లల్ని పాలెం రమ్మనేది. ఒకపూట జరిగినా జరిగినట్టే అని నరేష్‌ను, మహేష్‌ను ఆమె వెంట పంపేది లక్ష్మి. మాధవి సౌమ్యురాలు. అక్కడ వాళ్ళని బాగానే చూసేది.

హైదరాబాదు వచ్చిన తరువాత పాలెం వెళ్ళడం కుదరలేదు. మొదట్లో రెండుసార్లు శాంతమ్మ వచ్చిపోయింది. ఒకసారి అన్నా, వదినా వచ్చిపోయారు. ఉత్తరాలు మాత్రం యధావిధిగా సాగుతున్నాయి. వేసవి సెలవుల్లో ఇరుగు పొరుగువాళ్ళ పిల్లలు వాళ్ళ వాళ్ళ అమ్మమ్మగారి వూళ్ళకో, నాయనమ్మగారి వూళ్ళకో వెళ్తుంటే లక్ష్మికి అదోలా వుంటుంది. 'తను ఇంక పుట్టింటికి వెళ్ళడం కుదరదేమో' అని అనుకునేది. అమ్మ ఎంత మంచిదో ఆమెకున్న సంస్కారంలో వందో వంతు కూడా లేదు అత్తకి. తను అత్త అని అహంకారం. అమ్మ ఇంటి విషయాలన్నీ వదినకి అప్పజెప్పింది. కొడుకు సంతానాన్ని పరాయి ఆడదాని బిడ్డలనుకోలేదు. ఆప్యాయంగా దగ్గరికి తీసుకుంది. లాలించి జోల పాడింది. ప్రేమతో చూసిందే తప్ప అసహ్యించుకోలేదు. అత్త అలా కాదు. నీదా? నీ అబ్బదా? నాది, నా ఇష్టం అంటూ వంటికాలిమీద పైపైకి దూకుతుంది. కూతురు, కూతురు బిడ్డలు తప్ప ఆమె కళ్ళకి ఎవరూ కనబడరు. అమ్మా కూతురికి ఎప్పుడూ చెవులు కొరుక్కోవడమే పని. ఒకటే గుసగుసలు. ఏ తల్లి అయినా కొడుకుని దూరం చేసుకుంటుందా, బిడ్డ ఒక రోజు కనబడకపోతే తల్లి మనసు తల్లడిల్లిపోతుందే- మరి ఇదేమిటి? మూర్ఖత్వమా? అమాయకత్వమా? అహంకారమా? అయినా ఇంత కఠినంగానా ప్రవర్తించేది. ఇలాంటివాళ్లు లోకంలో వున్నారంటే ఎంత మందికి నమ్మకం కలుగుతుంది?

వాళ్ళకెప్పుడూ డబ్బు, బంగారం, పొలం గురించే ఆలోచన. కొడుకు, కొడుకు పిల్లల గురించి పట్టనే పట్టదు. కూతురూ, అల్లుడూ- వాళ్ళ పిల్లలూ వుంటే చాలు. చివరికి అలాగే చేశారు.

దేవుడు అన్యాయం చేయవచ్చు. తోబుట్టువులు, దాయాదులు, బంధుమిత్రులు అక్రమాలకు పాల్పడవచ్చు. బిడ్డలు అమ్మానాన్నని నిర్లక్ష్యం చెయ్యడం కూడా వుంది. కానీ కన్న తల్లిదండ్రులే బిడ్డకి అన్యాయం చేస్తే? అది ప్రకృతి విరుద్ధం. జనం నమ్మని నిజం.

అయినా-

అప్పుడప్పుడూ అక్కడక్కడా అసహజాలు, అసమంజసాలు, వింతలూ, విడ్డురాలు జరుగుతుంటాయి. అవన్నీ జరిగేది ఆర్థికపరమైన విషయాలమీదనే, స్వార్థపూరిత ప్రవర్తనవల్లనే, మంచీ చెడూ మరచి నీతినియమాలను వదిలేయడంవల్లనే. మానవత్వం మరుగునపడడం వల్లనే.

★ ★ ★

శ్రీకాంతమ్మ ఊహించనే లేదు. రామకృష్ణ వాళ్ళు అన్నేళ్లు వాళ్ళ ఇంట్లో వుంటారని. సురేష్‌కి, సుమతికి ఎంతో ఆశ్చర్యంగా వుంది. ఇల్లు మారమని చాలాసార్లు చెప్పారు కూడా 'ఇందులో బాగానే వుందిలే' అని రామకృష్ణవాళ్లు సర్దిచెప్పారే గానీ ఇరుగ్గా వుందని ఫీలవలేదు. వాళ్ళు దాంతోనే తృప్తిపడ్డారు. అందులోనే సుఖాన్ని వెతుక్కున్నారు. శాఖవరంలో




తనకు సంక్రమించవలసిన ఆస్తి విషయాన్ని రామకృష్ణ పూర్తిగా మర్చిపోయాడు. అమ్మా నాన్నని గురించి ఆలోచించడంలేదు. వాళ్ళ ఆస్తి రావాలని కోరుకోవడంలేదు. తను సంపాయించుకోవాలి. భార్యాపిల్లల్ని పోషించుకోవాలి అనే స్థిర నిశ్చయంతోటే ముందుకు పోతున్నాడు.

ఆ రాత్రి ఇంటికి రావడంతోటే "మీ కోసం పిల్లలు ఎదురుచూస్తూ వున్నారు" అని చెప్పింది రామకృష్ణతో లక్ష్మి.

"ఏమిటి సంగతులు..." రామకృష్ణ అడుగుతూవుంటే "స్కూలుకి సెలవులిచ్చారుగా. బోరు కొడుతోందట. రెండ్రోజులు ఏ వూరన్నా పోదాం అంటున్నారు" చెప్పింది లక్ష్మి.

"మనకెవరున్నారు లక్ష్మి. ఏ వూరన్నా పోవడానికి"

రామకృష్ణ అలా అనడంతో లక్ష్మి నోట వెంటనే మాటలు దొర్లలేదు.

"అమ్మమ్మా, మావయ్యా వున్నారుగా... ఆ వూరు పోదాం" అన్నాడు మహేష్.

రామకృష్ణ మనసు అదోలా అయింది. ఆ పరిసర ప్రాంతాలకే వెళ్ళకూడదనుకొన్నాడు. శేషగిరి మాష్టారిని చూడాలని వున్నా మనసు నిబ్బరం చేసుకునివున్నాడు. మహేష్‌కి వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. ఏమంటాడోనని లక్ష్మి ఎదురుచూసింది.

"ఇప్పుడు కాదులే. వచ్చే సంవత్సరం పోదాం" అన్నాడు.

మహేష్‌కి కోపం వచ్చింది. "నువ్వు నిరుడు గూడా ఇదేమాట చెప్పావు" విసురుగా అన్నాడు.

"మా ఫ్రెండ్స్ అంతా తలా ఒకరు వెళ్ళిపోయారు. మేమే ఎక్కడికీ పోకుండా వుంది. నీకు తెలుసుగా. మాలతీ, కిరణ్ వాళ్ళు కూడా బెంగుళూరు వాళ్ళ మావయ్య దగ్గరకి వెళ్ళారు..." అని మహేష్ అంటూ వుంటే రామకృష్ణ ఇద్దరి పిల్లల మధ్యా కూర్చుని వాళ్ళ వీపులమీద చేతులువేసి నిమురుతూ "నన్ను అర్థం చేసుకోండిరా..." అన్నాడు.

లక్ష్మికి బాధేసింది. పైకి గంభీరంగా, సంతోషంగా కనబడుతున్న భర్త మనసులో అగ్నిగుండాలు మండుతున్నాయని అర్థం చేసుకుంది. జాలిగా అతని మొహంలోకి చూసింది. పిల్లల్ని అనునయించి మాట మార్చి "ముందు మీరు స్నానం చేయండి" అంటూ లేచిపోయి నీళ్ళు తోడింది.

అన్నం తిని పడుకొన్నాడేగానీ రామకృష్ణకి నిద్రపట్టలేదు. ఆలోచిస్తూ వున్నాడు. ఆలోచించేకొద్దీ ఏడవాలనిపించింది.

అమ్మా, నాన్నా, అక్కా, బావా అందరూ వుండి తను ఎవరూ లేనివాడే. వాళ్ళంతా శత్రువులే. మంచితనమే లేదు. అంతా స్వార్థమే. మానవత్వమే లేదు. వాళ్ళని గురించి తన పిల్లల పిల్లలు, వాళ్ళ పిల్లల పిల్లలు కథలుగా చెప్పుకుంటారు. తనకు చేసిన అన్యాయం వాళ్ళకి తగలకుండా పోదు. తన పిల్లల ఉసురు వాళ్ళకి చుట్టుకోకుండాపోదు.

అమాయకంగా నిద్రపోతున్న పిల్లల్ని చూస్తుంటే మనసు విలవిల్లాడింది. వాళ్ళ కోరిక తీర్చలేకపోతున్నందుకు బాధపడిపోయాడు. అందరిలాంటి జీవితం కాదు తనది. విలక్షణమైనది. లోకవిరుద్ధమైనది. భరించాడు. అనుభవించాడు. ఆ బాధలేవీ తన పిల్లలకి రాకూడదు. వాళ్ళు సుఖంగా వుండాలి. సంతోషంగా బతకాలి. ఏలోటూ చేయకూడదు. వాళ్ళ మనసు కష్టపెట్టకూడదు. రెండు, మూడు రోజులు ఎక్కడికైనా తీసుకొని పోయి రావాలి. ఎక్కడికని తీసుకునిపోవాలి? ఏ వూరు తీసుకుని పోవాలి? మోహనరావు, వర్ధనమ్మ వాళ్లు వాళ్ళ కూతురి పిల్లల్ని తీసుకుని బెంగుళూరు పెద్దకొడుకు దగ్గరకి పోయారు. అక్కడ వారంరోజులు వుండి వచ్చిన తర్వాత మద్రాసులో వున్న చిన్నకొ



డుకు దగ్గరికి తీసుకునిపోతారు. సెలవులు వచ్చాయంటే మాలతి, కిరణ్ వాళ్ళకి అమ్మమ్మా, తాతయ్యతో కలిసి ఊళ్ళకు పోయిరావడం అలవాటు. వాళ్ళకంటే ఏ లోటూ లేదు కాబట్టి జాలీగా ఎంజాయ్ చేయగలుగుతున్నారు. తనకెవరున్నారు దిక్కు? ఎక్కడికని పిల్లల్ని తీసుకునిపోగ లడు? శీనయ్య ఆఫీసుకి సెలవుపెట్టి భార్య, పిల్లలతో శ్రీశైలంపోయి రెండు రోజులుండి రావడం గుర్తుకొచ్చింది.

'తనూ అదేపని చేస్తే...' ఆలోచిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

తెల్లవారి నిద్రలేస్తూనే ఆ విషయం లక్ష్మికి చెప్పాడు.

"అలాగేనండీ" అంది.

పిల్లలు కూడా లేవగానే వాళ్ళకీ చెప్పాడు.

మహేష్ అయిష్టంగా మొహం పెట్టాడు.

"మంచి ప్లాన్. నాకు రాతి బసవయ్యని, పాతాళగంగని చూపాలి" అన్నాడు నరేష్.

"తప్పకుండానయ్యా. ఒక్క రాతిబస వయ్య, పాతాళగంగ కాదు, అన్నీ చూపిస్తా. అక్కడ రెండ్రోజులపాటు వుందాం" అంటూ వుంటే మహేష్‌కి కూడా ఉత్సాహం అయింది.

"నాకు శ్రీశైలం డ్యామ్ చూపించాలి" అన్నాడు మహేష్.

"అలాగే" చెప్పాడు రామకృష్ణ.

"పోతూపోతూ కాస్త పెరుగన్నం, పులి హోరా చేసుకొని పోతే..." లక్ష్మి అంటూ వుంటే "ఇక్కడినించి అన్నీ మోసుకొని పోవాలా ఏంది? " అని మహేష్ విసుక్కు న్నాడు.

"ఏం మోసుకుపోతే... మనం తినే అన్నమే అన్నాడు నరేష్.

"అక్కడ బోలెడు హోటళ్ళుంటాయి"

"రేట్లు కూడా వాచిపోతాయి. తెలుసా"

"సరేలే నాన్నా. ఎలా వీలైతే అలా చేద్దాం" అంటూ రామకృష్ణ పిల్లలకు సర్ది చెప్పి "ఏరోజు పోదామో చెప్పండి" అనడి గాడు.

"ఈరోజే వెళదాం" అన్నాడు నరేష్.

"ఈరోజు కాదులే నాన్నా. మీరు మీ అమ్మమ్మా, మావయ్యగారి ఊరు వెళ్ళకపో యినా, వాళ్ళని కలుసుకునే ఏర్పాటు చేస్తాను. మేం ఫలానా రోజు శ్రీశైలం వెళ్తున్నాం, మీరు కూడా అక్కడికి వచ్చెయ్య మని వాళ్ళకు జాబు రాద్దాం" అన్నాడు రామకృష్ణ.

"భలే ఐడియా" నరేష్ ఎగిరి గంతేశాడు. లక్ష్మికి సంతోషం అయ్యింది. "అందరూ వచ్చేస్తార"ంది.

వెంటనే రామకృష్ణ లేచి క్యాలండర్ చూసి డేట్ ఫిక్స్ చేశాడు. ఆ డేట్‌కి శ్రీశైలం వెళ్తున్నట్టు కుమారయ్యకు తెలు పుతూ వాళ్ళను కూడా ఆరోజు అక్కడికి రమ్మని పొద్దున్న ఎనిమిది గంటలదాకా గుడి ముఖద్వారంవద్ద వాళ్ళకోసం వెయిట్ చేస్తుంటామని పొలెం లెటరు రాశాడు.

శీనయ్యనడిగి శ్రీశైలంలో కాటేజ్ వస తులు, భోజన విషయాలు చూడవలసిన ప్రదేశాలను గురించి తెల్సుకున్నాడు. బయ ల్దేరిపోయేరోజు రాత్రి సుమతి, సురేష్‌లు దగ్గరుండి బస్సెక్కించారు.

బస్సు పరుగులు తీస్తుంటే పిల్లలు హుషారుగా వున్నారు. అమ్మా వదినా, అన్నని కలుసుకోబోతున్నందుకు లక్ష్మికి సంతోషంగా వుంది. రామకృష్ణకి అదోలా వుంది.

'దిక్కులేనివాడికి దేవుడే దిక్కు' అని అనా లోచితంగా అనుకున్నాడు. ఆ మాట పదే పదే అతని మనసులో సుడులు తిరిగింది. కళ్ళల్లోంచి నీటిచుక్కలు బుగ్గలమీదకి దొర్లాయి. పెదాలు విషాదంగా నవ్వాయి. పాపం చేస్తే కష్టాలు పుణ్యం చేస్తే సుఖాలు ఉంటాయని కర్మ సిద్ధాంతం. ఆ సిద్ధాంతం మీదనే మన బతుకులు ఆధారపడి వున్నా యని నమ్ముతాం.

"ఓ భగవంతుడా నేనేం పాపం చేశా





నయ్యా, ఏ నేరం చేశానయ్యా, ఎవరినన్నా తిట్టానా? ఎవరినన్నా కొట్టానా? ఎవరి పొట్టన్నా కొట్టానా? అమ్మకి అడ్డం చెప్పానా? నాన్నకి అడ్డం చెప్పానా? అక్కా బావకి అడ్డం చెప్పానా? వాళ్ళు చెప్పినట్లు చదువుకి స్వస్తి చెప్పాను. గడ్డి మోపులు మోశాను, మేడిపట్టాను, ఎద్దులా పొలం దున్నాను. లక్ష్మి మటుకు ఏం చేసింది... వాళ్ళని ఎదిరించిందా... గొడ్డు చాకిరీ చేసింది. నాతో ఎండకి ఎండింది. వానకు తడిసింది. మోకాటిలోతు బురద మాగాణిలో నాట్లునాటింది, కలుపు తీసింది. పాపం తన్నులు తింది... ఎందుకు దేవుడా ఇంత ఘోరం చేశావు? మేం చేసిన పాపం ఏమిటి? మామీద ఎందుకింత కక్షగట్టావు? ఈ శిక్ష, ఈ మానసిక క్షోభ నాకెందుకయ్యా. అందరూ వుండి ఎవరూ లేనట్టు బతికే దిక్కులేని బతుకు నాకెందుకయ్యా? ఎవరిపట్లన్నా నేను అసభ్యంగా గానీ, అసహ్యంగాగానీ ప్రవర్తించివుంటే, క్షమించయ్యా. నన్ను క్షమించు" అంటూ రెండు చేతులతో చెంపలేసుకున్నాడు.

అలా చెంపలేసుకోవడం ఎవరన్నా చూశారేమోనని తల తిప్పి చూశాడు. అందరూ చీకట్లో నిద్రపోతున్నారు. లక్ష్మి తన భుజం మీదికి వాలి తూలుతుంటే 'పాపం నన్ను కట్టుకొని కష్టాల పాలయ్యింది' అనుకుంటూ ఆమె తలమీద చెయ్యివేసి దగ్గరకు తీసుకున్నాడు.

★ ★ ★

బ్రహ్మమురారి సురార్చిత లింగం
నిర్మల భాసిత శోభిత లింగం
జన్మజ దుఃఖవినాశక లింగం
తత్ప్రణమామి సదాశివలింగం...

తెల్లవారి బస్సు దిగుతూవుంటే శ్రీశైల క్షేత్రం మైకుల్లోంచి లింగాష్టకమ్ వినబడుతోంది.

చల్లని వాతావరణం.

నిర్మలంగా, ప్రశాంతంగా, పవిత్రంగా వుంది.

అక్కడ బస్సు దిగగానే సీనయ్య చెప్పినట్లు దేవస్థానం వారి కాటేజీ తీసుకుని అందులో లక్ష్మిని, పిల్లల్ని వుండమని చెప్పి కుమారయ్యా వాళ్ళకోసం గుడి దగ్గరకి వెళ్ళాడు రామకృష్ణ. ఆలయ ప్రాంగణానికి ముందున్న వీరభద్రస్వామి సమీపంలో వున్నారు వాళ్లు. రామకృష్ణ రావడంచూసి ఎదురొచ్చారు. అత్తనీ, కుమారయ్యనీ, మాధవిని, వాళ్ళపిల్లలు రాధికనీ, నటరాజుని చూడగానే రామకృష్ణకు మహా సంతోషం అయింది.

"ఎంతసేపయ్యింది బావా మీరొచ్చి" అనడిగాడు కుమారయ్యని.

"ఇంతకుముందే బావా. అరగంటయి వుంటుంది" కుమారయ్య చెప్తూవుంటే, "అమ్మాయీ, పిల్లలు ఏరిబాబూ" అనడిగింది శాంతమ్మ.

"కాటేజీలో వున్నారత్తయ్యా. మేమూ ఇప్పుడే వచ్చాం బస్సు దిగగానే కాటేజీ తీసుకుని అందులో వాళ్ళని వుండమని చెప్పి, నేనిటు మీకోసం వచ్చాను" అన్నాడు.

"బావున్నారా అన్నయ్యగారూ? " అనడిగింది మాధవి.

"ఆ... బావున్నానమ్మా" అంటూ రామకృష్ణ రాధికనీ, నటరాజుని దగ్గరకి తీసుకున్నాడు. అందరూ కలిసి కాటేజీ వైపుకు నడక సాగించారు. వాళ్ళు వస్తారని లక్ష్మీ, పిల్లలూ కాటేజీలోంచి బయటకు వచ్చి ఎదురుచూస్తున్నారు.

అప్పుడే రామకృష్ణ పక్కన కుమారయ్యా, వాళ్ళవెనక మాధవీ, శాంతమ్మ, పిల్లలూ రావడం చూసి లక్ష్మి తనను తాను మర్చిపోయింది. ఎక్కడలేని ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అవుతూ నిల్చున్నచోట వుండలేక పరుగున వెళ్ళి ముందుగా ఎదురైన మాధవిని "ఎన్నాళ్ళకు కనబడ్డావు ఒదినా" అంటూ ఆమెచుట్టూ చేతులుచుట్టేసి ఆనందం పట్టలేక ఏడ్చేసింది.

కుమారయ్య నరేష్‌నీ, శాంతమ్మ మహేష్‌ని దగ్గరకు తీసుకున్నారు.

లోపలికి వెళ్ళేవరకూ ఎవరినోటా మాటలు రాలేదు. నడిచే ఓపిక లేనట్లు ఆడవాళ్ళు ముగ్గురూ నీరసం వచ్చినవాళ్ళలా హాల్లో కిందనే కూలబడిపోయారు.

"నువ్వన్నా అప్పుడప్పుడు రావచ్చుకదమ్మా" అంటూ లక్ష్మి శాంతమ్మ మొహంలోకి చూసింది.

అప్పటిదాకా శాంతమ్మ పైటకొంగుతో కళ్ళొత్తుకుంటూనే వుంది.

"ఎందుకు రానమ్మా..." శాంతమ్మ అంటూవుంటే పిల్లలు నిన్ను గుర్తుచేసుకోని రోజేలేదు. నువ్వింట్లో వుంటే ఇంటినిండా తినడానికి వుంటాయంట. బజ్జీలూ, బోండాలూ, కొబ్బరి, బెల్లం...ఎప్పుడూ ఏదో ఒకటి తెచ్చిపెడుతుంటావనీ నేను తినడానికి పెట్టినప్పుడల్లా నిన్ను గురించి చెప్పుకునేవాళ్ళు పాపం" అని లక్ష్మి చెప్తూవుంటే, "ఓరి నాయనలారా" అంటూ శాంతమ్మ మహేష్‌ని, నరేష్‌ని దగ్గరకు తీసుకుని "నేనేం పెట్టానయ్యా మీకు" అని వాళ్ళని ముద్దాడి, "ఇప్పుడు మీకోసం ఏం తీసుకుని రాలేకపోయానయ్యా. అనుకోకుండా మీ జాబు అంది ఉత్తచేతులతో బయల్దేరి వచ్చామయ్యా" అంది.

"రేపు హైదరాబాద్ వెళ్ళిన తర్వాత అన్నీ చేసిపెడుదువుగానిలే అమ్మా" అంది లక్ష్మి.

వాళ్ళు మాట్లాడుకుంటుంటే రామకృష్ణ, కుమారయ్య కాలకృత్యాలు ముగించుకుని వచ్చారు. తర్వాత పిల్లలు, ఆడవాళ్ళు కూడా లేచారు. అందరూ మొహాలు కడుక్కుని, స్నానాలు చేసి వచ్చేసరికి తొమ్మిది గంటలయ్యింది. కాటేజీకి తాళంవేసి బయటకు వచ్చారు. దేవాలయం ముఖద్వారానికి ఎదురుగా వున్న రోడ్లోకి రాగానే "నాకు ఆకలేస్తోంది" అన్నాడు మహేష్.

"టిఫిన్ చేసి పోదాం బావా" రామకృష్ణ కుమారయ్యతో అంటూ అందరినీ అక్కడే దగ్గరలో ఉన్న హోటల్‌లోకి తీసుకుపోయారు. ఎవరికేం కావాలో ఇప్పించాడు. బిల్లు పే చెయ్యడానికి కుమారయ్య కౌంటర్ దగ్గర జేబులో చెయ్యి పెట్టబోతే రామకృష్ణ వారించి తనే బిల్లు కట్టాడు. అందుకు కుమారయ్య నొచ్చుకుంటూ బయటకు వచ్చి ఏదో అనబోతుంటే, "నువ్వేం ఖర్చు పెట్టొద్దు బావా. నా దగ్గర డబ్బులున్నాయి" అన్నాడు రామకృష్ణ.

"నేనూ తెచ్చానులే బావా"

"అయితే మాన్లే బావా" రామకృష్ణ అంటుంటే వెనకనుండి నరేష్ వచ్చి చెయ్యి పట్టుకుని, "నాన్నా! రాతి బసవయ్యని చూపాలి" అని అన్నాడు.

"మనమిప్పుడు గుడిలోకి పోతున్నాం కదరా చూపిస్తాను" రామకృష్ణ చెప్తుంటే అప్పుడే అక్కడికి వచ్చిన లక్ష్మి మాధవితో, "టేప్ రికార్డర్‌లో బ్రహ్మంగారి కాలజ్ఞానం క్యాసెట్ బాగా విన్నాడొదినా. అందులో 'రాతిబసవయ్య కాలుదువ్వి రంకేసేను, పాతాళ గంగమ్మ పైకిలేచేను, మల్లికార్జున స్వామి పాదాలు కడిగేను' అనివుంది. అందుకని ఆ రాతి బసవయ్యని, పాతాళగంగనీ చూపించమని ఒకటే గొడవ" అని చెప్పింది.

వెంటనే శాంతమ్మ, "అంతే గదటే" అంటూ చెయ్యెత్తి కనబడుతున్న గోపురాన్ని చూపుతూ, "ఆ గోపురం దాటి లోపలకు అడుగుపెట్టగానే కనబడుతుంది నంది" అన ఆమె చెప్తూ వుంటే "నీకు తెలుసా అమ్మమ్మా" అంటూ నరేష్ రామకృష్ణ చెయ్యి వదిలిపెట్టి శాంతమ్మ దగ్గరకి వచ్చి "అమ్మమ్మా నువ్వింతకుముందు ఎప్పుడన్నా వచ్చావా" అనడిగాడు.

"ఆ... వచ్చానమ్మా. ఇరవై ఏళ్లకిందట చెప్పింది శాంతమ్మ.

"అయితే పాతాళగంగ చూశావుగా"

"ఆ... చూశాను. అక్కడ నీళ్ళల్లో స్నానం కూడా చేశాను"





"నాకూ చూపించాలి"

"రెండ్రోజులుంటాంగా... అన్నీ చూద్దాం"

నరేష్ శాంతమ్మ చెయ్యి పట్టుకుని నడవసాగాడు. రామకృష్ణ కొబ్బరికాయలు, పూలు, అగరొత్తులు కొన్నాడు. ఆలయం లోపలికి అడుగు పెట్టగానే శాంతమ్మ "అదుగోరా నంది" అంటూ ఎదురుగా కనిపిస్తున్న నందిని చూపించింది.

ఆనందం అయ్యింది నరేష్‌కి. దగ్గరగా పోయి చూడాలని పోబోతుంటే "మనం దేవుణ్ణి దర్శనం చేసుకుని అటే వస్తాంలే. చూద్దువుగాని" అని వారించింది శాంతమ్మ. దానిగురించి ఆలోచిస్తూనే ముందుకి కదిలాడు నరేష్. గర్భగుడిలో అందరూ లింగాకారాన్ని చేతులతో పట్టుకుని తల వంచి మొక్కుతుంటే మహేష్ మనసుని ఏదో అనుమానం తొలిచింది. యాంత్రికంగా మిగతా వాళ్ళలా లింగాకారానికి తల ఆనించి మొక్కుకున్నాడు. అమ్మవారి దర్శనం కూడా చేసుకుని బయటకు వచ్చిన తరువాత నంది దగ్గరకు వచ్చారు.

నల్లనిరాతితో చెక్కిన రూపం అది. అందంగా మోకాళ్ళు ముడిచి శివుడి ఆజ్ఞకోసం చెవులు రిక్కించి చూస్తున్నట్లుగా మోర పైకెత్తి అటుకేసి చూస్తూవుంది.

★ ★ ★

అక్కడనుంచి వాళ్ళు కాటేజీకి వచ్చేసరికి మూడు గంటలయ్యింది. వచ్చీరావడంతోటే పిల్లలు నిద్రలోకి జారుకున్నారు. రామకృష్ణ కుమారయ్యలు కూడా పడుకున్నారు. ఆడవాళ్ళు ముగ్గురూ బయటకు వచ్చి ఆ మాటా, ఈ మాటా మాట్లాడుకుంటూ ఎన్నో సంగతులు చెప్పుకున్నారు. శేషగిరి మాస్టారిని గుర్తు చేసుకున్నప్పుడు, "స్వాతికి పెళ్ళయ్యిందట. మీకు తెలుసా? " అని శాంతమ్మ అడిగింది లక్ష్మిని.

"తెలుసమ్మా. మాకన్నీ తెలుసు. ఎవరో ఒకరు ఆయనకి కనబడి చెప్తుంటారు. ఒకసారి పోతురాజు పెద్దకొడుకు ఇంటికి కూడా వచ్చి పోయాడు. స్వాతి పెద్దమనిషి కావడం, లక్షా పాతికవేలు కట్నం ఇచ్చి పెళ్ళిచెయ్యడం కూడా తెలుసు" చెప్పింది లక్ష్మి.

"అయితే పెళ్ళికి పిలవలేదా... లేక పిలిస్తే మీరే రాలేదా" అడిగింది మాధవి.

"పిలవలా... పిల్చినా వచ్చేది లేదులే..." లక్ష్మి చెప్తూవుంటే, "ఏం మనుషులో? ఏందో? " అంది శాంతమ్మ.

"సరేలే... ఆ విషయాలేవీ ఆయనతో మాట్లాడకండి" అంటూ రామకృష్ణకి వాళ్ళ అమ్మానాన్నా పట్ల వున్న కోపాన్ని తెలుపుతూ "వదినా... అన్నయ్యకి కూడా కాస్త చెప్పు. శాఖవరం విషయాలేవీ ఆయనతో ప్రస్తావించవద్దని" అంది మాధవితో.

ఆ రాత్రి సందడి సందడిగా గడిచిపోయింది. చూడవలసినవన్నీ చూశారు.

తిరుగు ప్రయాణంలో బస్సు కొండమీది నుంచి కిందికి దూసుకొనిపోతూవుంటే అతని మనసుకి హాయిగావుంది. అనుకోకుండా వచ్చి దైవసన్నిధిలో మూడురోజులు గడపడం అదృష్టమే-అంతా ఆ మహానుభావుడి చలువే. ఆయనే లేకుంటే తనెక్కడ వుండేవాడో, ఎలా వుండేవాడో శేషగిరి మాస్టారుని గుర్తుచేసుకుని ఆయనికి జాబు రాయాలి అని అనుకుంటూ నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★

భూదేవమ్మ తెగ బాధపడిపోతూ వుంది. ఆసుపత్రిలో ఆమె పడుతున్న బాధ వర్ణనాతీతం.

స్వాతికి నెప్పులొస్తున్నాయని రాత్రి చక్రవర్తి శాఖవరంపోయి భూదేవమ్మకు చెప్పాడు. ఆ వార్త వినడంతోటే ఆమె బయల్దేరి కందుకూరువచ్చి స్వాతిని ఆస్పత్రిలో చేర్పించింది.

తొలి కాన్పు కాస్త లేటవుతుందని డాక్టరమ్మ చెప్పినా భూదేవమ్మకి మనసు నిలవలేదు. స్వాతికి ధైర్యం చెప్పాల్సిందిపోయి నొప్పులతో ఆమె బాధపడుతున్నప్పుడల్లా తను విలవిల్లాడిపోయింది. ఆ బాధను చూడలేకపోయారు నర్సులు. భూదేవమ్మను



బయటకు పంపించి కాన్పుచేశారు.

మగబిడ్డ పుట్టాడు.

భూదేవమ్మ ఆనందానికి అంతులేకుండా వుంది. పెద్దమ్మా, పెద్దమ్మా అంటూ చక్రవర్తి చక్కెర తెచ్చి ఆమెనోట్లో పోసి పొగడ్తలతో ముంచెత్తాడు.

"నీకు జ్యోతిషం తెలుసా ఏంది పెద్దమ్మా... నువ్వన్నట్లు మగబిడ్డే పుట్టాడు" అంది రోహిణి.

"పాపం చానా కష్టపడ్డది" భూదేవమ్మ సంతోషాన్ని అనుభవిస్తూనే కాన్పు సమయంలో స్వాతి పడ్డ బాధని గుర్తుచేసుకుంది.

"అవునక్కా, డాక్టరమ్మ చాలామంచిది. బాగా ఓర్చుకోబట్టి సరిపోయింది. లేకపోతే ఆపరేషన్ అంటేనా... ఎంత ఖర్చయ్యేదో..." సరోజనమ్మ అంటూవుంటే భూదేవమ్మ అడ్డొచ్చింది.

"ఖర్చుదేముందిలే... ముందది క్షేమంగా వుంది. అదే చాలు" అంది.

ఆస్పత్రినుంచి స్వాతి డిశ్చార్జి కాగానే రాఘవయ్య బిల్లుకట్టేసి శాఖవరం తీసుకొచ్చాడు. బారసాల రోజుకి బంగారంతో పులిగోరు చైను, మురుగులు చేయించారు. వెండి మొలతాడు, మువ్వల పట్టీలు తెప్పించారు. చక్రవర్తికి మహాసంతోషం అయింది. నామకరణం సమయంలో పెద్దమ్మా, పెదనాయన బాబుకి పేరు పెట్టాలని పట్టుబట్టాడు. చక్రవర్తి అలా వాళ్ళకి పెద్దరికాన్ని ఇవ్వడంతో భూదేవమ్మ, రాఘవయ్యలో కాస్త గర్వం తొంగిచూసింది. బాబుకి సాయి శంకరం అని పేరుపెట్టి ముద్దాడారు.

నెల వెళ్లిపోయేటప్పుడు తల్లీబిడ్డని కందుకూరు పంపమని చక్రవర్తి తల్లి చెప్పినా భూదేవమ్మ మూడోనెల వెళ్ళిపోయేటపుడు పంపిస్తామనే చెప్పి, ఆ ప్రకారం చీరె, సారెలతో తనే తీసుకొని పోయింది. రెండురోజులు అక్కడవుండి మూడోరోజు తిరుగు ప్రయాణం అవుతూవుంటే మనసు అదోలా అయింది. ఈ మూడు నెలలుగా స్వాతి మీద వున్న ప్రేమంతా సాయిశంకరంతో పెనవేసుకుపోయింది. వాడిని వదిలిపోవడం కష్టంగా వుంది.

"వారానికి ఒకసారైనా తీసుకొచ్చి చూపిస్తుండయ్యా" అంటూ చక్రవర్తికి చెప్పింది.

"అదేమిటి పెద్దమ్మా నువ్వు ఇక్కడే వుండు" అన్నాడు చక్రవర్తి.

చక్రవర్తి అలా అనడంతో భూదేవమ్మ చాలా సంతోషపడింది. "తొందరగా వాణికి కూడా సంబంధం చూడయ్యా" అంది.

"మంచి సంబంధంకోసం చూస్తున్నాను పెద్దమ్మా, ఉద్యోగస్తుడికివ్వాలని అనుకున్నాంగా"

"అదేనయ్యా... ఆ పని నీవల్లనే కావాలి. మీ పెదనాయనవల్లకాదు"

భూదేవమ్మ అలా అంటూవుంటే చక్రవర్తి ఆ ఇంటికి తనే దిక్కు అన్నట్లు ఫీలయ్యాడు. బస్టాండుకు పోయి ఆమెని బస్సెక్కించి వచ్చేసరికి రోహిణికి పెళ్ళిసంబంధం గురించి వచ్చి వున్నారు. అబ్బాయికి బ్యాంకులో ఉద్యోగం. పొడుగూ, రంగూ, మనిషి అందగాడే. రోహిణిని ఇష్టపడ్డాడు. కట్నకానుకలు మాట్లాడుకోవడం, ముహూర్తాలు పెట్టుకోవడం, నెలరోజులలో పెళ్ళి అయి రోహిణి అత్తగారింటికి వెళ్ళడం, ఏ ఆటంకమూ లేకుండా జరిగిపోయింది. అందరూ చక్రవర్తికి కొడుకు పుట్టిన వేళావిశేషం అన్నారు.

అది నిజమే అనిపించింది చక్రవర్తికి. కొడుకు పుట్టినప్పటినుంచే తనచేతినిండా డబ్బు మెదులుతోంది. రావనుకున్న మొండిబాకీలు రెండూ వడ్డీతోసహా వసూలయ్యాయి. మనసంతా హుషారుగా వుంది. చిన్న బండి తీసుకుంటే బావుండుననుకున్నాడు. స్వాతికి చెప్పాడు. ఆ విషయం భూదేవమ్మ వచ్చినప్పుడు ఆమెకి చెప్పింది స్వాతి.

"తీసుకుంటే మంచిబండే తీసుకో అయ్యా" అంది భూదేవమ్మ.

"చాలా అవుతుంది" అన్నాడు చక్రవర్తి నవ్వి





గినట్లుగా.

"మీ పెదనాయనకి చెప్తాలే, ఇస్తాడు"

చక్రవర్తి మనసుకి రెక్కలొచ్చాయి. విహంగమై గగనంలోకి ఎగిరిపోయింది. సరిగ్గా పదిహేనవరోజుకి హీరో హోండా కొన్నాడు. బండికి నిమ్మకాయలు కట్టుకుని స్వాతిని, కొడుకునీ ఎక్కించుకొని శాఖవరం వచ్చాడు. కొత్త హోండాని చూడగానే భూదేవమ్మకి సంతోషం, కాస్త గర్వం అయింది. ఇంటికి కొత్త కళ వచ్చినట్టుగా వుంది పార్వతికి. రాఘవయ్య స్వాతి చేతిలోంచి బాబును అందుకుంటూ "ఇంక బస్సుకోసం ఎదురు చూడపనిలేదు. ఎప్పుడైనా రావచ్చు" అన్నాడు.

శివరామయ్య బండిమీద చెయ్యివేసి తడుముతూ వుంటే చక్రవర్తి దాన్ని గురించి వివరాలు చెప్పడం మొదలెట్టాడు. రాఘవయ్య చేతిలోంచి మునిమనవడిని భూదేవమ్మ అందుకుని ముద్దులు పెడుతూ వుంటే పార్వతి వచ్చి వాడిని తన చేతుల్లోకి తీసుకుంది.

"వాణికి సంబంధం చూశాను పెద్దమ్మా... అబ్బాయి హైస్కూలు టీచర్‌గా పనిచేస్తున్నాడు" అని చెప్పాడు చక్రవర్తి భూదేవమ్మతో.

అది అందరికీ శ్రవణానందం అయింది. ఆ సంబంధం గురించి వివరాలు అడిగారు.

అబ్బాయి పేరు కిరణ్‌కుమార్. వాళ్ళది ఒంగోలు. ఇద్దరు అన్నదమ్ములు. ఇతనే పెద్దవాడు. ఉద్యోగం కూడా ఈమధ్యనే వచ్చిందట. అక్కాచెల్లెళ్ళులేరు. వాళ్ళనాన్నకి ఏదో గవర్నమెంట్ ఆఫీసులో ఉద్యోగమంట. ఒకసారి మనంపోయి అబ్బాయిని చూస్తే వాళ్ళొచ్చి వాణిని చూస్తామన్నారు" అని చక్రవర్తి చెప్తూవుంటే "మేం ఎందుకయ్యా చూసేది. నువ్వు చూశావుగా అబ్బాయికి ఉద్యోగం వుందంటున్నావు. నీకు నచ్చితే మాకు నచ్చినట్టేగా" అంది భూదేవమ్మ.

"అలా కాదులే పెద్దమ్మా..." చక్రవర్తి ఏదో అనబోతుంటే "నువ్వూ, మీ పెదనాయన పోయి చూసిరండి" అని చెప్పింది భూదేవమ్మ.

చక్రవర్తి ఆలోచించి "సరే" అన్నాడు. మంచిరోజు చూసుకుని రాఘవయ్య, చక్రవర్తి ఒంగోలుపోయి అబ్బాయిని చూసివచ్చారు. తర్వాత అబ్బాయి వాళ్ళు రావడం, వాణిని చూడడం, వాళ్ళు అడిగినంత కట్నం ఇవ్వడానికి రాఘవయ్య ఇష్టపడడం, చక్రవర్తి నేతృత్వంలో పెళ్ళి జరిగిపోయింది.

★ ★ ★

రాఘవయ్యకీ, భూదేవమ్మకీ చాలా సంతోషంగా వుంది. సాయిశంకరాన్ని తమ దగ్గరే వుంచుకున్నారు. వాడిని చూసిపోవడానికని చక్రవర్తి, స్వాతి రెండ్రోజులకొకసారి హోండా మీద వచ్చిపోతున్నారు. అది చాలా గర్వంగా వుంది భూదేవమ్మా వాళ్ళకి.

వాణి పెళ్ళి అయ్యి కిరణ్‌కుమార్‌తో వెళ్ళిపోయిన తరువాత తిరిగి శాఖవరం రాలేదు. ఆమెకి అమ్మా, నాన్నా అన్నా, తాతా, అమ్మమ్మా అన్నా గౌరవం లేదు. వాళ్ళు రామకృష్ణకి చేసిన అన్యాయాన్ని గురించి వూళ్ళో చెప్పుకోవడం వూహ తెలిసినప్పటి నుండి వినడంతో వాళ్ళ పట్ల తనకున్న సదభిప్రాయం కాస్తా పోయింది. చక్రవర్తి అంటే ఒళ్ళుమంట. సొమ్ములాగడంకోసం అతను అమ్మమ్మనూ, తాతయ్యనూ తియ్యని మాటలతో బుట్టలో వేసుకున్నాడని కోపం. ఆ విషయాలేవీ భర్తకి చెప్పకూడదనుకుంటూనే మనసులో దాచుకోలేకపోయింది. అప్పుడప్పుడూ సందర్భాన్ని బట్టి అంతా చెప్పేసింది. వూరి నుంచి అమ్మా, నాన్నగానీ, అమ్మమ్మా, తాతయ్యగానీ వస్తే స్వాతిలా ఎగిరి గంతేసేది కాదు. బంధువులు వస్తే మర్యాద చేసినట్లే. వూరికి రమ్మని వాళ్ళు పిలిస్తే "ఇప్పుడుకాదు తర్వాత వస్తాలే" అనిచెప్పి పంపేసేది. ఇంట్లో ఫోనుంది. చక్రవర్తివాళ్ళు ఎప్పుడన్నా కందుకూరునుంచి ఫోనుచేస్తే పెద్దగా ఇష్టం చూపేదికాదు. ఆమె ప్రవర్తన రాఘవయ్య

వాళ్లకి కాస్త కష్టంగానే వుంది. ఊరికి పిలిస్తే రాదు. ఏం కావాలో అడగదు, ఏదన్నా ఇస్తే తీసుకోదు. అందుకు కారణం తెలియక వాళ్ళు 'దాని మొగుడు ఉద్యోగస్థుడని గర్వంలే' అని అనుకున్నారు.

నెల తప్పిందని తెలిసి రెండ్రోజులుండి వద్దువుగాని రమ్మని పోయి రాఘవయ్య, భూదేవమ్మలు పిలిస్తే రాలేదు. అందుకని కావలసిన పండ్లు కొనుక్కోడానికని భూదేవమ్మ డబ్బులివ్వబోతే "నాకేం అఖర్లేదు. మా అత్తగారు నాకేలోటూ చెయ్యడంలేదు" అని నిరాకరించింది వాణి. చివుక్కుమంది భూదేవమ్మకి. రాఘవయ్య బతిమాలాడు. వాణి ససేమిరా అంది.

"దాని మనసులో ఏదో కొరవపెట్టుకుంది" అన్నాడు రాఘవయ్య ఇంటికి వచ్చిన తర్వాత.

"అది మొదట్నించీ అంతేలే. పెడసరపుది" అంది పార్వతి.

ఇంట్లో వాణి విషయమై వాళ్ళు చర్చించుకుంటూవుంటే శివరామయ్య తనకేమీ పట్టదన్నట్టు గిన్నెడు గడ్డపెరుగుతో కంచంనిండా అన్నం కలుపుకుని ఆవకాయతో తినేసివచ్చి పంచలో మంచంవాల్చుకుని వెల్లకిలా పడుకున్నాడు. అయిదు నిముషాల్లో ఆవలించి నిద్రలోకి జారుకున్నాడు.

★ ★ ★

ఆ రాత్రి చాలాసేపు నిద్రపట్టలేదు రామకృష్ణకి. ఎప్పుడో పొద్దుపోయి నిద్రలోకి జారుకుంటే వేకువఝామున శేషగిరి మాస్టారు వచ్చినట్లు కలొచ్చింది. ఆ కల గురించి లక్ష్మికి చెప్పాడు.

"వేకువఝామున వచ్చిన కల నిజం అవుతుంది. తొందర్లో బాబాయిగారు వస్తారు" అంది లక్ష్మి.

రామకృష్ణకి హుషారయ్యింది. శేషగిరి మాస్టారిని తలచుకుంటూ స్కూటర్ స్టార్ట్‌చేసుకుని కంప్యూటర్ ఇన్‌స్టిట్యూట్‌కి బయల్దేరాడు. మధ్యలో 'ఇల్లు కట్టుకుంటే బావుండు' అనిపించింది. ఆ విషయమై ఆరోజంతా ఆలోచించాడు. సాయంకాలం సురేష్‌తో అన్నాడు.

"నేనామాట ఎప్పుడో చెప్పాను. అనవసరమైన హంగామాలేవీ లేకుండా సింపుల్‌గా కట్టుకుంటే బావుంటుంది" అని చెప్పాడు సురేష్.

"అదేదో నాకు తెలియదు. నువ్వే చూడాలి"

"తప్పకుండా"

మరుసటిరోజే మోహన్‌రావుగారికి తెలిసిన వాస్తు సిద్ధాంతికి ప్లాట్ చూపించి హాలు, వరండా, కిచెన్ కమ్ డైనింగ్, బెడ్‌రూమ్, గెస్ట్‌రూమ్, టాయ్‌లెట్స్ వుండేట్లు ప్లాన్ గీయించారు.

ఆ విషయాన్ని శేషగిరి మాస్టారికి తెలియపరుస్తూ రామకృష్ణ 'ఇల్లు కట్టుకోవాలనుకుంటున్నాను మాస్టారూ. మీ ఆశీస్సులు కావాలి. మీరొచ్చి దగ్గరుండి శంఖుస్థాపన చేయించాలి' అంటూ లెటర్ రాశాడు.

అందుకు శేషగిరి మాస్టారు సంతోషంతో 'అక్కడ పెద్దవారు, మోహనరావు బావగారు వున్నారు. ఆయన నేతృత్వంలో ఆ శుభకార్యం జరిపించు. నేను గృహప్రవేశం రోజుకి వస్తాను' అని తిరుగు జాబు రాశాడు.

నీరసం వచ్చేసింది రామకృష్ణకి. సరిపెట్టుకుని...

సిద్ధాంతి చేత శంకుస్థాపనకు అవసరమయ్యే సామగ్రి లిస్టు రాయించుకుని తెచ్చాడు. ప్లాట్లో షామియానా కట్టించి కుర్చీలు వేయించాడు. మోహన్‌రావు, వర్ధనమ్మ, సురేష్, సుమతి, నారాయణయ్య, శ్రీకాంతమ్మ, పిలిచిన ఆఫీస్ స్టాఫ్ అంతా వచ్చారు. మోహన్‌రావుగారి నేతృత్వంలో సిద్ధాంతి శాస్త్రోక్తంగా లక్ష్మి, రామకృష్ణలచేత అనుకున్న ముహూర్తానికి శంకుస్థాపన చేయించి అక్షింతలు చల్లాడు. తర్వాత అందరికీ వడపప్పు, పానకం పంచారు. బేల్దారు మేస్త్రి సూచన మేరకు పనివాళ్ళు పిల్లర్స్‌కని




గుర్తించిన స్థలంలో గుంటలు తీయడం మొదలుపెట్టారు.

★ ★ ★

రాఘవయ్యగారి ఇల్లు సందడిసందడిగా వుంది.

వాణికి తొమ్మిదోనెల వచ్చిందని సీమంతం చెయ్యడానికి తీసుకుని వచ్చారు. పెళ్ళి అయ్యి అత్తగారింటికి వెళ్ళిపోయిన తర్వాత ఆమె తిరిగి రావడం అదేకావడంతో అత్తింటి విశేషాలు అడుగుతూవుంటే వాణికి హుషారుగా వుంది.

"అవునూ పెళ్ళిచేసుకుని పోవడం, పోవడం రాలేదేమిటీ" అని ఎవరో అడిగితే "రాబుద్ధి కాలా మా అత్తగారు చాలామంచిది" అని రపీమని చెప్పింది.

ఆ పక్కనేవున్న భూదేవమ్మకి ఆ మాటలు వినబడి వంటిమీద చీమలు పాకినట్టుగా అయింది. పార్వతికేసి చూసి మూతి మూడు వంకరలు తిప్పింది.

"నేనసలు ఇప్పుడు కూడా వచ్చేదాన్నికాదు. మా తాతయ్య, అమ్మమ్మా బాధపడుతుంటేనూ చూడలేక మా అత్తగారే 'వాళ్ళ ముచ్చట కాదనకూడదమ్మా' అని నన్ను ప్రయాణం చేయించి పంపింది" అంటూఅత్తామామల అభిమానాన్ని, భర్త అనురాగాన్ని, మరిది ఇచ్చే గౌరవాన్ని గొప్పగా చెప్పింది.

"అత్త మంచిదంటున్నావు. అదృష్టవంతురాలివే" అన్నారు.

"అవును. నాకొక్కపనీ చెప్పదు. నేనేదన్నా చేస్తూవుంటే తనూ వచ్చి కలుస్తుంది" అని వాణి చెప్తూవుంటే వీధివాకిట్లోంచి

పోతురాజు భార్య వచ్చింది. 'మనవరాలిని తీసుకొచ్చావంటగా' అని భూదేవమ్మని అడుగుతూ.

"అవునొదినా... రా" భూదేవమ్మ నాగేశ్వరమ్మని ఆహ్వానించింది.

"ఏమ్మా వాణీ... ఊరు బొత్తిగా మర్చిపోయావుగా" అంటూ నాగేశ్వరమ్మ వాణి దగ్గరికి పోయింది.

ఆమెను చూసి చిరునవ్వు నవ్వింది వాణి అవుననన్నట్లుగా.

"అబ్బాయి కూడా వచ్చాడా? "

"రాలేదు... రాత్రికి వస్తారు" వాణి చెప్తూంటే, "దీని పట్టు ఏంటో అర్ధంకావడంలేదత్తా. పెళ్ళి అయ్యి పోవడం పోవడం ఇప్పుడొచ్చింది అదీ బలవంతం చేస్తే. ఎవరన్నా ఇంతకాలం వుంటారా. పెళ్ళైన కొత్తలో నెలకు రెండుసార్లయినా వచ్చిపోతుంటారు గానీ..." అని పార్వతి వచ్చి అంది.

"ఇక్కడేముందేమిటి రావడానికి" వాణి తీసిపారేసినట్టుగా అంది.

"అదేమిటీ అట్లా అంటావు. అమ్మానాన్నా, తాత, అమ్మమ్మా అందరూ ఇక్కడుంటేనూ..." అంది నాగేశ్వరమ్మ.

"అయితే మటుకు నేనూ ఇక్కడే వుండాలా ఏంటి? "

"ఇట్లా వుంటాయత్తా దీనిమాటలు" విసుక్కుంది పార్వతి.

"సరేలే... పోనీయవే, అది చిన్నది దానికేం తెలుసు" నాగేశ్వరమ్మ సర్దిచెప్తూ, "ఇంతకీ చీర ఎంతలో తెచ్చారేంటి" అని అడిగింది.

పార్వతి వెళ్ళి పెట్టెలోంచి పట్టుచీర, దానిమీద జాకెట్టూ తెచ్చి చూపించింది.

"బావుంది" అంది నాగేశ్వరమ్మ.

ఆమాటా ఈమాటా మాట్లాడుతూ పది నిమిషాలుండి పోతుంటే "మీరింకా మాగాడిలో కలుపులు తీయించినట్టు లేదే" అని అడిగింది భూదేవమ్మ.

"లేదొదినా, రేపో ఎల్లుండో తీయించాల. ఆయనకీమధ్య బావుండడంలేదు" నాగేశ్వరమ్మ చెప్తూవుంటే, "ఆ అడగడం మరిచిపోయాను. ఏందంట, ఏం జబ్బంట? " అని అడిగింది భూదేవమ్మ.

"కడుపునొప్పి... డాక్టర్‌కి చూపించుకుని మందులు వాడుతున్నాడు" అని పోతూ పోతూ "పెందలాడే పేరంటం చెప్పి ఆ కార్యం పూర్తిచెయ్యండి" అంటూ చెప్పింది.

ఆమె వెళ్ళిపోగానే భూదేవమ్మ సాయిశం కరాన్ని తీసుకుని ఇంట్లోకిపోయింది. పార్వతి వంటపనిలో వుంది. రాణి ఆమెకి సహాయపడుతూ ఇంట్లోకీ, బయటకీ తిరుగుతూవుంది. వాణికి ఆ వాతావరణం నచ్చడంలేదు. ఒంటరితనం ఫీలవుతూ చీక టిపడితే బావుండు అనుకుంటూ వుంది.

అయిదు గంటలవుతుండగా హోండా మీద స్వాతీ, చక్రవర్తీ వచ్చారు. బండి శబ్దం వింటూనే సాయిశంకరం పరిగెత్తు కుంటూ వచ్చాడు. స్వాతి వాడినెత్తుకుని రాణి దగ్గరికి వస్తూంటే ఆ వెనకనే చక్రవర్తి బండి స్టాండ్‌వేసి, "ఏమండీ బావున్నారా. ఏమిటి సంగతులు" అంటూ వచ్చి పలకరిం చాడు.

వాణికి మండింది... చక్రవర్తి 'ఏవండీ' అని సంబోధించడంతో. బయట పడకుండా తమాయించుకుని "ఆ" అంది. సాయిశంకరం బండిమీద తిప్పమని స్వాతి చేతుల్లోంచి దిగి చక్రవర్తి చెయ్యి పట్టుకు న్నాడు.

"నీకు బండి చూస్తే కాళ్ళు నిలవవుగా... రా" అంటూ చక్రవర్తి వాడిని బండిమీద కూర్చోపెట్టుకుని ఆ వీధి చివరిదాకా పోయి వచ్చాడు.

చీకటిపడి ఊళ్ళో పేరంటం చెప్పి వచ్చే లోపు వాణికి పూలజడ అల్లింది భూదే వమ్మ. చక్రవర్తి స్వీటూ, హాటూ కవర్లలో వేసి ప్యాకెట్లు కట్టాడు.

ఎనిమిది గంటల బస్సులో కిరణ్‌కుమార్ వచ్చేసరికి ఫంక్షన్ మొదలయ్యింది. పట్టు చీరె కట్టుకుని కుర్చీలో కూర్చుని వుంది వాణి. మోచేతులదాకా గాజులు, మెడలో రాళ్ళనెక్లెస్ నిండుగా కనిపిస్తోంది. ఆమెకి ఎదురుగా ఆడవాళ్ళు చాపలమీద కూర్చుని పందిరి కళకళలాడుతోంది. అటుపక్కగా వేపచెట్టుకింద మంచాలమీద శివరామయ్యా, రాఘవయ్యా కూర్చుని వున్నారు. కెమేరా పట్టుకుని ఫొటోలు తీస్తున్నాడు చక్రవర్తి. కిరణ్‌కుమార్ రావడంచూసి "హాయ్" అంటూ విష్ చేశాడు.

"అమ్మా! చిన బావ వచ్చాడు" అని రాణి పార్వతితో చెప్పి పోయి వాణి చెవిలో చెప్పింది. వాణి మొహం విరిసిన కమలం అయ్యింది. తల తిప్పి తనని చూస్తున్న కిర ణ్‌కుమార్‌ని చూడగానే ఆమె పెదాలు విచ్చుకున్నాయి.

పార్వతి గబగబా పోయి కిరణ్‌కుమార్‌కి మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. అతను తాగేసి దొడ్లోకి పోయి మొహం కడుక్కుని వచ్చాడు.

పాటల కార్యక్రమం జరుగుతూవుంది. ఎవరో 'గంధము పూయరుగా' అనే త్యాగ రాజకృతి పాడుతూ పాడుతూ గుర్తురాక సగంలో ఆపేసింది. మిగిలినవాళ్ళు నువ్వు పాడు, నువ్వు పాడు అని ఒకరిమీద ఒకరు అనుకుంటుంటే "అయ్యవారమ్మ వుంటేనా..." అన్నారెవరో. అందుకు ఇంకొ కరు, "ఆమెని వీళ్ళు పిలవరుగా" అన్నారు. అంతలోనే వాళ్ళమధ్య శేషగిరి మాష్టారి ప్రస్తావన, రామకృష్ణ ప్రస్తావన రావడం వాణి చెవులు విన్నాయి. అంతదాకా సంతో షాన్ని అనుభవిస్తున్న ఆమె వాళ్ళముందు తను దోషిగా కూర్చున్నట్లు అనీజీగా ఫీల య్యింది. ఆ విషయం వాళ్ళు మంగళహా రతి పాడి తాంబూలం తీసుకుని లేచి పోయేటప్పుడు కూడా గుసగుసలు చెప్పుకో వడం వాణికి పట్టరాని కోపాన్ని తెప్పిం చింది. తను కట్టుకున్న పట్టుచీర అమ్మా నాన్నా కష్టపడి సంపాయించిన డబ్బుతో కొన్నది కాదు. 'అందరూ కలిసి మావయ్య మొహాన మట్టికొట్టారు' అనుకుని విసవిసా ఇంట్లోకి పోయి వంటిమీదినుంచి చీర పీకె య్యిబోయి,

"అక్కా! బావతో కలిసి ఫొటో తీయించు కోవాలట రా" అంటూ రాణి వచ్చి పిలవ డంతో యాంత్రికంగా పోయి కిరణ్‌కుమార్ పక్కన చిరునవ్వుతో నిలబడింది.

ఎన్ని ఫోటోలు తీశాడో చక్రవర్తి. పొద్దు పోయేవరకూ అదేపని.



మరుసటిరోజు కిరణ్‌కుమార్‌తో వాణి కూడా బయల్దేరి వెళ్ళిపోయింది.

ఆమె అలా వెళ్ళిపోవడం ఇంట్లో ఎవరికీ ఇష్టంలేదు. ప్రయాణం అవుతున్నప్పుడు స్వాతి, చక్రవర్తి వారించారు. వాణి వినలేదు. అమ్మమ్మా, తాతయ్యా బతిమిలాడారు. ఊహూ... పార్వతి కోప్పడింది. దాంతో వాణికి తిక్కరేగి మాటకిమాట సమాధానం చెప్తూ పరోక్షంగా లక్ష్మిని, రామకృష్ణని గుర్తు చేసింది. భూదేవమ్మకి ఏడుపు వచ్చింది. కళ్ళు తుడుచుకుంటూనే వాణిని సాగనంపింది.

"నీకెందుకూ వాళ్ళతో వాదం. ఉండడం ఇష్టం లేకుంటే వచ్చేయాలిగానీ" అన్నాడు కిరణ్‌కుమార్ వాణితో బస్సులో కూర్చున్న తర్వాత.

వెంటనే వాణి తల తిప్పి కిరణ్‌కుమార్‌కేసి చూసింది. అతని మొహంలో అసహనం కనిపించింది.

"నన్ను చెడుగా అర్థం చేసుకోకండి" అభ్యర్థిస్తున్నట్టుగా అంది వాణి. కిరణ్‌కుమార్ క్షణం ఖిన్నుడయ్యాడు. ఇంటిదగ్గర వాదులాడిన వాణి, తన పక్కనున్న వాణి ఒకటేనా అనే సంశయం కలిగింది. ఆ క్షణంలోనే ఆమెపట్ల వున్న అసహనం అంతా నీరుకారి పోయింది. వాణికి దగ్గరగా జరిగి కూర్చున్నాడు.

"నాకూ మనసుందండీ..." వాణి ఏదో అనబోతుంటే, "సరేలే ఆ విషయం వదిలెయ్" అని కిరణ్‌కుమార్ వారించాడు.

అయినా వాణి మనసు కుదుటపడలేదు. అనీజీగానే ప్రయాణంచేసింది.

ఆ రాత్రి బెడ్ రూంలో వున్నప్పుడు "ఆడవాళ్ళకి ఆడవాళ్ళే శత్రువులండీ. నేను కళ్ళారా చూశాను. అంతా నా కళ్ళముందే జరిగింది. మా అమ్మ, మా అమ్మమ్మ కలిసి అత్తని ఒకరు జుట్టు, ఒకరు రెక్కా పట్టుకుని బరబరా ఇంట్లోంచి ఈడ్చుకొచ్చి బయట పారేశారు. పాపం మావయ్య ఏడ్చిన ఏడ్పు నాకిప్పుడుకూడా కళ్ళల్లో మెదులుతూనే వుంది. కన్నబిడ్డ ఏడుస్తుంటే తల్లి మనసు తల్లడిల్లిపోతుందే అలాంటిది... మావయ్య అదే చెట్టంత మనిషి, ముగ్గురు పిల్లలతండ్రి భోరున ఏడుస్తుంటే ఇంట్లోకి రావద్దని నిర్దాక్షిణ్యంగా తరిమేసిందండీ... ఆ బోడిముండ నామీద ప్రేమొలకబోసినంత మాత్రాన నాకు మంచిదవుతుందా! నా వంటిమీదికి బంగారపు తొడుగులు చేయించినా నాకామెమీద ప్రేమ కలుగుతుందా. దేవుడున్నాడండీ. చేసిన పాపం వూరికేపోదు. మీరు చూస్తూ వుండండి. ముందుముందు మావాళ్ళు పడే బాధలు..."

"ఛఛ... మనకెందుకులే... వాళ్ళు బాధలు పడాలనే కోరిక"

"కోరిక కాదండీ... కక్ష... నేనప్పుడు చిన్నదాన్ని. నాకేం తెలియదు. అదే కాస్తంత ఊహ గాని తెలిసుంటేనా! అందరినీ ఒక తిప్పు తిప్పి ఉండేదాన్ని. ముందు మా అమ్మ సంగతి తేల్చి వుండేదాన్ని" కిరణ్‌కుమార్ ఏదో అనబోతుంటే "నేను చదువుకోకపో

యినా నాకూ మంచి, మర్యాదా తెలుసండీ. ప్రేమా, ఆప్యాయతలూ వున్నాయండీ. మా వాళ్లను గురించి ఊళ్ళో గుసగుసలు చెప్పుకుంటుంటే నాకెలా వుంటుందో చెప్పండి"

ట్యూబులైట్ వెలుగులో వాణి కళ్ళు చెమ్మగిల్లడం చూసి ఆమె చుబుకాన్ని కిరణ్‌కుమార్ చేతిలోకి తీసుకుని మృదువుగా నిమిరాడు.

భర్తకి తన మనసు అర్థమయ్యిందని సంతృప్తిపడింది వాణి.

★ ★ ★

వాణికి ఆడబిడ్డ పుట్టిందని కబురొచ్చింది.

చూసి రావడానికని రాఘవయ్య, భూదేవమ్మ బయల్దేరుతూ వుంటే నేనూ వస్తానని రాణి ప్రయాణమయ్యింది.

వాళ్ళు వెళ్ళి వచ్చినతర్వాత పోవాలనుకున్నారు పార్వతి, శివరామయ్య. సాయిశంకరాన్ని తీసుకుని భూదేవమ్మ కదిలింది. వీధి మలుపు తిరుగుతూవుంటే ఎదురుగా అంబులెన్స్ వస్తూ కనబడింది. అందులో డ్రైవర్ పక్కన శేషగిరి మాష్టారు వున్నారు.

"పోతురాజు... రాత్రి కందుకూరు తీసుకుపోయారు" అంబులెన్సు వాళ్ళని దాటి వెళ్ళిన తర్వాత అక్కడ అన్నారు.

విషయం అర్థమయ్యింది.

"వెనక్కి పోదాం అంది భూదేవమ్మ రాఘవయ్యతో"

ఆ రోజుతో ఆ ప్రయాణం ఆగిపోయింది. ఇంటికి వెళ్ళగానే రాఘవయ్య బట్టలు మార్చుకుని పోతురాజు ఇంటికి వెళ్ళాడు.

పంచలో పడుకోబెట్టి వున్న పోతురాజు శవానికేసి తల బాదుకుంటూ శోకాలు తీస్తూ వుంది నాగేశ్వరమ్మ. కొడుకులిద్దరూ అయోమయంగా చూస్తున్నారు. శేషగిరి మాష్టారు వాళ్ళకి ధైర్యం చెప్తూంటే, "అయిపోయిందన్నయ్యా, నా బతుకు బూడిద అయిపోయింది. నా దేవుడు నీమాట వినివుంటే ఇంత పని అయ్యేదికాదయ్యా" అంటూ ఆయన్ని పట్టుకుని ఏడ్చేసింది."

శేషగిరి మాష్టారికి దుఃఖం ఆగలేదు. కడుపునొప్పిగా ఉంటుందని పోతురాజు మందులు వాడుతూ వుంటే మద్రాసుపోయి మంచి డాక్టర్‌కి చూపించుకోమని చాలాసార్లు చెప్పాడు తను. పోతురాజు విన్నాడుకాదు. రాత్రి బాగా పొద్దుపోయిన తర్వాత నొప్పి ఎక్కువగా వుందని ఆయన చిన్నకొడుకు సూర్యం వచ్చి నిద్రలేపితే వెళ్ళాడు. మెలికలు తిరిగిపోతున్న పోతురాజుని చూసి అప్పటికప్పుడు తను దగ్గరుండి కందుకూరు తీసుకుని పోయాడు. పాపం ఆయన ప్రయత్నం నిష్ఫలం అయ్యి పోతురాజుని మృత్యువు కబళించింది.

★ ★ ★

సంతోషంగా వుంది రామకృష్ణకి.

ఇల్లు కట్టుబడి పూర్తయింది. 'శేషగిరి నిలయం' అనే అక్షరాలు దానిముందు పైభాగాన ముచ్చటగా కనబడుతున్నాయి.

కార్పెంటర్లు కిటికీలకీ, వాకిళ్ళకీ తలుపులు పెడుతున్నారు. పెయింటింగ్ పని కూడా అయిన తర్వాత పాలు పొంగించి ఇంట్లో చేరాలి. అనుకుని ఆ కార్యక్రమం ఎలా చెయ్యాలో మోహనరావు, వర్ధనమ్మా వాళ్ళనడిగి సలహా తీసుకున్నాడు. సిద్ధాంతి చేత ముహూర్తం పెట్టించి, సురేష్‌తో పోయి ప్రింటింగ్ ప్రెస్‌లో ఇన్విటేషన్స్‌కి ఆర్డర్ ఇచ్చాడు.

అవి రాగానే ముందుగా మాష్టారికి పంపించాలని అని, ఒక ఇన్విటేషన్‌మీద ముత్యాల్లాంటి అక్షరాలతో శేషగిరి మాష్టారి అడ్రస్ రాసి లక్ష్మి చేతికిచ్చాడు. ఆమె అతి భక్తితో దానికి నాలుగుమూలలా పసుపు, కుంకుమ అద్దింది. తరువాత రామకృష్ణ పావుతావు వైట్ పేపర్ తీసుకుని శేషగిరి మాష్టారికి లెటర్ రాస్తూ, "మీకోసం ఎదురుచూస్తూ వుంటాం మాష్టారూ. మేడంగారిని తీసుకుని రావడం మర్చిపోవద్దు" అని రాసి దాన్ని ఆ కవర్‌లోనే పెట్టి పోస్టు చేయడానికి పోబోతుంటే, "మీ అమ్మానాన్నకి కూడా ఒకటి




పంపించండి" అని చెప్పింది లక్ష్మి.

క్షణం ఆగాడు రామకృష్ణ. లక్ష్మినోట ఏదో అపశృతి వినపడ్డట్టు మొహంపెట్టి "వాళ్ళకా? వాళ్ళకెందుకు? " అనేసి మరోమాటకు అవకాశం ఇవ్వకుండా వెళ్ళిపోయాడు.

లక్ష్మి ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. రామకృష్ణ తిరిగి వచ్చిన తర్వాత ఆ విషయమై ఆమె మాట్లాడలేదు. రామకృష్ణ కూడా ప్రస్తావించలేదు. ఇద్దరూ కలిసి ఎవరెవరికి ఇన్విటేషన్స్ పోస్టు చెయ్యాలో వాళ్ళపేర్లు ఒక లిస్టుగా రాసుకుని ఆ ప్రకారం మరుసటిరోజు కల్లా ఆ పని పూర్తిచేశారు. సురేష్, సుమతితో కలిసి షాపింగ్ చేశారు.

ముహూర్తం నాలుగురోజులుందనగా ఆరోజు ఉదయం సిటీలోవాళ్ళని పిలవడానికని లక్ష్మి ఇన్విటేషన్స్‌ని తీసుకుని రామకృష్ణతో బయల్దేరుతూ క్షణం ఆగి, "ప్లీజ్! నామాట వినరా" అంది గోముగా.

రామకృష్ణకి అర్థంకాలేదు. "ఏమిటి" అన్నాడు.

"మీరు బాగా సంతోషంతో వున్నారు. నేను చెడగొట్టినదాన్నవుతాను"

"విషయం చెప్పు"

"మీరు కోప్పడకూడదు"

"ఏమిటీ వింతగా మాట్లాడుతున్నావు"

లక్ష్మి రామకృష్ణకి అతి దగ్గరగా వచ్చి ఎదురుగా నిలబడి "మీ అమ్మానాన్నకి కూడా కార్డు పంపుదామండీ" అంది.

"వద్దు" ఠకీమని అనేశాడు రామకృష్ణ.

"అదుగో మీరు అప్పుడే సీరియస్ అయిపోయారు. నా మాట వినండి. ప్లీజ్. ఆలోచించండి. అంతదూరంగా బెంగుళూరులో వుండే మోహనరావు మావయ్యగారి పెద్దకొడుక్కీ, మద్రాసులో వుండే చిన్నకొడుక్కీ కార్డులు పంపారుగా. వాళ్ళు అయినవాళ్ళయి మీ అమ్మానాన్నలు కానివాళ్లయ్యారా? "

"నీకింతకుముందు చాలాసార్లు చెప్పాను. నాకు అమ్మానాన్నలు లేరని, వాళ్ళ ప్రస్తావన తేవద్దని"

"మీకెందుకండీ వాళ్ళమీద అంత పంతం. మిమ్మల్నేమన్నా అన్నారా, అన్నది నన్ను. అన్ని బాధలు పడ్డది నేను. నాకు లేని పంతం మీకెందుకండీ"

లక్ష్మి అంటూవుంటే రామకృష్ణ ఆమె కళ్ళలోకి అలాగే చూస్తూ "నువ్వూ-నేను వేరా? " అన్నాడు.

"అదికాదండీ... ఆ దేవుడి దయవల్ల మనం ఒక స్థితికి వచ్చాం. శుభమా అని ఇల్లు కట్టుకున్నాం. అందరినీ పిలిచి కన్నవాళ్లని పిలవకపోవడం మంచిది కాదండీ"

"మంచిది కాకపోతే ఏమవుతుందేమిటి? "

"రేపు వచ్చినవాళ్ళు మీ అమ్మానాన్న ఏరి అని అడుగుతారండీ. వాళ్ళకు మీరేం చెప్తారు. పిలవలేదని చెప్తారా. నాకూ, వాళ్ళకూ సంబంధంలేదని చెప్తారా? బాబాయిగారు తప్పకుండా అడుగుతారండీ. ఆయనకేం చెప్తారు. తప్పు చేసినవాడిలా మీరు తల దించుకోవడం నేను చూడలేనండీ"

ఆమె కళ్ళు చెమ్మగిల్లుతున్నాయి.

"ఈ ఒక్కసారికి నామాట కాదనకండి. ఇంకెప్పుడూ మిమ్మల్ని ఏమీ అడగను"

రామకృష్ణ మాట్లాడలేదు. మౌనంగా కూర్చుండిపోయారు.

పది, పదిహేను నిమిషాలు దాటింది.

"గతాన్ని గుర్తుకు తెచ్చుకోవద్దండీ"

రామకృష్ణ ఇన్విటేషన్ తీసుకుని వణుకుతున్న చేత్తో వాళ్ళ నాన్న పేరూ, అడ్రస్సూ రాసి "నువ్వే పోస్టు చెయ్యి" అని లక్ష్మి చేతికిచ్చాడు.

లక్ష్మి మనసు కుదుటపడింది.

★ ★ ★

"పోతూ పోతూ పోస్ట్ చేసిపోదాం" అనేసి రామకృష్ణతో బయల్దేరింది లక్ష్మి.

పోస్ట్‌మాన్ ఆ ఇన్విటేషన్ తెచ్చి అప్పుడే మాగాడిలోకి పోతూ వీధిలోకి వచ్చిన పార్వతికి ఇచ్చిపోయాడు.

కవరులోంచి కార్డుతీసి చదవగానే విషయం అర్థమయ్యింది. గబుక్కున అక్కడి

కక్కడే దాన్ని నలిపి ముక్కలు ముక్కలుగా చించిపారేసింది. వెనక్కు వెళ్ళి ఆ విషయం ఇంట్లో చెప్పలేదు. నేరుగా మాగాడిలోకి వెళ్ళి పోయింది.

అక్కడ కుప్పనూర్పిళ్ళు జరుగుతున్నాయి. కూలిమనుషులు గడ్డికుప్పను ట్రాక్టర్‌చేత తొక్కిస్తూవుంటే రాఘవయ్య గట్టుమీద కూర్చుని వున్నాడు. రామకృష్ణ ఇన్విటేషన్ పంపించినట్టు ఆయనకీ చెప్పలేదు పార్వతి. ఆరోజు సాయంకాలం శేషగిరి మాష్టారు హైదరాబాద్ పోతున్నాడని తెలిసి ఆ విషయమై ఆలోచిస్తూవుంది.

శేషగిరి మాష్టారిద్వారా రామకృష్ణ విషయాలు అన్నీ కాకపోయినా కొన్ని అయినా ఆనోటా ఈనోటా వచ్చి రాఘవయ్యగారింట్లో వాళ్ళ చెవిన పడుతూనే ఉన్నాయి. అయినా వాళ్ళు తమకేమీ తెలియదన్నట్టు, తమకేమీ పట్టదన్నట్టు వున్నారు.

పొద్దువాలే సమయానికి శివరామయ్య షికారుకి వచ్చినట్టు వచ్చాడు మాగాడిలోకి. అప్పటికి కుప్పనూర్పిడి అయి తూర్పార బట్టారు. ధాన్యం గోతాలకు పోసి మూతులు కుట్టేసరికి బాగా చీకటిపడింది. ఆ చీకటిలోనే బస్తాలు ట్రక్కునిండా వేశారు. తర్వాత అందరూ బస్తాలపైకి ఎక్కి కూర్చుంటే, శివరామయ్య పోయి డ్రైవర్ వెనక రెండుటైర్ల మధ్య వున్న చెక్కమీద కూర్చున్నాడు.

ట్రాక్టరు కదిలి ఎగుడుదిగుడు దారిలో గట్లుమీదకి ఎక్కుతూ, దిగుతూ ముందుకు పోతూవుంది. దాని దూకుళ్ళకు పైన కూర్చున్నవాళ్ళు అటూ ఇటూ తూలుతూ ఎక్కడ పడిపోతామోనని భయపడుతున్నారు. శివరామయ్య డ్రైవర్‌తో మాటలు కలిపాడు. రాఘవయ్య ఎంతనేల నూర్పిడి అయ్యింది, ఎన్ని బస్తాలు పండింది, ఇంకెంతకాలం నేల నూర్పిడి చెయ్యాల్సివుంది, ఎంత ధాన్యం రాలుతుంది అని లెక్కలేసుకుంటున్నాడు. పార్వతి రామకృష్ణని గురించి ఆలోచిస్తోంది. వాడి



గృహప్రవేశానికి శేషగిరి మాష్టారూ, పద్మావతమ్మా బయల్దేరి పోయి వుంటారు. ఈ పాటికే వాళ్ళు బస్సులో కందుకూరు, సింగరాయకొండ దాటి వుంటారని అనుకుంటూ వుంటే ఆమె మస్తిష్కంలో లక్ష్మి రూపం ప్రత్యక్షమయ్యింది. లక్ష్మి గుర్తుకురాగానే పార్వతి ఆలోచనలు అసభ్యంగానూ, ఆవేశంగానూ సాగుతున్నాయి.

గతుకుల్లో పడిన ట్రాక్టర్ ఎగిరి ముందుకు దూకడంతో డ్రైవర్‌తో మాట్లాడుతున్న శివరామయ్య కూర్చున్న చెక్క ఊడిపోవడం, అతను కిందపడడం క్షణంలో జరిగిపోయింది. డ్రైవర్ ట్రాక్టర్ ఆపి చెప్పేదాకా ఎవరికీ తెలియదు. ఆ విషయం చెవిన పడడంతోటే భూకంపం వచ్చినట్టయ్యింది పార్వతికి. గుండెలోంచి దడ మొదలై కాళ్ళు వణకసాగాయి.

"దేవుడా" అదురుతున్న పెదాల్లో అప్రయత్నంగా అనుకుంటూ ట్రాక్టర్ దిగేసింది. ట్రక్కు వెనక మట్టిలోపడి వున్నాడు శివరామయ్య. కుడి మోకాలుమీదుగా చక్రం పోయిందని అక్కడ కారుతున్న రక్తాన్ని బట్టి తెలిసిపోయింది. పార్వతికి ఏడుపాగలేదు. తలా ఒక చెయ్యేసి ట్రక్కులోంచి బస్తాను కిందపడేసి శివరామయ్యను అందులోకి చేర్చి ఇంటికి తీసుకునివచ్చారు. వెంటనే జానీ బాషాని పిల్చుకుని వచ్చారు. ఆయన చూసి "నావల్లకాదు, కందుకూరు తీసుకునిపోండి. మోకాలు విరిగినట్టుంది" అని చెప్పాడు.

భూదేవమ్మ నెత్తీనోరూ బాదుకుంది. శోకండాలు తీస్తూ ట్రాక్టర్ ఎక్కి తనూ కందుకూరు పోయింది. శివరామయ్యని ఆస్పత్రిలో దించుతూనే స్వాతీవాళ్ళకి కబురంపారు. వాళ్ళు వచ్చేసరికి డాక్టర్ పరీక్ష చేసి "ఎముకలు విరిగాయి. నెల్లూరు గానీ, విజయవాడ గానీ తీసుకునిపోయి బోన్ స్పెషలిస్ట్‌కి చూపించండి" అని చెప్పి ఫస్ట్ ఎయిడ్ చేశాడు.

రాఘవయ్యకి నీరసం వచ్చేసింది. దిక్కుతోచలేదు. చక్రవర్తిని పక్కకు పిలిచి "డబ్బే

మన్నా వుందా? " అనడిగాడు.

చక్రవర్తి గతుక్కుమన్నాడు.

"నా దగ్గరేంలేదే. ఇంట్లో వుంటే వెయ్యి, రెండువేలు వుంటుందేమో..." చక్రవర్తి చెప్తూ వుంటే, "అయిదువేలుంటే తెచ్చాను... ఎక్కడన్నా ఓ పదివేలు అడుగు" అన్నాడు రాఘవయ్య.

"ఇప్పుడు ఎవరిస్తారబ్బా..." చక్రవర్తి నసుగుతూ ఆలోచిస్తూవుంటే అక్కడికి వచ్చిన భూదేవమ్మ వాళ్ళ సంభాషణ విని తన మెడలోంచి మూడుపేటల గొలుసు తీసి "దీన్ని పెట్టి తీసుకొనిరా" అని ఇవ్వబోయింది.

చక్రవర్తి మొహమాటపడ్డాడు.

"ఆహా... వద్దులే. ఎవరినన్నా చేబదులడిగి తెస్తా" అనేసి అక్కడినుంచి వెళ్ళిపోయి గంటలో తిరిగివచ్చాడు డబ్బు తీసుకుని.

వెంటనే కారు మాట్లాడుకుని స్వాతిని, భూదేవమ్మని ఇంటికి వెళ్ళమని చెప్పి శివరామయ్యను తీసుకుని రాఘవయ్యా, చక్రవర్తి, పార్వతి నెల్లూరు బయల్దేరారు.

★ ★ ★

తెల్లవారింది.

ప్రశాంతంగానూ, పవిత్రంగానూ వుంది ప్రకృతి.

ఆ శుభోదయంలో బస్సు దిగిన శేషగిరి మాష్టారు, పద్మావతమ్మ బస్టాండ్‌లోనే కాలకృత్యాలు తీర్చుకున్నారు.

"ఏదన్నా టిఫిన్ తిని పోదామా" అడిగాడు శేషగిరి మాష్టారు పద్మావతమ్మని.

"ఇప్పుడేం తింటామండీ... మీకు తినాలని పిస్తే తిందాం" అన్నది.

"అయితే వేడివేడిగా టీ తాగుదాం"

"ఆ"

ఇద్దరూ క్యాంటీన్‌లోకి వెళ్ళి టీ తాగారు. బస్టాండ్‌లోంచి బయటకు వస్తూవుంటే దినకర ప్రభలు విచ్చుకొంటున్నాయి, హైదరాబాదు నగరాన్ని కనకాభిషేకం చేస్తున్నట్టు.

రామకృష్ణ శేషగిరి మాష్టారికి ఇన్విటేషన్‌తో పంపిన లెటర్‌లోనే "మీరు కందుకూరునుంచి బయల్దేరే బి. హెచ్. ఇ. ఎల్ బస్సులో వస్తే నేను ఎర్రగడ్డ బస్టాప్‌లో ఎదురుచూస్తుంటాను మాష్టారూ" అని రాశాడు.

అందుకు శేషగిరి మాష్టారు "మాకోసం ఏ రిస్కూ తీసుకోవద్దు రామకృష్ణా. మేము నేరుగా మోహన్‌రావు బావగారింటికి వెళ్తాం. అక్కడ ఒకరోజుండి వాళ్ళతో గడపాలని వుంది. ఆ చిరకాల వాంఛను తీర్చుకొని మీ దగ్గర కొస్తాం" అని తిరుగు రాశాడు. ఆ జాబును తెచ్చి మోహన్‌రావు వాళ్ళకి చూపించాడు రామకృష్ణ. వాళ్ళు ఎంత సంతోషపడ్డారో! వర్ధనమ్మకి ఎక్కడ లేని హుషారొచ్చింది. కర్టెన్లన్నీ వుతికి ఇస్త్రీ చేయించి కట్టింది. ఫినాయిల్‌తో ఇల్లు కడిగి, వాడకుండా పక్కనపెట్టిన కుర్చీలను, సోఫాలను తీయించి బయట గదిలోనూ, హాలులోనూ వేయించింది. రాత్రి లీటర్ పాలు ఎక్కువగా తీసుకుని బాగా కాచి పెరుగుకోసం తోడుపెట్టింది. టిఫిన్‌కని ఇడ్లీపిండి కలిపివుంచింది.

శేషగిరి మాష్టారిని గురించి, ఆయన వ్యక్తిత్వాన్ని గురించి రామకృష్ణ అంతకుముందు ఎన్నిసార్లు చెప్పాడో! ఆయనకు తగ్గ భార్యగా పద్మావతమ్మను గురించి, ఆమె మంచితనాన్ని గురించి లక్ష్మి చాలా సార్లు చెప్పింది.

వాళ్ళావుదయం వస్తారని ఎదురు చూడడంతో సరిపోయింది. వీధిలో ఆటో శబ్దం వినబడితే వాళ్ళు వచ్చేశారనుకొని వర్ధనమ్మ రెండుసార్లు బయటకు వచ్చింది. అప్పటికి రెండుసార్లు రామకృష్ణ ఫోన్ చేశాడు. ఇంకా రాలేదని చెప్పాడు మోహన్‌రావుగారు.

పద్మావతమ్మ కాఫీ కలిపి ఒక గ్లాసు మోహన్‌రావు గారికిచ్చి ఇంకో గ్లాసులో తను తాగుతూ వీధివాకిలి కనబడేట్టు కుర్చీలాక్కొని కూర్చుంది. బయటకు చూస్తూ కాఫీ తాగుతున్న ఆమె ఒక్కసారిగా వచ్చేశారు అంటూ లేచింది. ఆమె వెనకాలే మోహన్‌రావు లేచి బయటికి వచ్చాడు.

తెల్లటి పంచ, లాల్చీ భుజంమీద పైపంచ, ఆజానుబాహుడిలా వున్నాడు శేషగిరి

మాష్టారు. ఆయన చేతిలో నాలుగు జతల బట్టలు పట్టే జిప్ బ్యాగ్ వుంది. పక్కనున్న పద్మావతమ్మ ఆయనకన్న కాస్త తక్కువ ఎత్తుంది. పచ్చని రంగు వంటికి మెరూన్ రంగు చీరె కట్టుకొని వుంది. నుదుట తిలకం బొట్టు, మెడలో తాళిబొట్టు తోడుగా నల్లపూసలు అల్లిన బంగారు గొలుసుంది.

గేటులోంచి వస్తున్న వాళ్ళని చూడగానే మోహన్‌రావు, వర్ధనమ్మకి మహా సంతోషం అయ్యింది.

"ఇన్నాళ్ళకు మా గృహం పావనం అయ్యింది" అన్నాడు మోహన్‌రావుగారు.

"లేదు బావగారూ ఇన్నాళ్ళకు మిమ్మల్ని చూసే భాగ్యం కలిగింది" శేషగిరి మాష్టారు అంటూ వుంటే మోహన్‌రావుగారు ప్రేమగా కౌగిలించుకొన్నారు.

"రా వదినా" అంటూ వర్ధనమ్మ పద్మావతమ్మని ఆహ్వానించి "ఆటోలో రాలేదా" అని అడిగింది.

"లేదొదినా... బస్టాండ్‌నుంచి నడిచేవస్తున్నాం" చెప్పింది పద్మావతమ్మ.

"అదేమిటన్నయ్యా అంతదూరం నుంచి నడిచి రావడం" వర్ధనమ్మ అంటూ వుంటే "ఏమయిందమ్మా నడిచే శక్తి వుందిగా చల్లని వాతావరణం. ప్రశాంతంగా వుంది. షికారుగా నడిచి వచ్చాం" అని చెప్పాడు శేషగిరి మాష్టారు.

మోహన్‌రావుగారు రామకృష్ణకి ఫోన్ చేశాడు. అవతల నరేష్ రిసీవర్ ఎత్తి "హలో ఎవరు? " అని అడిగాడు.

"నేన్రా"

నరేష్ గొంతు గుర్తుపట్టాడు "ఓ తాతయ్యా మీరా!"

"మీనాన్నని పిలువు"

"ఇంట్లో లేడు తాతయ్యా. అమ్మా, నాన్న ఇప్పుడే బయటకు వెళ్ళారు"

"అలాగా! అయితే రాగానే వూరినుంచి వాళ్ళ మాష్టారు వచ్చారని చెప్పు"

"అలాగే తాతయ్యా"

మోహన్‌రావుగారు ఫోన్ పెట్టేసి ఆ విషయం శేషగిరి మాష్టారుకి చెప్పాడు.

"పనిమీద బిజీగా వున్నాడేమో" అన్నాడు శేషగిరి మాష్టారు.

"మీరొచ్చేముందు రెండుసార్లు ఫోన్ చేశాడు" అని చెప్పాడు మోహన్‌రావు.

పదిహేను నిముషాల తర్వాత "నీళ్ళు కాగాయి అన్నయ్యా. లేచి స్నానం చెయ్యండి" అంటూ వర్ధనమ్మ పిలిచింది.

శేషగిరి మాష్టారు స్నానంచేసి రాగానే పద్మావతమ్మ వెళ్ళింది. ఆమె వచ్చేలోపు వర్ధనమ్మ డైనింగ్ టేబుల్‌మీద ఇడ్లీలు, మంచి నీళ్లు సిద్ధంచేసింది.

టిఫిన్ చెయ్యగానే పద్మావతమ్మని, శేషగిరి మాష్టారిని కాసేపు పడుకొని రెస్ట్ తీసుకోమని చెప్పారు మోహన్‌రావు, వర్ధనమ్మ.

"ఆ... ఆ" అంటూ శేషగిరి మాష్టారు హాల్లోకి వచ్చి సోఫాలో కూర్చున్నాడు. మోహన్‌రావు ఆయన పక్కనే కూర్చున్నాడు. వాళ్ళకు ఎదురుగా వున్న సోఫాలో పద్మావతమ్మ, వర్ధనమ్మ కూర్చోబోతుంటే లక్ష్మి, రామకృష్ణ వచ్చారు.

"ఏమ్మా లక్ష్మి" అంటూ పద్మావతమ్మ లక్ష్మిని దగ్గరకు తీసుకొంటూ వుంటే రామకృష్ణ నేరుగా శేషగిరి మాష్టారి దగ్గరకిపోయి "మాష్టారూ" అంటూ ఆయన ముందు కింద కూర్చున్నాడు.

రామకృష్ణ అలా కింద కూర్చోవడం మోహన్‌రావూ వాళ్ళకి ఆశ్చర్యమయ్యింది.

"ఇలాకూర్చో రామకృష్ణా" అంటూ శేషగిరి మాష్టారు తన పక్కన కూర్చోమని చెప్పాడు.

రామకృష్ణ మాట్లాడలేదు. మౌనంగా శేషగిరి మాష్టారి తొడమీద తలవాల్చాడు. శేషగిరి మాష్టారు తలమీద చెయ్యివేసి "ఏం రామకృష్ణా" అంటూ నిమిరాడు.

ఆ పిలుపు, ఆ హస్త స్పర్శ, ఇన్నేళ్ళకి ఆ అనుభూతి కలలావుంది రామకృష్ణకి.

భార్యాపిల్లలతో ఆనాడు బస్సెక్కి శాఖవరం వదిలేసి వచ్చేటప్పుడు అంకమ్మ తల్లికి




మొక్కుకొన్నాడు తను గురువుగారిని మళ్ళీ చూసే భాగ్యం కలిగించమని. నిజంగా మహత్తువున్న తల్లి అంకమ్మ తల్లి. ఆ కోరిక తీర్చింది. ఆయనతో ఏవేవో చెప్పుకోవాలనుకొన్నాడు. ఒక్కటీ గుర్తుకు రావడంలేదు. ఏం మాట్లాడాలో నోరు పెగలడం లేదు. తల మీద వున్న మాష్టారి చెయ్యి ఆప్యాయంగా నిమురుతూ వుంటే దైవసన్నిధిలో వున్నట్టుంది.

కన్నవాళ్ళు అన్యాయం చేస్తే దగ్గర చేర్చుకొని దారిచూపించాడు. దరిద్రంలో డబ్బు సహాయంచేశాడు. అనూహ్య కష్టాలు అనుభవిస్తూ వుంటే అందులో భాగం పంచుకొని ఏడ్చాడు, కరుణామయుడు.

ఆస్పత్రిలో గణేష్ చనిపోయినప్పుడు నోటికి గుడ్డ అడ్డం పెట్టుకొని ఏడుస్తున్న శేషగిరి మాష్టారి రూపం కళ్ళల్లో కనబడి దుఃఖం పొంగుకొచ్చింది. నిగ్రహించుకోలేక ఎక్కిళ్లు పెట్టాడు. శేషగిరి మాష్టారు చలించిపోయారు. ఆయన కళ్ళల్లో నీళ్ళూరాయి. రామకృష్ణ పట్ల గూడుకట్టుకొని వున్న వాత్సల్యాన్ని దాచుకోలేకపోయాడు. 'నాయనా రామకృష్ణా' అంటూ అతని తల, వీపు నిమురుతూ ముందుకి వంగాడు.

వస్తున్న ఏడుపుని ఆపుకోవడం రామకృష్ణవల్ల కాలేదు. "ఎన్నేళ్ళకు కనపడ్డారు మాష్టారు" అంటూ ఏడ్చేశాడు. శేషగిరి మాష్టారిలో దుఃఖం వుబికి వచ్చింది.

"నాక్కూ నిన్ను చూడాలనే వుందయ్యా"

"ఒక్కసారన్నా వచ్చారు కారు" చిన్నపిల్లాడిలా రామకృష్ణ అంటూ వుంటే శేషగిరి మాష్టారి కళ్ళు వర్షించాయి.

అన్నేళ్ళ ఎడబాటు నేపథ్యంలో గురుశిష్యుల మధ్య దాగివున్న అభిమానాప్యాయతల తీవ్రతను చూస్తూ నిశ్చేష్టులుగా వుండిపోయారు మోహన్‌రావు వాళ్ళు. ఎవరినోటా మాటలు రాలేదు. అయిదు, పది, పదిహేను నిముషాల కాలం కళ్ళు పెద్దవిగా విప్పార్చి చూసింది. వింతగానూ, ఆశ్చర్యంగానూ, అద్భుతంగానూ, ఆదర్శంగానూ వుంది ఆ దృశ్యం.

ఆ వాతావరణం మామూలు స్థితికి వచ్చే సరికి మరో పదిహేను నిముషాలు పట్టింది.

వీధివాకిట్లో హోండా దిగారు సుమతి, సురేష్. వాళ్ళు ఇంట్లోకి రాగానే శేషగిరి మాష్టారిని, పద్మావతమ్మని పరిచయం చేశాడు రామకృష్ణ. వెంటనే వాళ్లతో సుమతి వరుస కలిపేసి మామయ్యా, అత్తయ్యా అంటూ మాటల్లోకి దిగింది.

వర్ధనమ్మకి మహా ఉత్సాహంగా వుంది. అందరికీ కాఫీలు కలుపుకొని రావడానికని కిచెన్‌లోకి వెళ్ళింది.

లక్ష్మి ఆమె వెనకాలే లోనికి వెళ్ళి తనే కాఫీ కలిపి గ్లాసుల్లో తెచ్చి అందరికీ అందించింది.

శేషగిరి మాష్టారుకి సంతోషంగా వుంది. అందరూ కలిసి కలివిడిగా మాట్లాడుకోవడం, ఒకరిపట్ల ఒకరు అభిమానంగా, ఆప్యాయంగా వుండడం కళ్లారా చూస్తుంటే దైవత్వం వుట్టిపడే సభ్య సంస్కారాలువున్న మానవతామూర్తుల మధ్యకు నన్ను చేర్చిన మీ రుణం ఎన్ని జన్మలెత్తినా తీర్చుకోలేను మాష్టారూ' అని రామకృష్ణ వుద్యోగంలో చేరినప్పుడు ఉత్తరంలో రాసిన మాటలు గుర్తుకు వచ్చాయి. ఆ మాటలలో అతిశయోక్తి లేదు. నిజం వుంది. నిజంగా దేవుడు తెలివయినవాడు. ఎప్పుడు ఏం చేస్తాడో ఎందుకు చేస్తాడో ఎవరికీ అంతు చిక్కడు. జీవితాలను అతలాకుతలం చేసినా అందలం ఎక్కించినా అంతా ఆయన లీలే. అన్నం లేకుండా మాడ్చి మాడ్చి పంచభక్ష్యపరమాన్నాలు వడ్డిస్తాడు. అష్టకష్టాలు పెట్టి అష్టైశ్వర్యాలు అందిస్తాడు. పుట్టుభోగిని సైతం బైరాగిని చేసి జోలె పట్టిస్తాడు. అహంకారం పెంచి అయోమయంలో పడేస్తాడు. అనామకునికి అన్నీ ఇస్తాడు. ఆస్తికత్వం ఒకపక్క పెంచుతూనే మరో పక్క నాస్తికత్వాన్ని పోషిస్తూ వుంటాడు. ఏం దేవుడో ఏం చేసినా తప్పించుకోలేం. జరిగే

వన్నీ మంచికని అనుభవించవలసిందే. ఎవరికీ కనబడడు. నిర్వికారుడు, నిరాకారుడు, దయామయుడు, ధర్మరక్షణా ప్రియుడు. అధర్మంగా ప్రవర్తించినా అమ్మానాన్నల నుండి రామకృష్ణను తప్పించి అనూహ్యంగా అవకాశం కల్పించి న్యాయం చేశాడు. లక్ష్మిని ఇంట్లోంచి బయటకు తోసి పారేసినప్పుడు రామకృష్ణ తన ఎదురుగా ఏడ్చిన ఏడ్పు గణేష్ చనిపోయినప్పుడు 'నేనీ వూళ్ళో వుండను మాష్టారూ' అని పొగిలిపొగిలి ఏడ్చిన ఏడ్పు కళ్ళల్లో మెదిలి 'పాపం' అనుకొని రామకృష్ణకేసి చూశాడు.

ఒళ్ళుచేసి, రంగు తేలి వున్నాడు. తల్లో వెంట్రుకలు పల్చబడి వున్నాయి. ఆనాడు తను ధైర్యంచేసి పంపడం చాలా మంచిదయింది. ఆ దేవుడి దయవల్ల స్థిరపడిపోయాడు. మోహన్‌రావు బావా వాళ్ళ రుణం తీర్చుకోలేనిది.

"మీరు ఒకరోజు మా యింట్లో వుండాలి మామయ్యా" అని అడిగింది సుమతి.

"ఇప్పుడు వున్నానుగదమ్మా"

"మీరు జోక్ చేస్తున్నారు" మొహం అదోలా పెట్టింది సుమతి.

శేషగిరి మాష్టారికి నవ్వొచ్చింది.

"అర్థమయ్యిందమ్మా, తప్పకుండా మీ ఇంటికి వస్తానమ్మా"

"థాంక్స్ మావయ్యా థాంక్స్" చాలా సంతోషం అయ్యింది సుమతికి.

లక్ష్మి వంటింట్లోకి పోయి వర్ధనమ్మ వద్దంటున్నా వినకుండా కాఫీ గ్లాసులు, టిఫిన్ ప్లేటులు కడిగేసి వచ్చింది. సురేష్‌కి ఏదో గుర్తుకు వచ్చి 'గుమ్మడికాయలకు పోవాలనుకొన్నాం' అన్నాడు రామకృష్ణతో.

"ఏం గుమ్మడి కాయలు దొరకలేదా ఏంది" అడిగాడు మోహన్‌రావుగారు.

"ఉన్నాయి... పోయి తీసుకొని రావాలి" సురేష్ చెప్తూవుంటే "నాకు రాస్తే తెచ్చేవాడినిగా" అన్నాడు శేషగిరి మాష్టారు.

"ఇక్కడ దొరుకుతాయిలే అన్నయ్యా" వర్ధనమ్మ చెప్పింది.

పదకొండు గంటలు కావచ్చింది. సురేష్, రామకృష్ణ లేచి బయటకు వెళ్తుంటే "భోజనానికి రండి" అని చెప్పింది వర్ధనమ్మ.

వాళ్ళటు వెళ్ళగానే సుమతి, లక్ష్మి వంటచేయడంలో లీనమయ్యారు. వదినా వదినా అని వాళ్ళిద్దరూ వరస కలుపుకొని పిలుచుకొంటుంటే పద్మావతమ్మకి ముచ్చటగా వుంది. 'పడ్డంత కాలం కష్టాలు పడ్డా ఇప్పుడు సంతోషంగా వుంది' అని లక్ష్మిని గురించి అనుకొంది.

సురేష్, రామకృష్ణ తిరిగి వచ్చేసరికి డైనింగ్ టేబుల్ దగ్గర సుమతి, లక్ష్మి వడ్డిస్తుంటే పద్మావతమ్మ, శేషగిరి మాష్టారు, వర్ధనమ్మ, మోహన్‌రావుగారు భోంచేస్తున్నారు. వాళ్ళు లేవగానే టేబుల్ తుడిచేసి, నాలుగు ప్లేట్లలో వడ్డించి రామకృష్ణ, సురేష్‌లతోపాటు లక్ష్మి, సుమతి కూర్చుని తినేశారు.

రామకృష్ణ హాల్లోకి వచ్చి కూర్చుంటూ "కారు మాట్లాడాం" అన్నాడు.

"గుడ్... మంచి పని చేశారు" అన్నాడు మొహన్‌రావుగారు మెచ్చుకోలుగా.

"తెల్లవారు ఝామున నాలుగింటికి సురేష్ తీసుకొని వస్తాడు. అందులో వచ్చెయ్యండి" చెప్పాడు రామకృష్ణ.

పదినిమిషాల తర్వాత "ఇక మనం బయల్దేరదాం" అన్నాడు సురేష్.

★ ★ ★

ఆ రాత్రి

రంగురంగుల విద్యుద్దీపాలతో అలంకరించిన ఇల్లు నయనానందంగా వుంది.

తెల్లవారుఝామున నాలుగింటికి శేషగిరి మాష్టారువాళ్ళకోసం కారు తీసుకొని పోయాడు సురేష్. వాళ్ల రాకకోసం ఎదురు చూస్తున్నారు రామకృష్ణావాళ్ళు.

అయిదు గంటలవుతుండగా వచ్చారు. కారు లోంచి శేషగిరిమాష్టారు, పద్మావతమ్మ, మోహన్‌రావుగారు, వర్ధనమ్మవాళ్ళు దిగుతూ వుంటే కుమారయ్య, మాధవి, శాంతమ్మ వచ్చి




పలకరించారు.

"మీరెప్పుడొచ్చారు" శేషగిరి మాష్టారు అడిగాడు వాళ్లని.

"రాత్రివచ్చాం మాష్టారూ" కుమారయ్యా చెప్పాడు.

అక్కడే పక్కగా నిలబడి వున్న నరేష్, మహేష్‌లను చూసిన పద్మావతమ్మ వాళ్లని గుర్తుపట్టింది.

"ఏంరా" అంటూ ఇద్దర్నీ రెండు చేతులతో దగ్గరకు తీసుకొని "ఏవండీ వీళ్ళని చూశారా" అంటూ వాళ్ళని శేషగిరి మాష్టారి ముందుకు తీసుకొని వచ్చింది.

నరేష్, మహేష్ గబుక్కున వంగి శేషగిరి మాష్టారి పాదాలు కళ్ళకు అద్దుకొన్నారు. వాళ్ళ వినయానికి శేషగిరి మాష్టారు ముగ్ధుడై ఇద్దర్నీ దగ్గరకు తీసుకొన్నాడు.

"రామకృష్ణగారూ... ముహూర్తం మించి పోతోంది" అంటూ పురోహితుడు హెచ్చరించాడు.

"ఆ... ఆ" అంటూ రామకృష్ణ పసుపుపూసి కుంకుమబొట్లు పెట్టివుంచిన గుమ్మడికాయను తెచ్చి "మాష్టారూ దీన్ని పట్టుకోండి" అంటూ దాన్ని శేషగిరి మాష్టారి దోసిట్లో పెట్టాడు.

మంగళ వాయిద్యాలు మొదలయ్యాయి. పురోహితుడు ఆ గుమ్మడికాయలమీద కర్పూరం పెట్టి అగ్గిపుల్లగీసి ముట్టించి మంత్రాలు చదవడం మొదలుపెట్టాడు.

శేషగిరి మాష్టారికి అదొక అనుభూతిగా వుంది. తను వూహించలేదది. గృహప్రవేశం చేసేటప్పుడు ముఖద్వారం ముందు ఇంటి యజమాని గుమ్మడికాయను దిష్టితీసి ఎత్తి పగలేస్తాడు. అందుకు భిన్నంగా రామకృష్ణ ఆ కార్యం తన చేతులమీదుగా చేయిస్తుంటే శేషగిరి మాష్టారికి తనకు తానుగా ఎంతో ఎత్తు ఎదిగినట్టనిపించింది. ఆ ఆనందాన్ని అనుభవిస్తూ అలా తల పైకెత్తాడు. ఎదురుగా పైన 'శేషగిరి నిలయం' అనే అక్షరాలు విద్యుద్దీపాల మధ్య మెరుస్తూ కనిపించడంతో వుక్కిరిబిక్కిరి అయ్యాడు. పక్కనున్న పద్మావతమ్మని పైకి చూడమని కళ్లతో సైగ చేశాడు.

'ఏమిటి' అన్నట్టు పైకి చూసిన పద్మావతమ్మ ఆశ్చర్యపోయింది. రామకృష్ణలోని కృతజ్ఞతాభావానికి ప్రతీకలు ఆ ఇల్లు, ఆ మర్యాదలు అనుకొని తృప్తిపడింది. పురోహితుడు మంత్రోచ్ఛారణ వేగవంతం చేశాడు. శేషగిరి మాష్టారిచేత గుమ్మడికాయను నేలకు తాకిస్తూ పైకీ, కిందకీ మూడుసార్లు గుండ్రంగా తిప్పించి ఎత్తి పగలేయించాడు. తర్వాత గృహప్రవేశం చేయించి పాలు పొంగించమని చెప్పాడు.

కార్యక్రమం నిర్విఘ్నంగా పూర్తయింది.

"మధ్యాహ్నం భోజనాలు ఇంట్లో ఏర్పాటు చెయ్యి రామకృష్ణా" అని చెప్పాడు శేషగిరి మాష్టారు.

"అలాగే మాష్టారూ" రామకృష్ణ అంటూ వుంటే "వచ్చిన పదిమందినీ ఇంట్లో కూర్చోబెట్టి ఆకుల్లో తినిపిస్తే బావుంటుంది" అన్నది పద్మావతమ్మ.

"బావుండడమే కాదు వదినా, అది సంప్రదాయం కూడానూ" వర్ధనమ్మ మాట అందుకుని అంటూవుంటే "ఈ రోజుల్లో అంత ఓపిగ్గా కూర్చుని ఆకుల్లో అన్నీ వడ్డించిందాకా వుండి తినేదెవరు. ఫైబర్ ప్లేట్లో అంత పెట్టించుకొని, అందులో సగం ఎంగిలిపడి అక్కడ పడేసిపోవడమే గానీ" అని అన్నారు మోహన్‌రావుగారు.

"ఇప్పుడు యుగంలో బఫే భోజనం ఫ్యాషన్ అయ్యింది" శేషగిరి మాష్టారు అన్నాడు.

"ఎంత ఫ్యాషన్ అయినా పంక్తి భోజనానికి సాటిరాదుగా" మోహన్‌రావుగారు అంటూ వుంటే అక్కడికి లక్ష్మి వచ్చి "మీరు లోపలికి రావాలి" అని పిలిచింది. అందరూ లేచి లోపలకు వెళ్ళారు.

హాల్లో నాలుగు కుర్చీలు వరుసగా వేసివున్నాయి. సురేష్, కుమారయ్యా, శాంతమ్మ పిల్లలు అక్కడే వున్నారు. రామకృష్ణ శేషగిరి మాష్టారిని, పద్మావతమ్మని, కుర్చీలలో పక్కపక్కన కూర్చుండ చేసి మోహన్‌రావుగారినీ,



వర్ధనమ్మను ఆ పక్క కుర్చీలలో కూర్చుండబెట్టాడు.

ఫోటో కార్యక్రమం అనుకున్నారు వాళ్ళు. అప్పుడే సుమతి, మాధవి ఒకరు పళ్లు, పూలూ వున్న పళ్లెం, ఇంకొకరు పట్టుచీరలు, పట్టు పంచలు వున్న పళ్ళెంతో వచ్చారు. వాళ్ళని చూడగానే విషయం అర్థమయ్యింది.

"ఏమిటి రామకృష్ణా ఇది" అని అడిగాడు శేషగిరి మాష్టారు.

"ఏం లేదులే మాష్టారూ" రామకృష్ణ అంటూ వుంటే లక్ష్మి చెంబుతో నీళ్లు, ఖాళీ వడ్డన పళ్లెం తీసుకొని వచ్చింది.

శేషగిరి మాష్టారు "ఏమిటయ్యా ఇది... ఎందుకు నాయనా" అని వారిస్తున్నా వినలేదు రామకృష్ణ. మూర్తీభవించిన భక్తితో శేషగిరి మాష్టారి ముందు కూర్చున్నాడు. ఆయన పాదాలు రెండూ పళ్లెంలో పెట్టి లక్ష్మి చెంబుతో నీళ్ళు పోస్తూవుంటే శుభ్రంగా కడిగి ఆ నీటిని తననెత్తిమీద చల్లుకొని లక్ష్మి తలమీద, నరేష్, మహేష్ తలలమీద చల్లాడు. తర్వాత లేచి పళ్లెం తీసి పక్కగా పెట్టి సుమతి, మాధవి వాళ్ళ చేతుల్లో వున్న పళ్లాలలోంచి పళ్లు, పట్టుపంచెలు అందుకొని శేషగిరి మాష్టారికి యిచ్చి "మమ్మల్ని దీవించండి మాష్టారూ" అంటూ ఆయన చేతిలో అక్షింతలు పెట్టి పాదాలకు నమస్కరించాడు. రామకృష్ణతోపాటు లక్ష్మి, పిల్లలు కూడా నమస్కరించారు. ఆ సమయంలో వాళ్ళ శిరస్సులమీద అక్షింతలు చల్లుతున్నప్పుడు శేషగిరి మాష్టారికి తనెప్పుడో చదివిన భర్తృహరి సుభాషితములోని 'శిరసి గురు పాద ప్రణయితా' అనే శ్లోక భాగం గుర్తుకువచ్చి రామకృష్ణ హృదయ సంస్కారానికి ముగ్ధుడయ్యాడు.

తర్వాత లక్ష్మి పద్మావతమ్మ పాదాలకు పసుపు పూసింది. నుదుట బొట్టుపెట్టి పూలు, పళ్ళతో పట్టుచీరె, జాకెట్టు ఇవ్వగానే రామకృష్ణ ఆమె పాదాలకు నమస్కరించబోయాడు. పద్మావతమ్మ వారించి అందరి తలలమీద అక్షింతలు వేసింది.

మోహన్ రావుగారికి, వర్ధనమ్మకి వరుసగా అలాగే బట్టలుపెట్టి వాళ్ళ ఆశీర్వాదాలు అందుకొన్న తర్వాత రామకృష్ణ మనసు తేలికపడింది.

భోజనాలు అయ్యేసరికి మూడుగంటలు అయ్యింది. అయిదింటిదాకా మోహన్‌రావు గారు, వర్ధనమ్మ వుండి వెళ్ళిపోయారు. మరో అరగంటకి సుమతి, సురేష్‌లు బయల్దేరారు. పోయేటప్పుడు సుమతి శేషగిరి మాష్టారు దగ్గరికి వచ్చి "రేపు రండి మావయ్యా మా ఇంటికి" అని పిలిచింది.

"ఇవ్వాళా, రేపు ఇక్కడ వుండి ఎల్లుండి వస్తాంలేమ్మా" చెప్పాడు.

లక్ష్మి, రామకృష్ణ గేట్లోదాకా పోయి సుమతి, సురేష్‌ని సాగనంపి వచ్చారు.

రామకృష్ణ వచ్చి శేషగిరి మాష్టారి ముందు కూర్చున్నాడు.

"బావుంది నాయనా ఇల్లు. నీట్‌గా కట్టుకొన్నావు" అంది పద్మావతమ్మ తన సంతోషాన్ని వ్యక్తపరుస్తూ.

"అంతా మాష్టారు పెట్టిన భిక్షే కదమ్మా"

రామకృష్ణ నోటినుండి వచ్చిన ఆ మాట వినడంతోటే చలించిపోయాడు శేషగిరి మాష్టారు.

"నేనేం చేశానయ్యా?" అన్నాడు.

"చేసిందంతా మీరే కదా మాష్టారూ, మీరే లేకుంటే నేనెక్కడ వుండేవాడినో. బావిలో వుండే కప్పలా వున్న నన్ను భాగ్యనగరం చేర్చి బతుకుమార్గం చూపించారు. నిత్యం మీ పాదుకల్ని పూజించినా మీ రుణం తీర్చుకోలేను."

"అంత పెద్ద మాటలొద్దయ్యా. నేను చేసిందేమీ లేదు. అంతా నీ అదృష్టం"

రామకృష్ణ నిట్టూర్చాడు.

"నా అదృష్టం ఏంటో మీకు తెలుసుకదా మాష్టారూ. అంతా మీ కళ్ళారా చూశారు."

రామకృష్ణ కళ్లు చెమ్మగిల్లటం చూశాడు శేషగిరి మాష్టారు.




'అదంతా మర్చిపో రామకృష్ణా"

"ఎప్పుడో మర్చిపోయాను మాష్టారు. అయినా అప్పుడప్పుడు పురుగు తొలిచినట్టు తొలుస్తూవుంది"

"పోనీలే రామకృష్ణా... నీ పిల్లల అదృష్టం బావుంది" అంది పద్మావతమ్మ.

"అంతా మీ దయే కదమ్మా... మిమ్మల్ని చూడాలని ఎన్నిసార్లు అనుకొన్నానో. ఆ ఊరు రాబుద్ధికాలేదు. నాకూ, ఆ వూరికీ రుణం తీరిపోయిందమ్మా" రామకృష్ణ కళ్ల ల్లోంచి నీళ్ళు టపటపా చెంపలమీదికి రాలాయి. పద్మావతమ్మ చూడలేకపోయింది.

"ఛ! ఛ!... ఏంది నాయనా చిన్నపిల్లా డిలా..." ఆమె అంటూవుంటే శేషగిరి మాష్టారు రామకృష్ణ మొహంలోకి చూసి 'బురదమట్టిలో పుట్టాడు. ఆ బురద వాసనే అంటలేదు. మంచితనం, మంచి వ్యక్తిత్వం పరిమళిస్తున్నాయి' అని అనుకొంటూ 'వాళ్ళెంత దరిద్రులో ఇంత మంచి కొడుకుని దూరం చేసుకొన్నారు' అని భూదేవమ్మని, రాఘవయ్యని గుర్తు చేసుకున్నాడు.



**ఆ** రోజు చాలా వేగంగా గడిచింది.

మరుసటి రోజు ఉదయం కాఫీ, టిఫిన్‌లు అయిన తర్వాత "అలా వెళ్దాం మాష్టారూ" అంటూ శేషగిరి మాష్టారినీ, పద్మావతమ్మనీ కంప్యూటర్ సంస్థకి తీసుకొనిపోయాడు రామ కృష్ణ.

'మంచి సెంటర్' అనుకొన్నాడు శేషగిరి మాష్టారు లోపల కూర్చుని అద్దాల్లోంచి బయ టకు చూస్తూ. అందులో నేర్పించే కోర్సులు, ఫీజులు వగైరా విషయాలు అడిగి తెలుసుకొ న్నాడు. అక్కడినుండే రామకృష్ణ మోహన్ రావు వాళ్ళకి ఫోన్‌చేసి పద్మావతమ్మ, శేషగిరి మాష్టారిచేత మాట్లాడించాడు.

తర్వాత సనత్‌నగర్ రింగ్‌చేశాడు రామ కృష్ణ. అవతల సుమతి ఫోన్ ఎత్తింది.

"నేనమ్మా షాపునుండి మాట్లాడుతున్నాను. సురేష్ ఆఫీసుకి వెళ్ళాడా?"

"ఇంతకుముందే వెళ్ళాడన్నయ్యా. ఏదన్నా చెప్పాలా..."

"అదేం లేదమ్మా. మాష్టారూ, మేం ఇక్కడే వున్నాం"

"అవునా! వాళ్ళు షాపుకొచ్చారా?"

"అవునమ్మా, ఫోన్ మాష్టారికిస్తున్నాను మాట్లాడు" అంటూ రామకృష్ణ ఫోన్ శేషగిరి మాష్టారికిచ్చాడు.

ఆయన ఫోన్ అందుకొని "ఏమ్మా సుమతి" అని అంటూండగానే అవతలి నుంచి సుమతి "గుడ్‌మార్నింగ్ మావయ్యా" అని అంది.

"ఆc ఆc గుడ్‌మార్నింగ్... ఏమిటమ్మా సంగతులు"

"షాపుదాకా వచ్చారు. దగ్గరేకదా ఇక్కడికి రావొచ్చుగా"

"రేపు వస్తున్నాం కదమ్మా"

"మీకోసం ఎదురు చూస్తూవుంటాం మావయ్యా" అంటూ తన సంతోషాన్ని వ్యక్తంచేసింది.

మరుసటిరోజు శనివారం. ఆదివారంతో కలుపుకొని రెండ్రోజులు శేషగిరి మాష్టారువా ళ్ళతో ఎంజాయ్ చెయ్యాలని ఆఫీసుకి సెలవు పెట్టాడు సురేష్. వాళ్ళకోసం స్పెషల్‌గా ఏయే ఐటమ్స్ చెయ్యాలో సుమతితో డిస్కస్

చేసి కావలసిన వస్తువులు తెచ్చాడు.

తెల్లవారి తొమ్మిదింటికి వచ్చారు శేషగిరి మాష్టారు, పద్మావతమ్మ. వాళ్ళతో లక్ష్మి, రామకృష్ణ కూడా వచ్చారు. ఇంట్లోకి అడుగు పెడుతూ వుంటే శేషగిరి మాష్టారికి రామకృష్ణ ఇల్లు గుర్తుకు వచ్చింది. లోపలికి వచ్చి చూశాడు. హాలు, కిచెన్, బెడ్‌రూమ్ అన్నీ ఆ ఇంట్లో వున్నట్లే వుండడంతో దీనిప్రకారం ప్లాన్ చేసి కట్టించాడు రామకృష్ణ అని అనుకున్నాడు.

ఆ మర్నాడు మధ్యాహ్నం దాకా వున్నారు వాళ్ళు. వాళ్ళతో గడపడం గొప్ప అనుభూతిగా వుంది సుమతి, సురేష్‌కి.

పద్మావతమ్మ "ఇప్పుడొద్దమ్మా" అని వారించినా సుమతి వినిపించుకోకుండా ఆమెకి చీరె, జాకెట్టు పెట్టింది.

ఆ రాత్రి శేషగిరి మాష్టారు, పద్మావతమ్మ తిరుగు ప్రయాణం అవుతూవుంటే కుమారయ్యా వాళ్ళు కూడా బయల్దేరారు.

రామకృష్ణ వాళ్ళ కంప్యూటర్ సంస్థలో వున్న ట్రావెలర్స్ కౌంటర్‌లోనే టిక్కెట్లు బుక్ చేశాడు.

ఎనిమిదిన్నరకి వచ్చింది బస్సు.

"నాయనా రామకృష్ణా వస్తామయ్యా" శేషగిరి మాష్టారు బస్సు ఎక్కబోతూ భుజం తట్టి చెప్పాడు.

"అప్పుడప్పుడు వస్తూవుండండి మాష్టారూ" అభ్యర్థిస్తున్నట్టుగా రామకృష్ణ అంటుంటే అతని కళ్ళు చెమ్మగిల్లడం చూసి శేషగిరి మాష్టారు కళ్లు తుడుచుకున్నాడు.

సెకన్లు నిమిషాలుగా మారిపోతున్నాయి.

బస్సు కదిలిపోతుంటే అంకమ్మ తల్లి గుర్తుకు వచ్చింది రామకృష్ణకి. ఆ తల్లి దయ వల్ల ఆదిదంపతుల దర్శనభాగ్యం కలిగింది. మరల ఆ అదృష్టం వుందో లేదో

'అమ్మా అంకమ్మతల్లీ నీ పేరుతో పొంగలి పెట్టుకుంటామమ్మా. నాకు మరల నా గురువుగారి దర్శనభాగ్యం ఒక్కసారి కలిగించమ్మా...' అప్రయత్నంగా కళ్లు మూసుకొని రెండు చేతులూ కలిపి నుదుటికి తాకిస్తూ దణ్ణం పెట్టుకొన్నాడు రామకృష్ణ.

★ ★ ★

సూర్యోదయం అవుతూ వుంది.

కందుకూరునుంచి వచ్చిన బస్సు శాఖవరం అంకమ్మ గుడిముందు ఆగింది. అందులోంచి రాఘవయ్య, పార్వతి దిగగానే చక్రవర్తిని ఆధారంగా చేసుకొని శివరామయ్య నెమ్మదిగా దిగాడు.

రెండు నెలలుగా వాళ్ళు నెల్లూరు ఆస్పత్రిలో వున్నారు. కాలు నయమై శివరామయ్య నిదానంగా నడుస్తుంటే డాక్టరు తగు సలహాలిచ్చి డిశ్చార్జ్ చేశాడు.

ఆ రెండు నెలల కాలంలో చక్రవర్తి భూదేవమ్మ, రాఘవయ్యా వాళ్ళకి దేవుడిలా కనపడ్డాడు. శివరామయ్యని ఆస్పత్రిలో చేర్పించిన దగ్గరినుంచీ తిరిగి ఇంటికి తీసుకొని వచ్చేవరకు అన్ని పనులు తనే చేశాడు. ఖర్చు చేసిన ప్రతిపైసా అతని చేతులమీదుగానే. ఇంజక్షన్ చేయించినా, మందులు కొన్నా, కాఫీ, టిఫిన్‌లు తెచ్చినా అన్నీ అతనే.

శివరామయ్యని ఆస్పత్రిలో చేర్పించి ఒంగోలు ఫోన్ చేశాడు. వెంటనే వాణి, కిరణ్‌కుమార్ బయల్దేరి వచ్చారు. వచ్చారేకానీ పాపం వాళ్ళు మూడు రోజులకన్నా ఎక్కువ వుండలేకపోయారు. అక్కడ చక్రవర్తి ప్రవర్తన కిరణ్‌కుమార్‌కి మనస్తాపాన్ని కలిగించింది. శివరామయ్యపట్ల చక్రవర్తికి ఎంత బాధ్యత వుందో తనకీ అంతే వుందనుకొని కిరణ్‌కుమార్ తన వంతు సహాయపడాలనుకొని ముందుకు వచ్చి చొరవ తీసుకోబోతుంటే పెత్తనం అంతా తనదేనన్నట్లు చక్రవర్తి అతనిని ఎక్కి రానివ్వలేదు. అందుకు వాణికి చిర్రెత్తింది. ఆవేశాన్ని ఆపుకోలేక నోరు చేసుకోబోతుంటే ఆస్పత్రిలో అసహ్యంగా వుంటుందని కిరణ్‌కుమార్ ఆమెని వారించాడు.

మూడవరోజు సాయంకాలమే ప్రయాణమై తిరిగి వచ్చిన తర్వాత కూడా వాణి, కిరణ్‌కు





మార్ మనసులు చక్రవర్తిపట్ల స్పందిస్తూనే వున్నాయి.

"ఎట్లయినా చక్రవర్తితో ప్రమాదమే" అన్నాడు కిరణ్‌కుమార్.

"చిన్నగా అంటారా మహా సొమ్ములాగుడు మనిషి అయితేనూ"

"అయినా మనం చక్రవర్తిని గురించి అనుకొంటే ఏం లాభం. మీ తాతా, అమ్మమ్మని అనాలిగానీ, వాళ్ళు అవకాశం కల్పిస్తున్నారు. అతను దాన్ని క్యాష్ చేసుకొంటున్నాడు"

"వాళ్ళమీద దొంగ ప్రేమను వొలకబోస్తూ ఇద్దరిమధ్యా చేరి పెద్దనాయనా, పెద్దమ్మా అంటూ ఒకటే గుసగుసలు. మరీ మా తాత అయితేనా ఆయన భుజంమీదా, పొట్టమీదా చేతులేసి తెగ నిమురుతాడు. కేజిన్నర బియ్యంకూడు తింటాడు. ఇంకా మా అమ్మమ్మ మహా అతిచేస్తుంది. ఎదురుగా కూర్చుని తిను నాయనా తిను నాయనా అంటూ తోసితోసి పెడుతుంది పాపిష్ఠిది. కన్నకొడుకుని మర్చిపోయింది. ముందు ముందు అనుభవిస్తుంది.

"అది మాత్రం మహాదుర్మార్గం వాణి. కన్న వాళ్ళకి కొడుకూ ఒకటే, కూతురూ ఒకటే. కుటుంబం అన్న తర్వాత అప్పుడప్పుడూ ఇంట్లో అత్తా కోడళ్ళ మధ్య, వదినా ఆడబిడ్డల మధ్య తగాదాలు జరగడం సహజమే. అంతమాత్రాన ద్వేషం పెంచుకుని కొడుకూ, కోడలిని దూరం చేసుకోరు. మనస్పర్థలు వచ్చి కలిసి వుండలేకపోతే కొంతపొలం పంచిచ్చి పండించుకు తినమని వేరు కాపురం పెట్టిస్తారు..."

"అసలు మా అమ్మేనండీ ఆ ఇంటికి వుండు. సొంత తమ్ముడి పొట్ట కొట్టింది"

గలగలా వాగేస్తుంది అనుకొన్న వాణి హృదయంలో అంత ఆవేదన దాగివుందని గ్రహించలేకపోయాడు కిరణ్‌కుమార్. అమ్మని, అమ్మమ్మనీ, తండ్రినీ, తాతనీ గురించి అసహ్యించుకొంటుంటే వాళ్ళకి స్వాతి మీద ఎక్కువ ప్రేమ అనీ, ఆమెకి కావలసినవన్నీ సమకూరుస్తూ బాగా జరుపుతున్నారని ఈర్ష్యతో, అక్కసుతో వుంటుందని అనుకొనేవాడు.

అది నిజమా కాదా అని దానిని గురించి పెద్దగా పట్టించుకోలేదు కిరణ్‌కుమార్. ఆయా సందర్భాలలో వాణి ప్రవర్తనను బట్టి ఒకసారి నిజం అనిపిస్తే, ఇంకోసారి నిజం కాదనిపిస్తుంది. అయినా ఆ నిజానిజాలతో తనకు సంబంధంలేదు. తనకు అనవసరం కూడానూ.

మొత్తంమీద రామకృష్ణకి అన్యాయం జరిగిందని మాత్రం అనుకొన్నాడు, తను రామకృష్ణని చూడకపోయినప్పటికీ.

★ ★ ★

ఇంట్లో ఎవరికీ ప్రశాంతత లేదు. ఎవరేం మాట్లాడినా వాళ్ళకి ఒకటికి నాలుగు వడ్డించడానికి వెనకాడడం లేదు రాణి.

రాఘవయ్య ఆలోచనలో పడిపోయాడు. భూదేవమ్మ ముక్కుచీదడం ఎక్కువయింది. ఎంత తమాయించుకొందామనుకొన్నా పార్వతికి అప్పుడప్పుడు రాణిమీద కోపం వస్తూనే వుంది.

ఉండబట్టలేక "నీకీ జన్మలో పెళ్లికాదులే. ఏళ్ళు పైబడి వయసు ముదిరితే నిన్ను చేసుకోడానికి ఎవరూ ముందుకు రారు" అని భయపెట్టింది కూడా.

అందుకు రాణి "అయితే మానిలే మీరు తెచ్చే ముక్కూమొహం లేని అనాకారిని కట్టుకొని వాడితో కాపురం చేసేదానికన్నా అసలు పెళ్ళి లేకుండా వుండడమే మేలు" అని ఎన్నిసార్లన్నదో.

తన భర్త అందంగా, ఉద్యోగస్తుడై వుండాలని ఆమె కోరిక. రాఘవయ్యా వాళ్ళు అందుకు అనుకూలంగానే సంబంధాలను అన్వేషిస్తున్నారు. కానీ రాణి పెళ్ళికొడుకుని సెలక్ట్ చేసుకొనే విషయంలో ఎవరిమాటా వినడంలేదు. పెళ్ళిచూపులరోజున స్వీటూ, హాటూ తీసుకొని స్వాతి, చక్రవర్తి రయ్‌మంటూ బండిమీద రావడం- అబ్బాయి



పొట్టిఅనో, పొడుగు ముక్కు అనో, వంకర పళ్ళు అనో, ఎరుపు లేదనో ఏదో ఒక వంక పెట్టి రాణి తిరస్కరించడం.

సంబంధాలు చూడడం మొదలుపెట్టిన రోజులలో ఇది కాకపోతే ఇంకో సంబంధం చూద్దాంలే అనేవాళ్ళు రాఘవయ్యవాళ్ళు. రానురాను వాళ్ళకే నీరసం వచ్చేసింది.

స్వాతికి అయితే మహా చిర్రెత్తింది. రాణి వినేట్టు ఒకసారి "దీనికి మామూలు మనుషులు ఆనరు. సినిమా హీరోలను తేవాల" అని అంది. వెంటనే అందుకొంది రాణి. "దేశం గొడ్డుపోలా లక్షా రెండు లక్షలు పారేస్తే మంచివాడే వస్తాడు" అని అంది.

పార్వతికి కోపం వచ్చింది.

"లక్షలు లక్షలు తేవడానికి ఇక్కడ వుండొద్దు..."

"ఉండకుండా ఏమయ్యింది. డబ్బంతా ఏంచేశారు? నాకేమన్నా ఇచ్చారా? " భయం లేకుండా రాణి మాటకు మాట అనేస్తుంటే ఎవరన్నా వింటారేమో పరువు పోతుందని భూదేవమ్మ కంటనీరు పెట్టుకొంది.

"అమ్మా, అమ్మా... నామాట వినవే నీకు దణ్ణం పెడతాను. గోల చెయ్యకే. నీకేలోటూ చెయ్యను. నీకు నచ్చని సంబంధం మేం చెయ్యమమ్మా. ఒక అరెకరం అమ్మేసయినా మంచి సంబంధం తెస్తాం తల్లీ" ఏడుస్తూనే భూదేవమ్మ రాణిని బతిమాలింది, వేడుకొంది.

ఆమె ప్రవర్తన అసహ్యంగా వుంది రాణికి.

"ఫో అవతలికి ఫో, నీ మొహం చూస్తేనే పాపం వస్తుంది. అంతా దొంగబుద్ధి, దొంగ ఆలోచన... డబ్బంతా ఎక్కడ తగలబెట్టిందో. నాకోసం అర ఎకరం అమ్ముతుందట బోడి... కష్టపడి సంపాయించింది కావాలి"

రాణి మాటలు వింటూవుంటే రాఘవయ్యకి తల తిరుగుతోంది. కోపం వచ్చినా ఏమీ అనలేకపోయాడు.

"ఏమిటే నువ్వు దానిమీద అరుస్తున్నావు..." అంటూ భూదేవమ్మని అరుస్తున్నట్టుగా లేచిపోయి "ఏందమ్మా రాణీ నువ్వు మరీ చిన్నపిల్లలా దానితో... దానికసలు ఏంతెలుసని? ఒట్టి పిచ్చిదయితేనూ... నీకు నేనున్నాను కదమ్మా..." అంటూ రాఘవయ్య సముదాయించబోతుంటే "నువ్వేం నన్ను కాకా పట్టొద్దులే. నాకంతా తెలుసు. మీరంతా ఒకటేలే... ఇదిగో తాతా, నా కోసం మీరింక సంబంధాలు చూడొద్దు. నేనసలు పెళ్ళే చేసుకోను" అనేసి అక్కడినుంచి విసవిసా వెళ్ళిపోయింది రాణి.

ఆ మూడోరోజు కిరణ్‌కుమార్‌నుండి ఉత్తరం వచ్చింది. "ఇక్కడొక సంబంధం వుంది పెదనాన్నగారూ, అబ్బాయి పేరు సందీప్. కలక్టరేట్‌లో క్లర్క్ ఉద్యోగం. ఎర్రగా, అందంగా వుంటాడు. మన రాణికి నచ్చుతుందని మీకు లెటర్ రాస్తున్నాను. ఒకసారి మీరొచ్చి ఆ అబ్బాయిని చూడండి. వీలయితే రాణిని కూడా తీసుకొనిరండి. ఒకేసారి ఇక్కడే పెళ్ళిచూపుల కార్యక్రమం ఏర్పాటు చేద్దాం" అని రాశాడు.

ఆలస్యం చేయకూడదనిపించింది రాఘవయ్యకి. మర్నాడే రాణిని తీసుకొని పోయిరమ్మని చెప్పాడు పార్వతికి, భూదేవమ్మకి.

"నువ్వు గూడా రా, అక్కడేదన్నా మంచీ చెడ్డా మాట్లాడుకోవలసివస్తే... ఒకేసారి మాట్లాడుకోవచ్చు" అని చెప్పింది భూదేవమ్మ.

'సరే' అని రాఘవయ్య బయల్దేరుతూ, "కందుకూరులో దిగి చక్రవర్తిని కూడా తీసుకొని పోదాం" అన్నాడు.

రాణికి అసహ్యం అయింది.

"ఇంకెవరూ వద్దులే, మనం చాలు" అంది.

"అదికాదే..." భూదేవమ్మ ఏదో అనబోతుంటే "అక్కడ ఆ బావ వున్నాడ్లే. అన్నీ మాట్లాడగలడు"

ఎవరేం మాట్లాడలేదు. అసలు రాణిని బయల్దేరదీయడానికి వాళ్లు ఎంత శ్రమపడ్డారో. అందరూ తలా ఒకపక్క బతిమాలగా వాళ్ళమీద దయ చూపుతున్నట్టు వూం అని





లేచి ప్రయాణమయ్యింది. ఇంకా చక్రవర్తిని తీసుకొనిపోయే విషయంలో ఆమె మాట వినకపోతే మళ్ళీ ఎక్కడ అలిగి కూర్చుంటుం దోనని భయం.

ఒంగోలు వెళ్ళినా ఆ సంబంధం ఖాయం అవుతుందని నమ్మకం వాళ్ళకి లేదు. అలా అని పోకుండా వుండలేకపోయారు. బస్సు ఎక్కేముందు అంకమ్మ గుడిలోకి పోయి దణ్ణం పెట్టుకొన్నారు.

ఆ తల్లి చలువో, రాణి అదృష్టమో లేక రాఘవయ్యా వాళ్ళమీద కాలం కనికరం చూపిందో, మొత్తంమీద రాణికి ఆ సంబంధం కుదిరింది.

★ ★ ★

పెళ్లిపనులు చకచకా సాగుతున్నాయి.

ముహూర్తం పెట్టుకున్న తర్వాత రెండురోజులకే వచ్చారు స్వాతి, చక్రవర్తి.

భూదేవమ్మకి కాలు నిలవడంలేదు. మహా సంబరంగా వుంది.

వేపచెట్టుకింద మంచంమీద కూర్చుని రాఘవయ్య ఇంటిముందున్న పాత పందిరిని పీకేయించి కొత్తది వేయిస్తున్నాడు. గ్లాసు నిండుగా చిక్కటి కాఫీ వేడివేడిగా తెచ్చి ఇచ్చింది పార్వతి.

ఆయన కాఫీ రుచిని అనుభవిస్తూ వుంటే పంచలోంచి "వాణీవాళ్ళు గూడా వస్తే బావుండు" అని అంది భూదేవమ్మ.

"మనం రమ్మన్నాంగా..." రాఘవయ్య అంటూవుంటే "రమ్మన్నాంలే... వస్తేగా" రాగం తీసింది.

"వాళ్ళంత తేలిగ్గా రారులేమ్మా... మనం అనుకోవడమేగానీ" పార్వతి అక్కడకు వచ్చింది.

"అబ్బాయికి సెలవుదొరకాలి కదమ్మా..." రాఘవయ్య అంటూవుంటే "వాణి రావచ్చుగా" అంది పార్వతి.

"అంత తేలిగ్గా వచ్చే మనిషి కాదులేవే" అని భూదేవమ్మ అంటూవుంటే రాఘవయ్యకి కట్నకానుకలు మాట్లాడుకొన్న తర్వాత "డబ్బు అవసరమయితే నేనూ కాస్త సర్దుతాలే పెదనాన్నా" అని కిరణ్‌కుమార్ అంటే అందుకు భూదేవమ్మ మొహమాటపడి "ఎందుకులే బాబు... వద్దులే" అనడం గుర్తుకు వచ్చింది. కాఫీగ్లాసు కిందపెడుతూ మంచం కోడుకి తలను ఆనించి మూలగ్గా పడుకొన్నాడు.

వీధిలో ఏవో అరుపులు వినబడుతుంటే లేచి బయటకు వెళ్ళాడు రాఘవయ్య. పోతు రాజుగారి, ఇంటిముందు జనం గుమిగూడి వుండడం చూసి అటునుంచే జానీ బాషా వస్తుంటే అతన్ని ఆపి, "ఏంటా గొడవ" అని అడిగాడు.

"పోతురాజు భార్య నాగేశ్వరమ్మలే, ఆయన పోగానే కొడుకులు వేరుపడ్డప్పుడు తనకు కావాలని ఇరవై సవర్ల బంగారం, యాభైవేల రూపాయల డబ్బు తీసుకుని కూతురు దగ్గరికి పోయిందిగా. అక్కడేం బెడిసిందో. తిరిగి వచ్చేసింది. ఇప్పుడు కోడళ్ళు ఆ డబ్బూ, బంగారం తెస్తేనే ఇంట్లోకి అడుగుపెట్టమంటున్నారు" అని చెప్పాడు జానీ బాషా

క్షణం నిశ్చేష్టుడయ్యాడు రాఘవయ్య.

"నాగేశ్వరమ్మ ఏమంటుంది. తెస్తానంటుందా? "

"తేవడానికి ఆమెకాడ ఏముందీ... అంతా అల్లుడి హస్తగతమైతే" అంటూ జానీ బాషా వెళ్ళిపోయాడు.

రాఘవయ్యలో ఏదో నీరసం చోటుచేసుకుంది. ఐదు నిమిషాలు అలాగే వుండిపోయి తిరిగివచ్చిన తర్వాత యాంత్రికంగా పందిరి వేయించాడు.

ఆ రాత్రి అర్ధరాత్రి దాటిన తర్వాత నిద్ర పట్టింది.

మరుసటిరోజు మిగిలిన పనులు సున్నం కొట్టించడం, రంగుకాగితాలు అతికించటం, మామిడాకులు కట్టించడం అయిపోయాయి.

ఇంటికి పెళ్ళికళ వచ్చేసింది.

★ ★ ★

"హమ్మయ్యా... ఆ మూడు ముళ్లు పడ్డాయి" అనుకొని సంతోష పడిపోయింది



భూదేవమ్మ.

తలంబ్రాలు పోసుకొన్న బట్టల్లో రాణి నిండుగా కనిపిస్తుంటే, 'బాధ్యతలన్నీ తీరిపో యాయి' అని రాఘవయ్య సంతృప్తిపడ్డాడు. అంపకాల సమయంలో కళ్లు చమర్చి తుడుచు కొంటుంటే "మొత్తంమీద రాఘవయ్య మనవ రాళ్లకి పెళ్ళిళ్లు చేస్తున్నాడు, పురుళ్ళు పోస్తు న్నాడు" అని వినబడి అటుకేసి తిరిగాడు. కొద్దిదూరంలో సింగరయ్య పక్కవాళ్ళతో అంటుండడం కనబడింది.

చురుక్కుమన్నది రాఘవయ్యకి. ముల్లు గుచ్చుకొన్నట్టయి, రంగు మారుతున్న మొహంలోకి బలవంతంగా ప్రసన్నతను తెచ్చుకొన్నాడు.

అయినా ఆ ప్రసన్నతను అలాగే నిలుపుకో లేకపోతున్నాడు. ఏదో గిలి. ఎవరో ప్రశ్నిస్తు న్నట్టు హృదయదౌర్బల్యం. మనసులో ఆలో చనలు మొదలయ్యాయి. అప్పుడప్పుడూ పోతురాజు గుర్తుకువచ్చి ఆయన చనిపోయి నప్పుడు కొడుకులిద్దరూ చన్నీళ్లు తలలమీద పోసుకొని తడి పంచలతో శ్మశానానికి వెళ్ళడం- అప్పుడు శేషగిరి మాష్టారిని పట్టు కొని రోదించిన నాగేశ్వరమ్మ రూపం కళ్లల్లో కనబడడం ప్రశాంతత కొరవడింది. అయినా గంభీరంగానే వుంటున్నాడు. కానీ ఆవహిం చిన దిగులు మానసికంగా నిర్వీర్య పరు స్తూనే వుంది.

★ ★ ★

రామకృష్ణ సీరియస్‌గా అకౌంట్స్ చూస్తు న్నాడు.

"సార్... మీ కోసం ఎవరో వచ్చారు" ఆఫీ స్‌బాయ్ వచ్చి చెప్పాడు.

"నా కోసమా? ఎవరు? లోపలకి రమ్మన కపోయావా? " రామకృష్ణ అంటూవుంటే "నేను రమ్మన్నాను సార్. ఆయన రాలా మిమ్మల్ని రమ్మన్నారు. బయట వున్నారు"

రామకృష్ణ పెన్ను జేబులో పెట్టుకొంటూ బయటకు నడిచాడు.

రాఘవయ్య పోలికలు వున్న రామకృష్ణని సులభంగానే గుర్తుపట్టిన కిరణ్‌కుమార్ "నమస్తే సార్... మీరు రామకృష్ణగారుకదా" అని అంటూ వుంటే రామకృష్ణ "మీరు" అని అడిగాడు.

"చెప్తాను సార్. ఓ టెన్ మినిట్స్ మీతో మాట్లాడాలి. అలా వస్తారా" అంటూ క్యాంటీ న్‌వైపు చెయ్యి చూపించాడు.

"రండి" అని రామకృష్ణ క్యాంటీన్‌వైపు కది లాడు.

క్యాంటీన్‌లోకి వచ్చి ఎదురెదురుగా కూర్చు న్నారు. కూర్చుంటుండగానే "నా పేరు కిరణ్ కుమార్" అంటూ చెప్పాడు.

రామకృష్ణ కిరణ్‌కుమార్ మొహంలోకి చూశాడు "చెప్పండి" అన్నట్టు.

"నేను వాణి భర్తని"

రామకృష్ణ భృకుటి ముడిపడింది.

"వాణి ఎవరు? "

కిరణ్‌కుమార్ చిన్నగా నవ్వాడు.

"మీ మేనకోడలు"

వెంటనే రామకృష్ణ "మేనకోడలా... నాకె వరూ లేరే" అని ఠకీమని అన్నాడు.

"అదే సార్... మీ అక్కయ్య పార్వతిగారి కూతురు"

"నాకసలు అక్కయ్యే లేదుకదండీ"

కిరణ్‌కుమార్‌కి అనుమానం వచ్చింది తను మాట్లాడుతున్నది అసలు రామకృష్ణతో నేనా అని.

"అదేంటి సార్ మీ సొంతవూరు శాఖవ రమే కదూ"

"ఒకప్పుడు... ఇప్పుడు కాదు"

సప్లయర్ వచ్చి "టీ చెప్పనా సార్" అని అడిగాడు.

"వద్దు" అన్నాడు రామకృష్ణ.

కిరణ్‌కుమార్‌కి తల గిర్రున తిరిగింది. రామకృష్ణను గురించి చాలా గొప్పగా వూహించుకొన్నాడు. తను ఫలానా అని చెప్ప కోగానే మహా సంతోషపడి మంచి రెస్పెక్ట్ ఇస్తాడని అనుకొన్నాడు. అదేంలేదు. అతని శ్రేయోభిలాషిగా వాళ్ళ ఇంటి విషయాలు





చెప్పాలని వచ్చిన తనకు కనీసం రెస్పెక్ట్ ఇవ్వకపోవడం, కర్టసీకయినా టీ ఆఫర్ చెయ్యకపోవడం బాధగా వుంది. లేచిపోవాల నిపించింది.

"ఏమిటీ మాట్లాడాలన్నారు?" అడిగాడు రామకృష్ణ.

"మీరు వూరికి ఎప్పుడొస్తారు"

"అక్కడ ఎవరున్నారండీ... రావడానికి"

"అదేమిటి సార్ అలా అంటున్నారు. అక్కడ మీ అమ్మా, నాన్నా వాళ్ళు వున్నారు కదా..."

"నాకసలు అమ్మా, నాన్నా అనే వాళ్ళెవరూ లేరండీ"

ఇంకేం మాట్లాడలేకపోయాడు కిరణ్‌కుమార్.

"సార్ మీరూ"

"ఆగిపోయారేం మాట్లాడండి" అన్నాడు రామకృష్ణ.

"ఇంకేం మాట్లాడను. మీరంత తీవ్రంగా మాట్లాడుతుంటే"

"లేదు... నేను యదార్థమే మాట్లాడుతున్నాను. నాకక్కడ ఎవరూ లేరు అమ్మ లేదు... నాన్న లేడు, అక్కా, బావా ఎవరూ లేరండీ. వున్నదల్లా నన్ను అక్కున చేర్చుకొని అన్నం పెట్టి ఆదరించిన నా గురువు శేషగిరి మాష్టారు, వారి సతీమణి పద్మావతమ్మగారు వాళ్ళే నాకున్నదక్కడ. వాళ్లే నా వాళ్లు"

రామకృష్ణ అంటూ వుంటే కిరణ్‌కుమార్ "నాకంతా తెలుసండీ. మీకు జరిగిన అన్యాయం గురించి వాణి చెప్పింది" అన్నాడు.

"ప్లీజ్ ఆ విషయాలేం మాట్లాడవద్దండీ"

"నేను మీ కుటుంబవిషయాలను గురించి మాట్లాడాలని వచ్చాను"

"వద్దు... మాట్లాడొద్దు... నాకూ ఆ కుటుంబానికీ ఎలాంటి సంబంధాలూ లేవు"

"అంటే మీరింక ఆ వూరు రారా"

"రాను"

"మరి అక్కడవున్న ఇల్లూ, పొలాలూ"

"నాకవసరం లేదు"

కిరణ్‌కుమార్ నోట మాటలు రాలేదు. అయిదు నిముషాలు అలాగే వుండి తర్వాత "అంతేనంటారా" అని అడిగాడు.

"అంతే"

ఓ రెండు నిముషాలు రామకృష్ణ మొహంలోకి చూసి "యింక నేను వెళ్తాను" అన్నాడు కిరణ్‌కుమార్.

"అలాగే"

కిరణ్‌కుమార్ లేచి వెళ్లిపోయాడు.



రామకృష్ణ ఇంటికి రాగానే లక్ష్మికి కిరణ్ కుమార్ వచ్చిన విషయం చెప్పాడు.

"అయినా అదేమిటండీ అలా చేశారు. అతను అంత దూరంనుండి మిమ్మల్ని వెతుక్కుంటూ వస్తే కనీసం టీ కూడా యిప్పించకుండా పంపించేశారు" అని బాధపడింది లక్ష్మి.

"అదే వేరే ఎవరయినా అయివుంటేనా ఒక్క టీయేగాదు ఇంటికి తీసుకొచ్చి సకలమర్యాదలూ చేసి వుండేవాడిని" రామకృష్ణ అంటూవుంటే "మరి అతనేం పాపం చేశాడండీ అంత కఠినంగా ప్రవర్తించారు" అని లక్ష్మి అడిగింది.

"వాళ్ళ గాలి కూడా మనకు సోకగూడదు"

"మనకు అన్యాయం చేసింది మీ అమ్మా, నాన్నండీ. అతను కాదు. మీరెన్నిసార్లు అన లేదు. శత్రువునయినా సరే మనం చెడుగా చూడగూడదని. మనం పవిత్రంగా వుండాలి, మన మనసులు పవిత్రంగా వుండాలి. మన ఇల్లు దేవాలయంలా వుండాలని అంటుంటా రుగా మీరు. మరి ఇలా చేశారెందుకండీ"

రామకృష్ణ ఆలోచనలో పడ్డాడు. తను తప్పుచెయ్యకూడదనుకొన్నాడు. ఎవరినీ నొప్పించకూడదనుకొన్నాడు. ఎవర్నీ కష్ట నష్టాలకు గురిచెయ్యకూడదనుకొన్నాడు. కిర ణ్‌కుమార్ విషయంలో తప్పు చేశానని ఫీల వుతూ ఏదో పెద్దమ్మ నెత్తినెక్కి తన యింగితాన్ని తొక్కేసి అలా చేయించిందని తననుతాను నిందించుకొన్నాడు. అసలు కష్టాలు అనుభవించిన లక్ష్మి అదంతా పీడక లలా మర్చిపోయి మంచితనాన్ని పంచుతూ వుంటే తనేం చేశాడు, తన సంస్కారం ఏమ య్యింది. అంత కుసంస్కారిగా ఎలా ప్రవర్తిం చగలిగాడు. తనలోతాను సిగ్గుపడుతూ లక్ష్మి సంస్కారాని తలచుకొని నిజంగా తను అదృ ష్టవంతుడే అనుకున్నాడు. అదేమాట అన్నాడు.

"అవునండీ. మీరు నిజంగా అదృష్టవం తులే" లక్ష్మి అంటూ వుంటే "నువ్వే లక్ష్మి దురదృష్టవంతురాలవు" అన్నాడు.

లక్ష్మికి షాక్‌లా తగిలాయి ఆ మాటలు. చివుక్కున కళ్ళు పెద్దవిచేసి రామకృష్ణ మొహంలోకి చూసింది.

"అదేమిటండీ అలా అంటున్నారు"

"నన్ను కట్టుకొని కష్టాలు పడ్డావు"

"అదేంకాదు. ఇద్దరం అదృష్టవంతులమే. మనకు మన క్షేమం కోరే దైవం లాంటి బాబాయిగారు వున్నారండీ"

"ఆయన దర్శనభాగ్యం మళ్లీ ఎపుడు కలు గుతుందో లక్ష్మి"

"దేవుడు దయతలచినప్పుడండీ"





★ ★ ★

రాత్రి అన్నం తిని పందిట్లో మంచం వాల్చుకొన్నాడు రాఘవయ్య. పక్కేసుకొని పడుకొని పదినిముషాలకే లేచి కూర్చున్నాడు.

ఈమధ్య తరచూ పోతురాజు గుర్తుకు వస్తున్నాడు. రాణి కాపురానికి వెళ్లిపోయిన తర్వాత ఏదో మనో దౌర్బల్యం అతనిని ఆవ హించింది. ఇదివరకటిలా ధైర్యంగా వుండలే కపోతున్నాడు. మానసికంగా పతనమవుతూ మేకపోతుగాంభీర్యాన్ని మొహానికి పులుము కొంటున్నాడు. అయినా అప్పుడప్పుడూ పర ధ్యానం తప్పడంలేదు.

లేచి వీధిలోకి వచ్చాడు. రామాలయం మైకులోంచి భజన కీర్తనలు వినిపిస్తున్నాయి. అటువైపు నడిచాడు.

ఆలయంలోకి అడుగుపెడుతూవుంటే ఎదు రుగా గర్భగుడిలోంచి దీపారాధన వెలుగు కనబడుతూ వుంది. ఆ గుడి ముందు భజన కార్యక్రమం భక్తిభరితంగా జరుగుతోంది. ఆడ, మగ రెండు వర్గాలై విడివిడిగా కూర్చొని వున్నారు. మధ్యలో శేషగిరి మాష్టారు పూజారి పక్కన కూర్చుని అటూఇటూ తలూ పుతూ తాళంవేసి "హరే రామా... హరే రామా... రామరామ హరేహరే...హరే కృష్ణా హరే కృష్ణా... కృష్ణకృష్ణ హరేహరే" అని రాగయుక్తంగా చెప్తూవుంటే తక్కిన వాళ్ళు తన్మయులై వంతపాడుతున్నారు.

అది చూడడంతోటే రాఘవయ్యకి అడుగు ముందుకుపడలా. గిరుక్కున వెనుదిరిగాడు. అయినా అతని చెవులను ఆ హరే రామ స్మరణ వెంటాడుతూనే వుంది.

ఇంటికి వస్తూవుంటే దారిలో సింగరయ్య ఎదురై "కాశీయాత్రకి వస్తావటోయ్" అని అడిగాడు.

"నువ్వు పోతున్నావా ఏంటి? " రాఘవయ్య అడుగుతూవుంటే "అవునోయ్. మా వాడు మాకు తెలియకుండానే డబ్బు కట్టేసి టిక్కెట్లు తెచ్చేశాడు. నేనూ, మా ఆవిడ పోతున్నాం" అని చెప్పాడు.

"ఏమాత్రం అవుద్దేమిటి? "

"మా ఇద్దరికీ కలిపి పాతిక వేలంట. పది హేను రోజులు యాత్రలంట. నువ్వు, మీ ఆ విడా ఇద్దరూ రండోయ్. ఇప్పుడు కాకపోతే యింకెప్పుడు చూస్తారు"

రాఘవయ్యకి వుత్సాహం కలిగి పోతే బావుండు అనిపించింది. అంతలోనే పాతిక వేల రూపాయలనేసరికి నీరసించాడు. రాణి పెళ్లికి యాభైవేలపైన అప్పు చేశాడు. ఇంకా అప్పు తేవడమంటే మాటలుకాదు. అనుకొని "ఇప్పుడు కాదులే" అనేసి వచ్చేశాడు.

ఇంటికి వచ్చేసరికి భూదేవమ్మ నిద్రపోతూ వుంది. తనకు నిద్రపట్టలా. కాశీయాత్రను గురించి ఆలోచిస్తూ వున్నాడు.

"రాఘవయ్యా"

ఆ పిలుపు వినబడి కళ్ళు తెరిచాడు రాఘ వయ్య.

తన పక్కలో శేషగిరి మాష్టారు కూర్చుని వున్నాడు. "నువ్వా అయ్యవారూ!" అంటూ లేచాడు.

"మీ అబ్బాయి మిమ్మల్ని కాశీయాత్రకు పొమ్మని డబ్బు పంపించాడు" అంటూ శేష గిరి మాష్టారు తన లాల్చీ జేబులోంచి డబ్బు తీసి "ఇంద పాతికవేలు" అని చెప్పి రాఘ వయ్య చేతిలో పెట్టాడు.

నమ్మలేకపోయాడు రాఘవయ్య.

"నువ్వు, భూదేవమ్మ బయల్దేరి, పోయి రండి" శేషగిరి మాష్టారు చెప్తూవుంటే "నేను పాపం చేశాను అయ్యవారా" అని అదోలా అన్నాడు.

"గతాన్ని మర్చిపోండి. మీ అబ్బాయి తొందరలో వస్తాడంట. మిమ్మల్ని తీసుకొని పోతాడంట" శేషగిరి మాష్టారు చెప్తూవుంటే "మేం వాడికేం పెట్టామయ్యా" అని ఏడ్చేశాడు రాఘవయ్య.

జాలిగా చూశాడు శేషగిరి మాష్టారు.

"ఛ...ఛ... ఏంది రాఘవయ్యా. పెద్దవాడిని... ఇప్పుడతనికేం పరవాలేదు. బాగానే వున్నాడు" అంటూ శేషగిరి మాష్టారు భుజం తట్టి ధైర్యం చెప్పాడు. అలా ఆయన అనున యిస్తూ వుంటే పశ్చాత్తప్తుడయిన రాఘవయ్యలో వుత్సాహం ఊపిరిపోసుకొంది. తను అన్యాయం చేసినా కొడుకు తనపట్ల ప్రేమగానే వున్నాడు అనుకొని సంతోషంగా భూదేవమ్మతో కాశీయాత్రకు వెళ్ళాడు.

పవిత్ర గంగానదిలో స్నానం మహా అదృష్టం అని భూదేవమ్మను గూడా తనతో నీటిలోకి తీసుకొనిపోయాడు. హాయిగా వుంది. ఆడా, మగ మునుగుతూవుంటే అక్కడ ఎంత అద్భుతంగా వుందో. రాఘ వయ్య ఒక్క సారిగా బుడుంగున నీటిలో మునిగి లేచేసరికి పక్కన భూదేవమ్మ లేదు. చుట్టూ చూశాడు కనబడలా. ఆమె గూడా నీటిలో మునిగిందనుకొన్నాడు. అయిదు నిముషాలయ్యింది. ఊహు. ఎదురుగా బుడ బుడమంటూ శబ్దం వినబడి అటుకేసి చూశాడు. నీటిలోంచి ఏదో ఆకారం పైకి లేచింది. తలమీద కిరీటం. చేతిలో ఖడ్గం వుగ్రంగా వుంది. ఆ రూపాన్ని చూడగానే అంకమ్మతల్లి గుర్తుకువచ్చి భయపడిపోయాడు.

'దుర్మార్గుడా' అంటూ ఆమె ఖడ్గం ఎత్తిపట్టుకొని తనవైపే వస్తూవుంది. గడగడలాడిపోయాడు రాఘవయ్య. అక్కడే వుంటే నరికేస్తుందని వెనుదిరిగి పరుగందుకొన్నాడు. ఆమె వెంటబడింది. రాఘవయ్య పరిగెత్తుతున్నాడు. కొండలూ, బండలూ ఎక్కి దాటుతున్నాడు. అలసిపోయి అడుగు వెయ్యలేని స్థితిలో ఆగిపోయాడు. .

అంతే-

అంకమ్మ తల్లి ఎత్తిన ఖడ్గం అతని మెడ మీద పడి "అమ్మా" అంటూ కేకపెట్టడంతో అదిరిపడి లేచింది భూదేవమ్మ. దుప్పటి ముసుగులో వణికిపోతున్న రాఘవయ్యని లేపి "ఏంది ఏంది" అని అడిగింది.

రాఘవయ్య చుట్టూ కలయచూసి తేరుకొంటూ "కలొచ్చింది" అన్నాడు.

★ ★ ★

శివరామయ్య ఆనందంగా వున్నాడు.



తనకింక బాధ్యతలంటూ ఏమీ లేవు. ఉన్న వన్నీ తన ప్రమేయం లేకుండానే నెరవేరాయి. రాణి గూడా ఒక బిడ్డ తల్లి అయ్యింది. వారం రోజుల క్రితమే వచ్చి ఆమె పండంటి మగబిడ్డను కని పురుడుపోసుకొంది. బార సాల రోజున చక్రవర్తి "మీరూ టౌన్‌కి వచ్చె య్యండి మామయ్యా. ఏదన్నా మంచి వ్యాపారం చేద్దాం డబ్బుండి పెట్టుబడి పెట్టగ లిగితే ఫైనాన్స్ వ్యాపారం బ్రహ్మాండంగా వుంటుంది. అయిదు నుండి పది రూపా యలదాకా వడ్డీకి మార్చుకోవచ్చు, సెంటర్‌లో రూమ్ తీసుకొని ఆఫీసు ఓపెన్ చేద్దాం. నువ్వే పనీ చెయ్యొద్దు వూరికే ఆఫీసులో కూర్చో చాలు. మిగిలిన పనులన్నీ నేను చూసుకొంటాను" అని చెప్పాడు శివరామ య్యతో.

శివరామయ్య ఆలోచనలో పడిపోయాడు. అదే మంచిదనిపించింది. పల్లెటూళ్లో వుండే దానికన్నా టౌన్‌లో అయితే హాయిగా వుంటుంది. మంచి కాలక్షేపం. అనిపించి టౌన్‌కి వెళ్లిపోవాలనే కోరిక బలీయంగా నాటుకొంది.

పార్వతితో అన్నాడు. ఆమె వెంటనే స్పందించింది.

"బావుంటుంది. అప్పుడు స్వాతీ, చక్రవర్తి కూడా మనదగ్గరే వుంటారు. వాణి, రాణి అందుబాటులో వుంటారు. వాళ్ళు వచ్చిపోవ డానికి గానీ మనం పోయి రావడానికిగానీ వీలుగా వుంటుంది" అని సంబరపడిపోతూ ఇల్లూ, పొలాలు అమ్మితే ఎంతవస్తుందో లెక్కేసి, "పది అటు ఇటుగా ఎనిమిది లక్షలు వస్తుంది. ఒక లక్ష పెట్టి ఇల్లు కొనుక్కొన్నా, మిగిలిన డబ్బుతో ఏ వ్యాపారం చేసినా కాలు మీద కాలేసుకొని బతకొచ్చు" అని అంది.

శివరామయ్యకు సంతోషం అయ్యింది.

"ఇల్లు, పొలాలు అమ్మడానికి మీ అమ్మ ఒప్పుకొంటుందా" అని అడిగాడు.

"ఎందుకొప్పుకోదు"

"మీ నాయన ఒప్పుకోడేమో"

"మా అమ్మ చెప్తుందిలే. ఒప్పేసుకొం టాడు"

ఆ విషయం భూదేవమ్మ చెప్పగానే రాఘ వయ్య ఇదివరలా "సరే" అని అనలేదు. ఆలోచించసాగాడు.

ఆయన ఒక నిర్ణయానికి రాకముందే భూదేవమ్మ "ఇల్లు, పొలం అమ్ముతాం" అని అక్కడక్కడా అనేసింది. ఆ విషయం వూళ్లో పాకిపోయి కొనుక్కోవాలనుకొన్న వాళ్ళు బేరా నికి రావడం మొదలయ్యింది.

అది పెద్ద నామోషీ అయ్యింది రాఘవ య్యకి. "అమ్మడంలేదు" అని వచ్చిన వాళ్ళకి చెప్పడం మహా చికాకుగా వుంది. ఆయన ప్రవర్తన భూదేవమ్మకి నచ్చలా. అంతకుముం దెన్నడూ తన మాటను కాదని ఎరుగని భర్త అలా ప్రవర్తించడంతో ఆమెలో అసహనం బుసలు కొట్టసాగింది.

అదంతా రాఘవయ్య చూస్తూనే వున్నాడు. నోరు మెదపడంలేదు. ఎలాగూ ఆమె తనతో తగాదాకు దిగుతుంది. ఇద్దరి మధ్యా గొడవ జరుగుతుంది. అనుకొని ఎలా మాట్లాడాలో ఏమేమి మాట్లాడాలో సిద్ధం చేసుకొంటు న్నాడు.

వాతావరణం వేడెక్కుతూ వుంది. ఇంట్లో రాఘవయ్య ఒక్కడే ఒకటి. తక్కిన వాళ్ళంతా ఒకటి. ఏం చెయ్యాలో తోచక పిచ్చి పుడుతూ వుంది రాఘవయ్యకి. వాళ్ళంతా తనకు శత్రు వుల్లా కనబడుతున్నారు. తన ఆస్తిని ఎగరేసు కొని పోవడానికి సిద్ధంగా వున్నారని భయం.

ఆలోచిస్తూవుంటే సహనం నశించి ఆవేశం తన్నుకొస్తూ వుంది. అప్పుడప్పుడూ పెద్దగా ఏడవాలనిపిస్తోంది కూడా.

భూదేవమ్మలో చికాకు తారస్థాయికి చేరు కొంది.

"పొలంగట్లమీద ఇరగబడితే చూసేదిక్కు గూడా లేదు" కచ్చిగా అంది.

రాఘవయ్యకి కోపంవచ్చింది. "అంతగా ఇరగబడితే మీరెవరూ చూడొద్దులే. నా చావు నేను చస్తాను" అని అరిచాడు.





"ఇంకా పొలం పని చెయ్యడానికి వంట్లో శక్తివుందా ఏం? "

"లేకుంటే కౌలుకి పారేస్తాను. అంతేగానీ పొలం మాత్రం అమ్మే పనేలేదు" రాఘవయ్య తెగేసి చెప్పడంతో భూదేవమ్మలో పంతం ఎక్కువయ్యింది. పార్వతి ఆమెని శాంతపరచ డానికి ప్రయత్నిస్తూవుంది. శివరామయ్య ఆలోచనలో పడిపోయాడు.

వాళ్ళమధ్య వుండలేకపోతున్నాడు రాఘ వయ్య. అమ్మ, కూతురు, అక్కా, తమ్ముడు వాళ్ళంతా ఒకటే. తనే పరాయి వాడు అనే భావంతో తిక్కరేగుతోంది.

ఇంట్లో వుండలేక బయటకు వస్తే అక్కడా వుండలేకపోతున్నాడు. ఏదో గిలి. రాణి పెళ్ళి రోజు "మనవరాళ్ళకి పెళ్ళిళ్ళూ చేస్తున్నాడు పురుళ్ళూ పోస్తున్నాడు" అని సింగరయ్య వ్యంగ్యంగా అన్న మాటలు పదేపదే చెవుల్లో ధ్వనిస్తున్నాయి. కలలో కాశీయాత్రకి పోవడం, గంగానదిలో మునగడం, అంకమ్మ తల్లి ఖడ్గంతో తరిమితరిమి తలకాయ నర కడం, కళ్లల్లో కనిపిస్తూనేవుంటే ఏదో ఆందో ళన, భయం రాఘవయ్యని నిర్వీర్య పరుస్తు న్నాయి.

★ ★ ★

సూర్య భగవానుడు అలసిపోయి పడమటి కొండల్లో పడిపోయాడు.

చీకట్లు ముసురుకున్నాయి.

తలారికొండయ్య తప్పెట కొడుతూ "మన వూరి అంకమ్మ తల్లికి తిరణాల చెయ్యాలని పెద్దలు నిర్ణయించారు. అందుకుగాను ఈ రోజు రాత్రి పొద్దుపోయిన తర్వాత బొడ్రాయి దగ్గర ముడుపు కడుతున్నారు. కావున యావ న్మందీ రావలసిందహో" అని వీధిలో చాటింపు వేస్తున్నాడు.

ఆ చాటింపు వినడం తోటే పద్మావతమ్మకి లక్ష్మి, రామకృష్ణ గుర్తుకువచ్చారు.

"ఈ సారన్నా తిరణాలకి రామకృష్ణావాళ్ళని పిలుద్దామండీ" అని అన్నది శేషగిరి మాష్టా రితో.

"వద్దులే... మనం పిలిచినా అతడు రాడు" అని శేషగిరి మాష్టారు చెప్తూవుంటే "పాపం సొంతవూరికి వచ్చేందుకు కూడా నోచుకోలేదు" అని విచారపడింది పద్మావ తమ్మ.

శేషగిరి మాష్టారు ఒక నిట్టూర్పు విడి చాడు.

తలారికొండయ్య తప్పెట మోతతో వూళ్ళో వాళ్ళకి అంకమ్మ తల్లి గుర్తుకువచ్చింది. అప్పుడే తిరుణాలని గురించి చర్చించుకోవడం మొదలయ్యింది. ఒకటీ రెండు రోజులతో పోయేది కాదా తిరుణాళ్లు. చిన్నా, చితక దేవ తలందరికీ చేసే కొలువులతో కలిపి దాదాపు నెలరోజులు సంబరం. ఓంద్రగూం... ఓంద్రగూం... అంటూ వూరు పొలిమేరలు దాటి వినబడేట్టు కొమ్ము కథలు, తప్పట్ల మోతలూ, వూరేగింపులూ, వీరతాళ్ల వూరు వూరంతా సందడి. ఆ సందడిలో చిన్నా, పెద్దా వూళ్లో అన్ని వర్గాలవాళ్లూ ఆనందాన్ని అనుభవిస్తూవుంటే రాఘవయ్య అథఃపాతా ళంలో పడిపోయినట్లు మానసికంగా నాశన మవుతున్నాడు.

తన యింట్లో తను తీసి పారేసిన కరివే పాకు అయ్యాడు. తన నిమిత్తం లేకుండానే పనులన్నీ జరిగిపోతున్నాయి. స్వాతీవాళ్ళని, వాణి, రాణినీ తిరనాళ్ళకి రమ్మని చెప్పడానికి శివరామయ్యని ప్రయాణం చేసి పంపింది భూదేవమ్మ.

ఆమెమీద కోపం గొంతువరకూ వుంది రాఘవయ్యకి.

అంకమ్మ తల్లి పొంగళ్ళు రెండురోజులున్నా యనగా కొత్త బొంగులు కొట్టుకొచ్చి గుడి ముందు ప్రభను కడుతూవుంటే అక్కడకు వచ్చాడు. పెళ్ళి కూతురు శోభతో వెలిగి పోతూ వుంది గుడి. ఆ ప్రాంగణం అంతా జనంతో కోలాహలంగా వుంది. ఒక పక్క రంగులరాట్నం, ఇంకోపక్క జెయింట్ వీల్ బిగిస్తూ వున్నారు.

రాఘవయ్య గుడిలోకి పోయి అమ్మవారి

కుంకుమ అందుకొని నుదుట పెట్టుకొని వచ్చాడు.

అప్పుడే శేషగిరి మాష్టారు, పద్మావతమ్మ అటుగా వచ్చారు. వాళ్ళు ఏదో వూరికి ప్రయాణమైపోతున్నట్లు శేషగిరి మాష్టారి చేతిలో సూట్‌కేసు వుంది. రాఘవయ్య వాళ్ళను చూసి పక్కకు తప్పుకొన్నాడు. ప్రభను కడుతున్నచోట వున్న జానీ బాషా శేషగిరి మాష్టారువాళ్ళను చూసి "ఎక్కడి సార్ పోతున్నట్లున్నారు" అంటూ వచ్చి అడిగాడు.

"అబ్బాయి దగ్గరకు బాషా" చెప్పాడు శేషగిరి మాష్టారు.

"అదేమిటి సార్ ఇప్పుడు పోతున్నారు. రేపు లేదు ఎల్లుండి తిరణాలయితేనూ" అన్నాడు జానీభాష.

"మాకూ పోవాలని లేదు బాషా. కానీ తప్పలేదు. అక్కడ మనవరాలు పుష్పవతయ్యింది. ఎల్లుండి ఫంక్షన్ చేస్తున్నారట. రమ్మని రాశాడు అబ్బాయి"

"అబ్బ తిరుణాల రోజే వచ్చింది కదా సార్ ఆ ఫంక్షన్" జానీ బాషా అంటూవుంటే "ఏం చేద్దాం అమ్మవారి తిరణాలు చూసే అదృష్టం లేదు" అన్నాడు శేషగిరి మాష్టారు.

"అయితే యిప్పుడల్లా రారుగా"

"పదిరోజులు పైనే పడుతుంది" అంటూ పక్కనే వున్న కొట్లో టెంకాయ కొనుక్కొని వచ్చాడు.

ఇంతలో బస్సు వస్తున్నట్లు హారన్ వినబడి పద్మావతమ్మతో గుడిలోకి పోయాడు. అమ్మవారికి కొబ్బరికాయ కొట్టివచ్చేసరికి బస్సు వచ్చింది. గబగబా పోయి అందులో కూర్చున్నారు పద్మావతమ్మ, శేషగిరి మాష్టారు.

★ ★ ★

ఆ రాత్రి అన్నం తినలేదు రాఘవయ్య.

ఆ విషయం భూదేవమ్మకి చెప్పింది పార్వతి.

"ఒక పూట తినకపోతే ఏం చావడులే కడుపులో కాలితే రేపు తింటాడు" అని కసిగా అన్నది భూదేవమ్మ రాఘవయ్యకి వినబడేట్టు.

ఇంట్లో మనస్పర్థలు వచ్చినప్పటి నుంచీ భూదేవమ్మ, రాఘవయ్యని పట్టించుకోవడం మానేసింది. పార్వతే ఆయన విషయాలు చూస్తూవుంది. భూదేవమ్మ అంతలేసి మాటలంటున్నా రాఘవయ్యలో స్పందన రాలా. ఆయన మనోనేత్రానికి శేషగిరి మాష్టారు దర్శనమిస్తున్నాడు.

మాగాణిలో తను వరి కుప్పలు నూర్పిడి చేయిస్తూవుంటే శేషగిరి మాష్టారు మంచి ఎండలో ఆ గట్లమీద పడుతూ లేస్తూ వచ్చి "కన్నకొడకు కడుపు కాల్చుకొంటున్నాడయ్యా. ఒక్క పది బస్తాలు అతనికివ్వు" అని చెప్పాడు. అందుకు తను తల చివ్వున పైకెత్తి కళ్ళు పెద్దవి చేసి "నాకసలు కొడుకే లేడు పోవయ్యా. ఇంకెప్పుడూ నాకాడకి రాబోకు" అని కసరడం గుర్తుకొచ్చి అనూహ్యంగా రామకృష్ణని తలచుకొని 'నీకన్యాయం చేశానయ్యా... నీకన్యాయం చేశానయ్యా' అని అనుకుంటూ మొహంమీదకి దుప్పటి లాక్కొని ఏడ్చేశాడు. కళ్ళల్లోంచి నీళ్ళు కారుతూవుంటే "నువ్వయినా రా మావయ్యా' అని గణేష్‌ని ఆస్పత్రికి తీసుకొని పోవడానికి పిలిచిన లక్ష్మిరూపం, ఆమెని యింట్లోంచి తరిమేసినప్పుడు రామకృష్ణ ఏడ్చిన ఏడ్పు, శేషగిరి మాష్టారు అతనిని ఓదార్చడం ఒకదాని తర్వాత ఒకటి కనబడి 'తప్పుచేశాను, పాపం చేశాను' అనుకొని చెంపలేసుకొన్నాడు.

పొద్దుపోయింది. అంకమ్మగుడి దగ్గర చెప్తున్న కాటమరాజు కథ వినబడుతూవుంది. మధ్యమధ్యలో బొల్లావులను భుజాలమీద ఎక్కించుకొని వీరంగం చేస్తున్నట్టు వాయిస్తున్న సన్నాయిమేళం వినబడుతూ వుంది. అక్కడికి పోవాలనుకొన్నాడు. ఊహు లేవబుద్ధికాలా. ఆలోచిస్తున్నాడు. ఆలోచించేకొద్దీ తనెంత దుర్మార్గంగా ప్రవర్తించాడో తెలుస్తోంది. తనకు పార్వతి ఎంతో రామకృష్ణా




అంతే. అలాంటప్పుడు తను రామకృష్ణకి ఏం చేశాడు. రామకృష్ణ పిల్లలకి ఏం చేశాడు. అసలు వాళ్ళని తన మనవలని, కన్నకొడుకు బిడ్డలని గుర్తించాడా? స్వాతినీ, వాణినీ, రాణినీ చూసినట్లు వాళ్లని చూశాడా? కనీసం దగ్గరకు తీసుకొన్నాడా? తనని గురించి వాళ్ళే మనుకొంటారు? పరమదుర్మార్గుడిగా వాళ్లని ఇంట్లోంచి తరిమేసినవాడిగా అసహ్యించుకొంటుంటారు. ఆ వూహ రాగానే తనమీద తనకే అసహ్యం కలిగింది. అయినా తనెందుకలా ప్రవర్తించాడు? తనకేమయింది? ఏ దెయ్యం నెత్తినెక్కింది! ఇప్పుడు వాళ్ళు పెద్దవాళ్ళయి వుంటారు. వాళ్ళకి తను గుర్తుంటాడా? గుర్తుపడతారా? నేను మీ తాతని రా.. మీ నాయన నాయనని రా అని చెప్పుకొంటే తాతయ్యా అని దగ్గరికొస్తారా? ఆదరిస్తారా? ఊహుఁ... తను ఏనాడూ వాళ్ళను దగ్గరకు తీయలేదు. వాళ్లకేమీ చెయ్యలేదు. ఊరొదిలి పోయి ఇన్నేళ్ళయింది. ఒక్కసారన్నా వాళ్ళని గురించి కనీసం ఆలోచించాడా? ఇప్పుడే మొహం పెట్టుకొని పోవాలి? పోతే పలకరిస్తారా? ఏమో? రామకృష్ణ మహాకోపంగా వుంటాడు. స్వాతి పెళ్ళికి పత్రిక పంపితే రాలా. అందుకని పిలిచినా రాడని వాణి పెళ్ళికి పత్రిక పంపలా. వాడు ఇల్లు కట్టుకొని గృహప్రవేశానికి పిలవలా. ఇంకెలాపోవాలి? ఇంట్లో పోరు పడలేక యిల్లు, పొలాలూ అమ్మేస్తే రామకృష్ణకి ఏం దక్కుతుంది? చేసిన పాపం చాలక యింకా చెయ్యాలా? 'పైన దేవుడున్నాడు, అంతా చూస్తుంటాడు, తప్పు చేస్తే శిక్ష తప్పదు, పుణ్యం చెయ్యకపోయినా పర్వాలేదు, పాపం చెయ్యకండి. అన్నం పెట్టకపోయినా పర్వాలేదు, అన్యాయం మాత్రం చెయ్యకండి, అని అప్పుడప్పుడు శేషగిరి మాష్టారు చెప్పే మాటలు గుర్తుకువస్తున్నాయి. అవే మాటలు మళ్ళీ మళ్ళీ గుర్తుకువస్తున్నాయి.

★ ★ ★

అంకమ్మ తల్లి గుడిముందు నిలిపిన ప్రభ ఆకాశాన్ని తాకుతున్నట్లుంది. దానిమీదికి ఎక్కి రంగురంగుల కరెంటు బల్బులు బిగిస్తున్నారు. కోలన్న కుర్రాళ్ళు, భజన బృందం వచ్చి వాళ్ళ వాళ్ళ ప్రదర్శనలకు అనుకూలంగా కర్రలు బాది మైకులు కడుతున్నారు.

ఎండ మండుతూవుంది.

పదకొండు గంటల బస్సులో స్వాతి, చక్రవర్తి వచ్చారు. వాణి, రాణి రాలా. శివరామయ్య తిరణాలకు పిలవడానికి పోయినప్పుడే వాళ్ళు వీలయితే వస్తామని చెప్పారు. వాళ్ళు రానందుకు రాఘవయ్య బాధపడలేదు. స్వాతి, చక్రవర్తితో అదివరలాగే వున్నాడు.

చీకటిపడిన తర్వాత అన్నంతిని తిరణాలదగ్గరకు పోయాడు. జనసాగరంలా వుందా సన్నిధి. ప్రభమీద వెలుగుతున్న లైట్ల కాంతితో ఆ ప్రాంతం అద్భుతంగా మెరుస్తూ వుంది. అంతా కలియచూస్తూ వచ్చి గుడి ముందున్న అరుగుమీద కూర్చున్నాడు.

కుటుంబాలు కుటుంబాలుగా కొడుకులూ, కోడళ్లూ, కూతుళ్ళూ, అల్లుళ్లూ, మనవలూ, మనవరాళ్లతో గుడిలోకి పోతున్నారు. అమ్మవారి దర్శనం చేసుకొని కొబ్బరికాయలు కొట్టి నుదుట కుంకుమ అద్దుకొని వస్తున్నవాళ్ళ వదనాలలో భయభక్తులు తాండవిస్తున్నాయి. అరుగుమీదున్న రాఘవయ్యకి గుడిలోంచి మూకుడు నిప్పులో కాలుతున్న సాంబ్రాణి వాసన వస్తూవుంది. జెయింట్ వీల్ కేసి చూశాడు. దాని బాక్సులో కూర్చున్న వాళ్ళు కిందికీ పైకీ తిరుగుతుంటే తెల్లవారుఝామున వచ్చిన కల గుర్తుకువచ్చింది. పొలాలను అమ్మేసి ఆ డబ్బును సంచీకేసుకొని భూదేవమ్మావాళ్ళు అడ్డుపడ్డా వినకుండా రామకృష్ణ దగ్గరకు పోయాడు తను. కానీ రామకృష్ణ ఇంట్లోకి రానివ్వలేదు. డబ్బు సంచీని రోడ్లోకి విసిరేసి తనని బయటకు తోశాడు. అది కళ్లల్లో మెదలగానే మెదడు బరువెక్కింది. ఆలోచనల్లోపడిపోయాడు.

"నువ్విక్కడున్నావా పెద్దనాయినా...ఎక్కడికి పోయావా అని ఇంటిదగ్గర ఎదురుచూస్తూ

వున్నాను" అంటూ అప్పుడే అక్కడికి చక్రవర్తి వచ్చాడు.

రాఘవయ్య చిన్న నవ్వు నవ్వినట్లుగా పెదాలు కదిలించి కూర్చోమన్నట్లు కాస్త పక్కకు జరిగాడు. చక్రవర్తి ఆయన పక్కన కూర్చుని ప్రభ కేసి చూస్తూ "బాగా ఖర్చు పెట్టినట్టున్నారు" అని అన్నాడు.

"ఆ... బాగానే ఖర్చుపెట్టారు"

"రికార్డింగ్ డ్యాన్స్ కూడా వుందటగా"

"ఉంది"

"అసలీరోజుల్లో రికార్డింగ్ డ్యాన్స్ లేనిది తిరణాలేముంది పెదనాయనా. ప్రభ లేక పోయినా ఫర్వాలేదుకానీ రికార్డింగ్ డ్యాన్స్ లేంది అసలు జనమే రారు" అంటూ రాఘవయ్యని పూర్తిగా మాటల్లోకి దించి, "పెద్దవాడివి, అన్నీ తెలిసినవాడివి. నువ్వు కూడా ఏంది పెదనాయనా. మూర్ఖంగా ప్రవర్తిస్తున్నావు. నిజానికి నేను నీకు చెప్పేటంతవాడిని కాను. కానీ కాలాన్ని బట్టి మనం కూడా మారాలిగా... ఇంకా నీ ఒంట్లో శక్తివుందా పెదనాయనా పొలం పనిచెయ్యడానికి. అయినా నువ్వు అంతగా కష్టపడాల్సిన అవసరం ఏం వచ్చింది చెప్పు. హాయిగా కాలుమీద కాలే సుకుని సుఖంగా ఉండాల్సింది పోయి కష్ట పడతానంటావు. నా మాట విను పెదనా యనా. నేను నీ సుఖం కోరుకునేవాడిని. నీకే నష్టమూ, కష్టమూ రానివ్వను. నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను. పొలాలు అమ్మి వచ్చిన దాంట్లో సగం నీపేరుమీద బ్యాంకులో వేసుకో. నీ మాట ఎవరూ కాదనరు. ఆ డబ్బు నీ ఇష్టం. నువ్వేమ యినా చేసుకో... ఎవరికయినా ఇచ్చుకో" చక్రవర్తి చెప్తూ వుంటే రాఘవయ్య అడ్డు వచ్చి, "నేనెవరికో ఎందుకిస్తానయ్యా" అని అన్నాడు.

"నువ్వు ఎవరికో ఇస్తావని కాదులే పెద నాయనా. మాటవరసకంటున్నానులే. మనం అందరం ఒకేచోట వుంటే ఒకరికొ కరం తోడుగా వుంటాం. ఎన్నన్నా టౌను టౌనే. పల్లెటూరు పల్లెటూరే. బాగా ఆలో చించు పెదనాయనా.... నేనేదో మీ డబ్బు కాజేద్దామని చెప్పట్లేదు"

"ఛ... ఛ... అదేందయ్యా"

చక్రవర్తి మాట్లాడలేదు.

పది నిమిషాలు అయిన తరువాత "నీకు నేనున్నాను పెదనాయనా..." అంటూ భరోసా ఇచ్చాడు.

"సరేనయ్యా... రేపే పొలాలు బేరం పెడతాను" అన్నాడు రాఘవయ్య.

'హమ్మయ్య' అనుకున్నాడు చక్రవర్తి.

ఓ అరగంటసేపు రాఘవయ్యతో ఏవేవో మాట్లాడి, "ఇంటికి వస్తావా పెదనాయనా" అంటూ అరుగు దిగాడు.

"నువ్వెళ్లయ్యా... నేను కాసేపుండి వస్తాను" అన్నాడు రాఘవయ్య.

చక్రవర్తి ఇంటికి వచ్చి పెదనాయన ఒప్పేసుకున్నాడని అందరికీ చెప్పాడు.

మహదానందం అయ్యింది అందరికీ.

"పాతిక టెంకాయలు కొడతానని అంక మ్మతల్లికి మొక్కుకున్నానయ్యా. ఆ తల్లి దయతలచింది. రేపు పోయి కొట్టిరావాలి" అంటూ భూదేవమ్మ తన సంతోషాన్ని తెలియచేసింది.

అందరూ కలిసి నట్టింట్లో గుండ్రంగా కూర్చుని ఆ వచ్చే డబ్బుని ఏం చెయ్యాలి, ఎలా దేనికి, దేనికి ఖర్చుచెయ్యాలి అని ప్రణాళిక రూపొందించుకునే పనిలో నిమ గ్నమయ్యారు.

"ముందు వాణికీ, రాణికీ చెరికాస్త ఇవ్వాలి అంది పార్వతి.

వెంటనే చక్రవర్తి కలుగచేసుకుంటూ, "నువ్వు తొందరపడకు అత్తయ్యా, ముందుముందు చాలాకాలం వుంది" అన్నాడు.

"అవునులే నాయనా" భూదేవమ్మ





# ఏరిన ముత్యాలు

★ నీ దగ్గర ఏమైనా ఉన్నంతవరకూ ఏమీ లేని వానికి నీవు ఎంతోకొంత బాకీ పడినట్టే.

– వినోభాభావే

★ ఇవ్వడం నేర్చుకో. తీసుకోవడం కాదు.

– రామకృష్ణ పరమహంస

★ సంపదలు, యవ్వనం, ప్రాణాలూ ఏవీ స్థిరంగా ఉండేవికావు.

– భర్తృహరి

★ కర్తవ్యం అన్నది ఎవరికి వారు నిష్టగా అనుష్టించవలసింది.

– ఆస్కార్ వైల్డ్

★ కాషాయ వస్త్రాలు ధరించినవారు సన్యాసులు కారు. కామ, క్రోధాది గుణాలని వదిలిన వారే సన్యాసులు.

– చిన్మయ రామదాసు

★ స్నేహానికి రంగులు, హంగులు కావు, స్వచ్ఛమైన హృదయం చాలు

– బుచ్చిబాబు

★ తాను నవ్వితే ప్రపంచం అంతా నవ్వుతుంది. తానేడిస్తే ఒంటరిగా ఏడవాలి.

– ప్రాచీన సూక్తి

★ కష్టించి పనిచేసేవారికి విశ్రాంతి యొక్క ఆనందం తెలుస్తుంది.

– గాంధీజీ

★ గొప్ప పనులు బలం వలన కాదు, పట్టుదల వలన చేయబడతాయి.

– నెహ్రూ

★ ఐకమత్యం లేని అధికులపై ఐక్యత ఉన్న అల్ప సంఖ్యాకులు ఎప్పుడూ విజయం సాధిస్తారు.

– అనిబిసెంట్

★ పనికిమాలిన వాళ్లతో కలిసి బ్రతకడం కంటే ఏకాంతంగా ఉండటం మేలు.

– వాషింగ్‌టన్

★ బలహీనులు అదృష్టాన్ని , బలవంతులు కృషిని నమ్ముతారు.

– ఎమర్సన్

★ మరో ప్రపంచ యుద్ధం వస్తే రాళ్లే ఆయుధాలుగా మిగులుతాయి.

– ఐన్‌స్టీన్

సేకరణ : డి. శ్రీధరాచార్య

వంతపలికింది.

చాలా పొద్దుపోయింది.

గుడిదగ్గర మైకుల్లోంచి రికార్డింగ్ డాన్స్ పాటలు, కోలన్న, భజనపాటలు వినిపిస్తు న్నాయి.

రాఘవయ్య ఇంకా అక్కడినుంచి ఇంటికి రాలేదు.



**ఆ** రాత్రికి కాలం చెల్లిపోయింది.

తెల్లగా తెలవారింది.

సూర్యభగవానుడు తూరుపుకొండల్లోంచి బయల్దేరుతున్నాడు.

చక్రవర్తి ఇంకా నిద్ర లేవలేదు.

పార్వతి కాఫీ పెట్టి శివరామయ్యకి ఇచ్చి తనూ తాగుతూ పంచలో కూర్చుంది. స్వాతి గుడికి పోవాలని స్నానం చేసి రెడీ అయ్యి భూదేవమ్మకోసం ఎదురుచూస్తూ వుంది. ఆమె కూడా స్నానం ముగించి చీర కట్టుకుని, బొట్టు పెట్టుకుంటూ వుంది.

అప్పుడే వీధి తలుపు తెరుచుకుని పోతు రాజు చిన్నకొడుకు సూర్యం ఒక్క ఉదుటున లోపలికి వచ్చాడు. అతను వస్తూనే, "రాఘ వయ్య అంకమ్మ గుడిదగ్గర పడిపోయి వున్నాడు" అని చెప్పాడు. ఆ మాట వినడంతోటే శివరామయ్య, పార్వతి, స్వాతి... అంతా ఒక్కసారిగా కంగారుపడి లేచారు. ఇంట్లోంచి భూదేవమ్మ భయపడుతూ బయ టకు పరుగెత్తుకొచ్చింది.

"పక్షవాతం వచ్చినట్టుంది. కాలు, చెయ్యి పనిచెయ్యడంలేదు" అని సూర్యం చెప్పేమా టలు వినబడడంలేదు. కాళ్లకింద భూమి కంపించి, పగిలిపోతున్నట్లుంది. స్వాతి పరు గున పోయి చక్రవర్తిని లేపి చెప్పింది. అత నికి తలమీద పిడుగు పడ్డట్టయ్యింది. నమ్మ లేకపోయాడు. ఉన్నపళంగా అందరూ అంక మ్మగుడివైపుకి పరుగుతీశారు. అక్కడ అరుగు చుట్టూ జనం గుమిగూడి వుంటే వాళ్ళని చీల్చుకుని లోపలకి పోయారు. జీవం లేనివా డిలా వెల్లకిలా పడిపోయి వున్నాడు రాఘ వయ్య. గుర్తుపట్టలేనంతగా నోరు పక్కకు పోయి, మొహం వికృతంగా వుంది. ఆ స్థితిలో రాఘవయ్యని చూస్తూనే కుప్పకూలి పోయింది భూదేవమ్మ. స్వాతి, పార్వతి గొల్లున ఏడ్చేశారు. శివరామయ్యకి, చక్రవర్తికీ దిక్కు తోచలేదు. అయోమయంగా వుంది.

ఐదు, పది... పదిహేను నిమిషాలు...

అరగంట దాటింది.

"హాస్పిటల్ కి తీసుకునిపోండి. ఇప్పటికే ఆలస్యం అయ్యింది" అని జానీ బాషా చెప్ప డంతో కర్తవ్యం బోధపడింది. వెంటనే ట్రాక్ట ర్ని మాట్లాడి అందులో కందుకూరు తీసుకు పోయారు.

హాస్పిటల్ లో రాఘవయ్యని చూస్తూనే డాక్టర్ అడ్మిట్ చేసుకుని కావలసిన ఇంజక్ష న్లు, సెలైన్ బాటిల్స్, ఐ.వి. సెట్ రాసి చ్చాడు.

చక్రవర్తి ఆ చీటి అందుకుని "మామయ్యా" అంటూ శివరామయ్యని బయటకు పిల్చుకుని పోయి "డబ్బులున్నాయా" అనడిగాడు.

"నా దగ్గరేమీలేవు" ఠకీమని చెప్పాడు శివ రామయ్య.

చక్రవర్తికి షాక్ తగిలినట్లయ్యింది.

"సరేలే నేను తెస్తాను" అని మందులషాపు

లోకి పోయి మందులు తెచ్చాడు.

వెంటనే సెలైన్ పెట్టి, "మీరిక్కడే కూర్చోండి. అరగంటలో ఈ సెలైన్ బాటిల్ అయిపోతుంది. అయిపోయేటప్పుడు పిలవండి. ఇంకోటి పెట్టాలి" అని చక్రవర్తికి చెప్పి డాక్టర్ వెళ్ళిపోయాడు.

చక్రవర్తికి కాళ్ళు కట్టేసినట్లు అక్కడే కూర్చుండిపోయి సెలైన్ బాటిల్ అయిపోతుంటే కాంపౌండర్‌ని పిలిచి చెప్పాడు. అతనొచ్చి ఇంకో బాటిల్ పెడుతుంటే భూదేవమ్మ వెనకాలే పోయి, "ఏం నాయనా నయం అవుద్దా?" అనడిగింది.

"ఇప్పుడేకదమ్మా మందులు వాడడం మొదలుపెట్టింది" అనేసి కాంపౌండర్ పక్క వార్డులోకి వెళ్ళాడు.

ఒంటిగంట కావస్తోంది. అప్పటికింకా చక్రవర్తి మొహం కడుక్కోలేదు. రాఘవయ్య దగ్గర శివరామయ్యని ఉండమని చెప్పి "కాఫీ తాగొద్దాం రండి" అంటూ పార్వతి, భూదేవమ్మలను పిలిచాడు.

వాళ్ళిద్దరికీ అక్కడినుంచి కదలబుద్ధి కాలేదు.

"నాకిప్పుడేం వద్దయ్యా" అంది భూదేవమ్మ.

"నువ్వెళ్ళి తాగిరా" చెప్పింది పార్వతి.

చక్రవర్తి మళ్ళీ వాళ్ళని రమ్మని పిలవలా. తను ఒక్కడే వెళ్ళి హాస్పిటల్ ముందున్న క్యాంటీన్‌లో నీళ్ళు పుక్కిలించి కాఫీ తాగి వచ్చాడు.

అతను వచ్చేసరికి డాక్టర్ రాఘవయ్యని చూసి పోతున్నాడు.

చక్రవర్తి డాక్టర్ని ఫాలో అయ్యి "ఎంటి సార్ పరిస్థితి" అని అడిగాడు.

"సీరియస్ స్ట్రోకే... ఇంకా రెండుమూడు గంటలయితేగానీ స్పృహరాదు" డాక్టర్ చెప్తావుంటే "ప్రమాదం ఏమీలేదుగా సార్" అనడిగాడు చక్రవర్తి.

"ప్రమాదం అంటే ప్రాణాపాయం ఏమీ లేదు. పక్షవాతం. భయంకరమైన జబ్బే. మామూలు మనిషి కావడం కష్టం" అని డాక్టర్ చెప్పి పోగానే, "ఏమిటీ ఏం చెప్తున్నాడు?" అంటూ భూదేవమ్మ చక్రవర్తి దగ్గరకి వచ్చింది ఆదుర్దాగా.

"ప్రమాదం లేదంటలే" అని చెప్పాడు చక్రవర్తి.

అలా చెప్పాడే కానీ చక్రవర్తికి లోపల భయంగానే వుంది. పక్షవాతాన్ని గురించి కాస్తోకూస్తో తనకు తెలుసు. పైగా స్ట్రోక్ సీరియస్‌గా వుందని డాక్టర్ చెప్పాడు. ఆయన మామూలు మనిషి కాకపోతే పరిస్థితి ఏమిటి? ఎన్నిరోజులు ఆస్పత్రిలో వుండాలి? ఇక్కడ కాదని డాక్టర్ ఏ విజయవాడకో, మద్రాసుకో తీసుకుపొమ్మని చెప్తే... ఎంత రిస్క్ తీసుకోవాలి. ఎంత డబ్బుకావాలి? ఎక్కడనుంచి తేవాలి? వందలతో అయ్యేది కాదు. వేలకువేలు కావాలి. ఆ ఆలోచనలతో చక్రవర్తి మెదడు మొద్దుబారిపోయింది.

ఇంటిదగ్గరినుంచి విశ్వనాథం, సరోజనమ్మ వచ్చారు. వాళ్ళు వస్తూ క్యారేజీలో అన్నం తెచ్చారు. భూదేవమ్మకి ఏడుపొచ్చి ఏడ్చేసింది. పార్వతికి కళ్ళల్లో నీళ్ళు తిరిగినా కంట్రోలు చేసుకుని భూదేవమ్మను ఓదార్చింది.

అపస్మారక స్థితిలో పడివున్న రాఘవయ్యని చూడగానే గుర్తుపట్టలేక అవాక్కయిపోయారు విశ్వనాథం, సరోజనమ్మ.

"బి.పి. పెరిగి వుంటుంది" అన్నాడు విశ్వనాథం ఐదు నిమిషాల తర్వాత తేరుకుని.

"రాత్రి బాగానే వున్నాడు నాన్నా" అన్నాడు చక్రవర్తి.

"ఆయనకసలు ఏ జబ్బూలేదు" చెప్పింది భూదేవమ్మ.

"పైకి కనబడకపోవచ్చు లోపల పెరుగుతూ వుంటుంది. ఒక్కసారిగా బైటపడి తట్టుకోలేకపోయాడు. బి.పి. డౌన్ అయినా, రైజయినా కష్టమే..."

"ఈమధ్య ఆయనకి ఆలోచనలు కూడా ఎక్కువయినాయిలే" అన్నాడు శివరామయ్య.

"దానికి మెంటల్ టెన్షన్ తోడయ్యింది. పడేసింది." విశ్వనాథం అంటూవుంటే వాళ్ళ ఇంటికి నాలుగిళ్ళ అవతల వున్న రామాంజ నేయులు తండ్రి సీతారామయ్యకి పక్షవాతం రావడం గుర్తు చేసింది సరోజనమ్మ.

"ఆయనకొచ్చిన పక్షవాతం సామాన్యమైనది కాదు. చచ్చేదాకా మంచంలోనే వున్నాడు" విశ్వనాథం అలా చెప్తూవుంటే చక్రవర్తి అడ్డు వచ్చి "డాక్టర్ డేంజర్ లేదన్నాడులే" అని చెప్పాడు.

"ఇంక మీరు అన్నం తినండి" సరోజనమ్మ పురమాయించింది.

"నాకొద్దు. మీరు తినండి" భూదేవమ్మ అంటూవుంటే, "కాస్త ఎంగిలిపడాలి" అని చెప్పింది సరోజనమ్మ.

పార్వతి లేచి కారియర్ ఊడదీసి చక్రవ ర్తికి, శివరామయ్యకి పెట్టింది. వాళ్ళు తిని లేవగానే బలవంతంగా నాలుగుముద్దలు కలిపి చేతిలో పెట్టి భూదేవమ్మచేత తినిపిం చింది. తర్వాత తను కూడా తిని గిన్నెలు కడిగేసి పెడ్తుంటే, "వాణీ వాళ్ళకి తెలియపరి చారా" అని అడిగింది సరోజనమ్మ.

"లేదు ఇంకాలేదు" అంటూ, పార్వతి చక్ర వర్తివైపు చూసి "కాస్త వాళ్లకి ఫోను చేసి చెప్పు" అంది.

చక్రవర్తి లేచి పోబోతుంటే కాంపౌండర్ వచ్చాడు. అతన్ని రాఘవయ్య పరిస్థితిని గురించి అడిగాడు విశ్వనాథం.

"స్ట్రోక్ తగలగానే తీసుకుని వస్తే బావుం డేది. మీరు చూసినట్టులేదు. లేటయ్యింది" కాంపౌండర్ చెప్తూవుంటే "డాక్టరు ప్రమాదం లేదన్నాడు" అని అన్నాడు చక్రవర్తి.

"పక్షవాతం కదా... ప్రాణానికేం ముప్పు ఉండదు. మంచంలో ఉండకుండా లేచి తిర గ గలిగితేచాలు మీరు అదృష్టవంతులే. లేకుంటే ఇబ్బందే. పేషెంట్‌కన్నా పక్కన సేవలు చేసేవాళ్ళకి మహా బాధ. అన్నీ మంచంలోనే. అన్నీ శుభ్రం చేయడమంటే మాటలా. యమలోకం కనబడుతుంది. అయినా మీరేం భయపడవలసిన పనిలేదు. ఈ రోజుల్లో పెరాలసిస్‌కి మంచి మందులే వున్నాయి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

★ ★ ★

చక్రవర్తి వాణివాళ్ళకి ఫోన్ చెయ్యడానికి పోతుంటే, "సీరియస్‌గా వుందని చెప్పకండి. వాళ్ళు భయపడిపోతారు" అని చెప్పింది పార్వతి.

విశ్వనాథం, సరోజనమ్మ అక్కడే వున్నారు.

నాలుగు గంటలు కావస్తుంటే రాఘవయ్య కనురెప్పల్లో కాస్త చలనం కనబడింది. చక్ర వర్తికి ఉత్సాహం వచ్చి స్పృహ వస్తోంది అని సైగచేస్తూ చిన్నగా చెప్పాడు.

"ఆ... అవును" అన్నాడు శివరామయ్య చూస్తూ.

విశ్వనాథం, సరోజనమ్మ అటుకేసి చూస్తు న్నారు. భూదేవమ్మ, పార్వతిల మొహాలు వికసించాయి.

అప్పుడే కళ్ళు తెరిచాడు రాఘవయ్య.

ఆ కళ్ళల్లో వెలుగులేదు, చురుకులేదు.

ఆ చూపుల్లో జీవం వున్నట్టు కనబడలేదు. బతికి వున్న మనిషి చూస్తున్నట్టులేదు. ఎవ రిని చూస్తున్నాడో వారికి అర్థంకాలేదు. కళ్ళు తెరిచి నిద్రపోతున్నట్టు వుంది.

"నాన్నా..." అని పార్వతి పిలవబోయింది.

రెప్పలు వాల్చేశాడు రాఘవయ్య.

ఆ విషయం ఓ.పి.లో వున్న కాంపౌం డర్‌కి చెప్పాడు చక్రవర్తి.

"అంటే ఇప్పుడిప్పుడే మందులు పనిచేస్తు న్నాయన్నమాట" అంటూ కాంపౌండర్ వచ్చి సెలైన్ ఎక్కించడం ఆపేస్తున్నట్టు నీడిల్ తీసి, స్టాండ్ పక్కకు జరిపాడు.

"ఇంక సెలైన్ అక్కర్లేదా?" అడిగాడు చక్ర వర్తి.

"ఎందుకులేదు. రాత్రికి మళ్ళీ ఎక్కించాలి. మీరు ఆయన్ని డిస్టర్బ్ చేయకండి" అని చెప్పేసి వెళ్ళిపోయాడు.

కాంపౌండర్ అటు వెళ్ళగానే సరోజనమ్మ,

విశ్వనాథం లేచారు. "మీరు మటుకు అందరూ ఇక్కడెందుకు? ఒకరుంటే చాలు. ఇంటికొచ్చెయ్యండి" అని చెప్పాడు విశ్వనాథం.

శివరామయ్య తలూపాడు.

★ ★ ★

బెడ్‌మీద రాఘవయ్య ఈ లోకాన్ని చూడలేనన్నట్లుగా కళ్ళు మూసుకుని పడుకుని వున్నాడు.

నైట్ డ్యూటీ కాంపౌండర్ వచ్చి సెలైన్ పెట్టి వెళ్ళాడు.

చక్రవర్తి అక్కడే వున్నాడు. పక్కనే చాప పరుచుకుని పార్వతి, భూదేవమ్మ నిద్రలోకి జారుకున్నారు. వాళ్ళిద్దరినీ రాత్రికి విశ్వనాథం వాళ్ళు వాళ్ళ ఇంటి దగ్గర వుండమని చెప్పారు.

కానీ వాళ్ళు రాఘవయ్యకి దూరంగా వుండడం ఇష్టంలేక హాస్పిటల్ కి వచ్చేశారు. శివరామయ్య మాత్రం భోంచేసి ఆ ఇంటిదగ్గర హాయిగా పడుకున్నాడు.

ఆ సమయంలో చక్రవర్తికి హాస్పిటల్ వాతావరణం భయంకరంగా వుంది. రాత్రిళ్ళు శ్మశానంలో నక్కల, కుక్కల శోకండాలలా అక్కడ మూలుగులు, ఏడుపులు, దగ్గులు... భీతావహంగా వుంది.

సెలైన్‌కేసి చూశాడు. ఖాళీ కావస్తోంది. లేచి వెళ్ళి కాంపౌండర్‌కి చెప్పాడు. అతను వచ్చి నీడిల్ తీస్తూ రాఘవయ్య నోట్లోంచి ఉమ్ము బయటకు వచ్చి బుగ్గమీదుగా కారుతుండడం చూసి "మూతి తుడవండి" అని చెప్పాడు.

చక్రవర్తికి అలర్జీ అయ్యింది. వెంటనే మూతి తుడవడానికి మనసొప్పలేదు.

"ఈగలు ముసురుతాయి తుడిచెయ్యండి" అంటూ నీడిల్ తీసి కాంపౌండర్ పోతూ పోతూ, "పాస్ పోసుకుంటే బట్టలు మార్చెయ్యండి" అని చెప్పేసి వెళ్ళిపోయాడు.

చక్రవర్తికి అతనిమీద కోపం వచ్చింది. అయినా తప్పలేదు. అసహ్యించుకుంటూనే టవల్‌తో రాఘవయ్య మూతి తుడిచి, పోయి చెయ్యి కడుక్కుని వచ్చాడు.

టైం చూసుకున్నాడు.

ఒంటిగంట దాటింది.

రాఘవయ్యని చూస్తూ అక్కడ వుండలేకపోయాడు. వరండాలోకి వచ్చి బల్లమీద కూర్చున్నాడు.

మందుల వాసన వస్తూవుంది.

మనసులోంచి సహనం మాయమవుతూ ఏదో చిరాకు మొదలయ్యింది. అంతకుముందెప్పుడూ చక్రవర్తి విసుగు చెందలేదు. స్వాతి కాన్పప్పుడు, శివరామయ్య కాలు విరిగినప్పుడు ఆస్పత్రిలో తనే వున్నాడు. కానీ ఇప్పుడలా కాదు. ఆస్పత్రి యమకూపంలా కనబడి, బయటకు పారిపోవాలనిపిస్తోంది. వీరాంజనేయులు తండ్రి సీతారామయ్యకి పక్షవాతం రావడం గుర్తుకొచ్చి నీరుగారిపోయాడు.

సీతారామయ్యతో వీరాంజనేయులు పడ్డ బాధ అంతా ఇంతాకాదు. చాలా ఖర్చు చేశాడు కూడా. గుంటూరు, విజయవాడ, హైదరాబాదు, మద్రాసులలో పెద్ద పెద్ద ఆస్పత్రుల్లో చూపించాడు. లాభంలేకపోయింది. చచ్చేదాకా మంచంలోనే వుండిపోయాడు. పాపం వీరాంజనేయులకి తప్పలేదు... కొడుకు గాబట్టి చెయ్యగలిగాడు.

అలా తను చెయ్యగలడా? ఆ కంపు తను భరించగలడా? తనకేం ఖర్మ? ఈ రొంపిలో దిగకూడదు. దూరంగా వుండాలి. లేకుంటేనా... ఇరుక్కుంటేనా...

చక్రవర్తిలో ఆలోచనలు అలా అనూహ్య మలుపులు తిరుగుతున్నాయి.

లేచి రాఘవయ్య వున్న బెడ్ దగ్గరకి వెళ్ళాలనిపించలేదు.

ఆ బల్లమీదనే నడుం వాల్చాడు. వెంటనే నిద్ర పట్టేసింది.

★ ★ ★

తెల్లవారుతుండగా పార్వతికి మెలకువ వచ్చి లేచి రాఘవయ్యకేసి చూసింది. ఆయన

నోట్లోంచి ఉమ్ము కారి బెడ్‌మీద పడుతూ వుంటే చూడలేక వెంటనే తన పైట కొంగుతో తుడిచి చక్రవర్తికోసం చూసింది. అక్కడ లేడు. లేచి వరండాలోకి వచ్చి బల్లమీద నిద్ర పోతున్న అతన్ని నిద్రపోతున్నాడులే అనుకుని లేపలేదు.

బాగా తెల్లవారిన తరువాత స్వీపర్ వచ్చి ఫినాయిల్‌తో గచ్చు తుడుస్తూ లేపితే లేచాడు.

అప్పటికి భూదేవమ్మ, పార్వతి మొహం కడుక్కుని వున్నారు. చక్రవర్తి క్యాంటీన్‌కి పోయి మొహం కడుక్కుని తను కాఫీ తాగి పార్వతికి, భూదేవమ్మకీ తెచ్చాడు. ఎనిమిది గంటలప్పుడు రౌండ్స్‌కి వచ్చిన డాక్టరు రాఘవయ్యని చూసి, "స్పూన్‌తో కొద్దిగా పాలు తాగించండి" అని చెప్పి పోయాడు.

పార్వతి పాలు పడుతూనే వుంది. అయిదారు స్పూన్లు వేసిన తర్వాత రాఘవయ్య గుటకేశాడు.

"కాస్త పరవాలేదు" అంది పార్వతి.

తర్వాత ఆమె రాఘవయ్య మూతి తుడిచి లేస్తుంటే వాణి, రాణి, కిరణ్‌కుమార్, సందీప్ వచ్చారు. వాళ్ళు కనపడగానే దుఃఖం ముంచుకువచ్చి కూలబడిపోయింది భూదేవమ్మ. ఆ పరిస్థితుల్లో ఆమెని చూడగానే వాణి, రాణికి ఏడుపొచ్చి అమ్మమ్మా అంటూ చెరొక పక్కనా పట్టుకు కూర్చున్నారు ఆమెను.

"ఎందుకయినా మంచిది ఒకసారి డాక్టర్‌ని కలిసి అడిగితే బావుంటుంది" అన్నాడు కిరణ్ కుమార్.

ఆ మాటలు విన్నవాడిలా రాఘవయ్య కళ్ళు తెరిచాడు. అది చూసిన రాణి "తాతయ్యకి స్పృహ వచ్చింది. మనల్ని చూస్తున్నాడు" అని సంతోషంగా అంటూ వుంటే "చిన్నగా" అంటూ పార్వతి వారించింది.

ఎవరూ మాట్లాడలేదు. నిశ్శబ్దంగా రాఘవయ్యకేసి చూశారు. తల కదల్చకుండానే ఆయన చూపులు అందరిమీదుగా కదిలి కిరణ్‌కుమార్ దగ్గరికొచ్చి కొద్దిసేపు నిలిచి మాయమయ్యాయి.

"ఇప్పుడే స్పృహలోకి వస్తూ వున్నట్లుంది" అన్నాడు సందీప్.

"ఇది నాలుగోసారి కళ్ళు తెరవడం" చెప్పాడు చక్రవర్తి.

"అవునా... అయితే ఫర్వాలేదు. అర్లీ స్టేజ్‌లోనే ట్రీట్‌మెంట్ జరిగింది. కోలుకుంటాడు" తనకు తెలుసన్నట్లుగా చెప్పాడు సందీప్.

ఆ మాటలు భూదేవమ్మకీ, పార్వతికీ అమృతవాక్కుల్లా వున్నాయి.

"అక్క రాలేదా బావా" అని అడిగింది చక్రవర్తిని వాణి.

"నిన్న వచ్చి పోయింది"

"ఇప్పుడు రాదా?" రాణి అడుగుతూ వుంటే, "ఏమో! దానికి ఆయన్ని చూస్తే భయంగా వుందిట" అన్నాడు.

ఆ సమాధానం భూదేవమ్మకి మాడుమీద కొట్టినట్లుంది. రెండు నిమిషాలు మెదడు పనిచేయలేదు.

చిన్నతనంనుంచీ ప్రేమగా, ఆప్యాయంగా, కాలుకింద పెట్టకుండా సాకిన మనిషి, ఏది కావాలంటే అది కాదనకుండా తెచ్చి ఇచ్చిన మనిషి, ఏ లోటూ చెయ్యని మనిషి అనారోగ్యంతో మంచాన పడితే సేవలు చెయ్యవలసింది పోయి, అలా అంటుందా... ఆయనేమన్నా దెయ్యమా, భూతమా...

భూదేవమ్మ మెదడు పనిచెయ్యడం మొదలవుతూ వుంటే, "డబ్బులు ఎట్లా చేస్తున్నారు" అని అడిగాడు కిరణ్‌కుమార్.

ఆమె సమాధానం చెప్పేలోపు "వున్నాయా లేవా? లేకుంటే... తెచ్చివ్వమంటే తెచ్చి ఇస్తాను" అని అన్నాడు.

భూదేవమ్మకి అహం అడ్డువచ్చింది. పైగా ఆమెకి చక్రవర్తి దగ్గర వున్నంత చనువు కిరణ్‌కుమార్ దగ్గరకానీ, సందీప్ వద్దగానీ లేదు. అందుకని వాళ్ళదగ్గర డబ్బు తీసుకోవడానికి మొహమాటపడి "ఎందుకు? అన్నీ చక్రవర్తి

చూస్తున్నాడులే" అని అంది.

ఆమె అలా అనడంతో గొంతుకు ఉచ్చు బిగించినట్టు ఫీలయ్యాడు చక్రవర్తి. మింగలేక, కక్కలేక వుండిపోయాడు. తర్వాత కిరణ్‌కుమార్ రెండు నిమిషాలు వాణితో మాట్లాడి, "రామకృష్ణగారికి తెలియచెయ్యమంటారా" అని భూదేవమ్మని అడిగాడు. కిరణ్‌కుమార్ నోట 'రామకృష్ణ' పేరు వినబడడంతో భూదేవమ్మ కరెంట్ షాక్ కొట్టినట్లు ఒక్కసారిగా ఒళ్ళంతా జలదరించి "వద్దు" అంది. కిరణ్‌కుమార్ ఇంకేం మాట్లాడలేదు.

ఆ సాయంకాలమే వాణి, రాణి వాళ్ళు వెళ్ళిపోవడంతో 'వచ్చారు, మహారాజుల్లా భోంచేశారు, వెళ్ళిపోయారు... సినిమాకి వచ్చిపోయినట్టు' అని అక్కసుతో పళ్ళు కొరుక్కున్నాడు చక్రవర్తి.

ఆ సమయంలో అతని మొహంలో రంగులు మారడం గమనించిన భూదేవమ్మకి నిద్రపోతున్న మనసుని ఎవరో తట్టిలేపినట్టయింది.

రామకృష్ణ రూపం కళ్ళముందు మెదిలింది.

★ ★ ★

ఆమెకు ఏదో అనుమానం.

ఎక్కడో భయం.

అసలు జబ్బు నయమవుతుందా, ఆయన మామూలు మనిషిలా లేచి తిరగగలుగుతాడా?

లేకుంటే... లేకుంటే?

ఆ ఆలోచన రాగానే భూదేవమ్మ హృదయ స్పందన వేగం పుంజుకుంది.

చక్రవర్తిమీద పూర్తి విశ్వాసం పెంచుకొన్న తనకి అతని ప్రవర్తన మీద ఆ విశ్వాసం సడలిపోతూ వుంది. అతను యిదివరలా సన్నిహితంగా వుండడంలేదు. వీలైనంతవరకు తప్పించుకొనడానికి ప్రయత్నిస్తున్నాడు. అంటీ అంటనట్టు యాంత్రికంగా వుంటున్నాడు.

అతను కాస్తా తప్పుకుంటే... తనకెవరు దిక్కు?

నిద్రరాలా... లేచి కూర్చుని రాఘవయ్య కేసి చూసింది. పరిగెత్తి, పరిగెత్తి అలిసిపోయి యింక పరిగెత్తలేనని వోడిపోయి పడిపోయిన వాడిలా వున్నాడు. దగ్గరగా జరిగి గుండెమీద చెయ్యివేసింది. ఆయన గుండె కొట్టుకుంటున్నట్లు ఆమె చేతికి తెలుస్తూనే వుంది.

ఆ చేతి స్పర్శవల్లనో లేక సహజంగా స్పృహ వచ్చిందో ఆయన కళ్ళు తెరిచాడు. అది చూసిన ఆమెకి సంతోషించాలో, ఏడవాలో అర్థంకాలేదు. రాఘవయ్య గడ్డాన్ని పట్టుకొని అటు, యిటు తిప్పింది.

ఆయన చూపులు తనమీద లేవు. ఎటు చూస్తున్నాయో. భావం లేదు. రబ్బరుబొమ్మ కళ్ళు తెరచి చూసినట్టుంది.

"ఏందయ్యా యిది" అంటూ ఆయన మొహానికి దగ్గర బెడ్‌మీద తలవాల్చి ఏడ్చింది.

కళ్ళల్లో నీళ్ళూరడం ఆగిపోతుంటే ఆరోజు కిరణ్‌కుమార్ 'రామకృష్ణగారికి తెలియజెయ్యమంటారా' అని అడగడం గుర్తుకువచ్చి అప్పుడు తను 'వద్దు' అని అనకపోతే బావుండేదేమో, అని అనిపించి ఆమెలో ఆలోచనా దీపం వెలిగింది.

ఆ దీపకాంతిలో ఆలోచనలు మొదలయ్యాయి.

ఆలోచిస్తూవుంది.

★ ★ ★

చక్రవర్తికి విసుగుపుట్టుకొస్తోంది.

రాఘవయ్యకి పక్షవాతం రావడం తనకు శిక్షలా వుంది. ఆయన్ని ఆస్పత్రిలో చేర్పించింది మొదలు ఖర్చులకు డబ్బులు తేవడం, పార్వతికి, భూదేవమ్మకి కారియర్ మోసుకొని రావడం, రాఘవయ్యని చూసుకొంటూ వుండడం మహా చికాకుగా వుంది.

సరోజనమ్మ, విశ్వనాథంకి అతనిపట్ల ఒక పక్క జాలిగానూ, యింకోపక్క కోపంగానూ వుంది. అప్పటికీ వుండబట్టలేక "నీకేందిరా ఈ ఖర్మ. ఆస్పత్రి చుట్టూ తిరగడం, అడ్డమ

యిన చాకిరీ చెయ్యడం... అసలు నీకేం అవసరం, ఆయన నీకేమవుతాడని, నీ మావకి మామ. నీ తోటి వాళ్ళు చుట్టాల్లా వచ్చారు, చూశారు, పోయారు. వాళ్లెవరికీ లేని బాధ్యత నీకు ఎందుకు" అని ఒకటికి రెండుసార్లు అన్నారు కూడా.

ఆ మాటలు చక్రవర్తిమీద పనిచేస్తున్నాయి. మానసికంగా నలుగుతున్నాడు.

రాఘవయ్య ఎన్నాళ్ళకు కోలుకొంటాడో...?

ఆహారంగా అన్నం జావలా చేసి తాపుతున్నారు. అయిదోరోజు దాటినా ఆయన ఆరోగ్యంలో పురోగతి కనపడలేదు. కళ్ళు తెరిచి చూస్తున్నాడు, మూస్తున్నాడు.

ఆ రూములో ఎక్కువసేపు వుండాలంటే కష్టంగా వుంది కూడా. ఏదో వాసన.

"పేషెంట్ని నీట్గా వుంచాలి" అని డాక్టర్ రౌండ్స్కి వచ్చినప్పుడు కోప్పడిపోయాడు. దాంతో చక్రవర్తి ఆలోచనలోపడ్డాడు.

మరుసటిరోజు ప్రొద్దున్నే స్వీపర్ వరండా తుడుస్తుంటే "కాస్త లోపలికి వచ్చి ఆయన పంచ, పక్క మారుస్తావా డబ్బులిస్తాను" అని అడిగాడు.

స్వీపర్కి ఒళ్లు మండింది.

"నీ కళ్లకి నేనెట్లా కనబడుతున్నానేంది. మీ పేషెంట్ గబ్బు మీరే భరించలేకపోతే నేనెట్లా భరిస్తాననుకొన్నావు... చాలు చాలు పోవయ్యా చాలా పెద్దమనిషిలా వున్నావు" అని కసిరాడు.

చక్రవర్తికి తల గిర్రున తిరిగింది. నోరు పడిపోయిన వాడిలా వెనక్కు తిరిగి అక్కడ భూదేవమ్మ వుండడం చూసి ఆమె అంతా విన్నదని తెలిసిపోవడంతో మొహం మాడిపోయింది.

భూదేవమ్మకి ముక్కుమీద గుద్దినట్లయ్యింది. పెద్దగా అరవాలనిపించింది. అయినా ఎవరిమీద అరుస్తుంది? ఏమని అరుస్తుంది? ఎవరిని అరిస్తే ఎవరూరుకొంటారు? చక్రవర్తి తనకి ఏమవుతాడని? తన కూతురుకి అల్లుడు. డబ్బిస్తామంటే వస్తారు, సొమ్ములు ఇస్తామంటే వస్తారు, బాధలిస్తామంటే వస్తారా... ఏం చెయ్యాలో తోచడం లేదు.

ఆవేశాన్ని అణచుకొని "ఇంకెవరినైనా చూడునాయనా" అంది.



ఆ రాత్రి లాస్ట్ బస్సులో వచ్చారు పద్మావతమ్మ, శేషగిరి మాష్టారు.

తలుపుతీసి యింట్లోకి అడుగు పెడుతూ వుంటే ఇన్లాండ్ లెటర్ పడివుంది. శేషగిరి మాష్టారు వంగి తీసుకొని "రామకృష్ణ రాశాడు" అంటూ లెటర్తెరచి "యిది రాసి పదిరోజులపైనే అయ్యింది" అని చదవసాగాడు.

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శేషగిరి మాష్టారి పాదపద్మములకు నమస్కరించి మీ శిష్యుడు రామకృష్ణ రాయునది. మిమ్మల్ని చూడాలని వుంది మాష్టారూ. వచ్చే నెలలో మీరు రిటైర్ అవుతున్నారు కదా! మేడంతో మీరు యిక్కడికి వచ్చి మాతోవుండండి. మిమ్మల్ని పువ్వుల్లో పెట్టి చూసుకొనే కొడుకూ కూతురూ మీకు వున్నప్పుడు నేనిలా మిమ్మల్ని మావద్ద వుండమని కోరడం స్వార్థమే. కానీ నాకు మీ పాదపూజ చేసుకో

వాలని వుంది. ఈ విషయమై ఒక్కసారి మీరు ఆలోచించండి. మీ మాటను మీ కూతురుగానీ, మీ కొడుకుగానీ కాదనరు. వాళ్ళ మనసుని కష్టపెట్టే పని మీరు చెయ్యరు. మీలాంటి అమ్మా, నాన్న కలిగిన వాళ్ళు చాలా అదృష్టవంతులు. మీ శిష్యుడనై నందుకు నేనింకా అదృష్టవంతుడిని.

మేడంగారికి నా నమస్కారాలు తెలియజె య్యండి. అక్కడ అంకమ్మగుడిలో తిరణాళ్ల రోజున మేమిక్కడ ఆ తల్లి పేరుతో పొంగలి పొంగించి కొబ్బరికాయ కొట్టాలనుకొంటు న్నాం మాష్టారు.

ఇంక వుంటాను.
మీ శిష్యుడు
రామకృష్ణ.

"ఏమి రాశాడు? " పద్మావతమ్మ అడిగింది.

"రిటైర్ కాగానే వచ్చి వాళ్ళ దగ్గర వుండ మని రాశాడు. చదువు" అని లెటర్ పద్మావ తమ్మకు ఇచ్చాడు.

ఆమె చదివి "అంత అభిమానంగా రాశాడు అప్పుడప్పుడూ పోయి నాలుగు రోజులు వుండొద్దాం" అన్నది.

"అంతేలే మనం మటుకు చేసేదేముంది. అక్కడ నాలుగు రోజులు, అక్కడ నాలుగు రోజులు కాలం గడిపెయ్యవచ్చు"

వాళ్ళు మాట్లాడుకోవడం, ఆ యింట్లో లైట్లు వెలుగుతుండడం చూసి ఇరుగుపొరుగు వాళ్ళు వచ్చి పలకరించారు. ఆ సమయంలో వీధిలో వెళ్తున్న సూర్యం యింట్లో సందడి విని 'మాష్టారూ వాళ్ళు వచ్చినట్టుందని' లోప లికి వెళ్ళి క్షేమ సమాచారాలు విచారిస్తూ రాఘవయ్యకి పక్షవాతం వచ్చిన సంగతి చెప్పాడు. ఆ మాటలు వినడంతోటే శేషగిరి మాష్టారు షాక్ తిన్నాడు. ఏదో కలలో విన్న ట్లుగా వుంది. తేరుకొన్న తర్వాత కూడా వెంటనే నమ్మకం కలగలేదు. అది నిజమేనని తెలిసి ఎప్పుడు, ఎలా అని రాఘవయ్యని గురించి అంతా తెలుసుకొన్నాడు.

ఆ రాత్రి నిద్రపోలేదు. ఎప్పుడెప్పుడు తెల్ల వారుతుందా అని గడియారంకేసి ఎన్నిసార్లు చూశాడో. తెల్లవారి ఫస్టు బస్సులోనే కందు కూరు వెళ్ళాడు. బస్టాండులో దిగి నేరుగా హాస్పిటల్‌వైపు నడిచాడు. ఆయన వచ్చేసరికి అక్కడ చక్రవర్తి లేడు. పార్వతి, భూదేవమ్మ రాఘవయ్య బెడ్‌కి పక్కనే చాపమీద గోడకా నుకొని కూర్చుని వున్నారు. శేషగిరి మాష్టారు రావడం చూసి యిద్దరూ ఒకరినొకరు చూసు కొని లేచి నిలబడ్డారు.

"ఎలా వుందమ్మా" ఆయనడుగుతూవుంటే భూదేవమ్మకి వెంటనే నోట్లోంచి మాటలు రాలా. 'ఇలా వుంది' అన్నట్లు తల పక్కకు తిప్పి రాఘవయ్యను చూపించింది.

బెడ్‌మీద పీనుగలా పడివున్న రాఘవ య్యను చూడగానే గుర్తుపట్టలేకపోయాడు శేషగిరి మాష్టారు. దగ్గరగా పోయి పక్కన వున్న స్టూల్‌మీద కూర్చుని ఆయన గుండె మీద చెయ్యివేసి నిమిరాడు. ఆ స్పర్శకి స్పృహ వచ్చిన రాఘవయ్య కళ్ళు తెరిచాడు. ఎదురుగా శేషగిరి మాష్టారిని చూసి గుర్తుప ట్టినట్టు ఆ కళ్ళలో మెరుపు కనబడింది. ఆ చూపుల్లో ఎంతో కాలంగా ఎదురుచూస్తున్న దైవం సాక్షాత్కరించినట్లు సంభ్రమం తొణికిస లాడి ఏదో మాట్లాడాలని, ఏదో చెప్పాలని ప్రయత్నిస్తున్నట్లుంది.

అప్పుడు ఆయన్ని చూస్తుంటే పార్వతికి, భూదేవమ్మకి తొలకరి వర్షం పడ్డట్టుంది.

వెంటనే భూదేవమ్మ రాఘవయ్య మొహం మీదకి వంగి "అయ్యవారు... మన శేషగిరి అయ్యవారు గుర్తుందా" అంటూ ఆయన చెవుల్లో కాస్త పెద్దగా చెప్తుంటే 'ఎందుకు గుర్తులేదు, మన అయ్యవారు నాకెందుకు గుర్తులేదు' అన్న భావం రాఘవయ్య కళ్ళలో కనబడింది.

"రామకృష్ణకి తెలియపరిచారా" అడిగాడు శేషగిరి మాష్టారు.

భూదేవమ్మ ఆయన మొహంలోకి చూడలే కపోయింది. తల వంచుకొని తప్పుచేసిన

దానిలా "ఆc హ" అంది.

శేషగిరి మాష్టారు ఏదో అనబోతూ ఆ గది లోకి డాక్టర్ రావడం చూసి "నమస్తే సార్" అంటూ లేచాడు.

"నమస్తే సార్... నమస్తే... ఏమిటి మీరు న్నారిక్కడ? తెలిసిన వాళ్ళా..." డాక్టర్ దగ్గ రగా వచ్చి అడుగుతూవుంటే. "మావాళ్ళే సార్ వీళ్ళు. పదిరోజులుగా నేను వూళ్ళో లేను. మా అబ్బాయి దగ్గరకి వెళ్ళాను. రాత్రి వచ్చేసరికి ఈ విషయం తెలిసి వచ్చాను" అని చెప్పి "ఎలావుంది సార్ యిప్పుడు" అని అడిగాడు.

"మీరు చూస్తున్నారుగా స్ట్రోక్ బాగానే వచ్చింది. ఈ వయసులో వచ్చింది కాబట్టి కోలుకోడానికి చాలాకాలం పడుతుంది. లేచి నడవగలిగేదాకా చాలా జాగ్రత్తలు తీసుకో వాల్సి వుంటుంది. చిన్నపిల్లవాడిలా చూసుకో వాలి. నీళ్ళు పొయ్యడం, అన్నం తినిపించడం, అన్ని పనులూ చెయ్యాలి. మంచంమీద ఎక్కువసేపు వెల్లకిలా పడుకోబెట్టకుండా అటు ఇటు పక్కలకు తిప్పి కూడా పడుకోబెట్టాలి. లేకుంటే వీపు పుళ్ళుపడే ప్రమాదం వుంది. అందుకని మెత్తటి పరుపుమీదనే పడుకోబె ట్టాలి. ఈ సపర్యలన్నీ చెయ్యాలంటే కష్టమే. కానీ తప్పదు. దగ్గరుండి చేసుకొనేవాళ్ళు కావాలి. సొంత మనుషులు అయితేనే చేసు కోగలరు" డాక్టర్ చెప్తూ వుంటే "హైదరాబా దులో వీళ్ళ కొడుకున్నాడులెండి. పిలిపి స్తాను" అని చెప్పాడు శేషగిరి మాష్టారు.

"ఆ పని యింతకుముందే చెయ్యాల్సిందిగా వీళ్ళు"

"వీళ్ళకంత తెలివిలేదులెండి. అమాయ కులు. మామూలు జ్వరంలాంటిదేలే వారం పదిరోజుల్లో తగ్గిపోతుందనుకొన్నారు. పైగా వున్నఫళంగా తెలియజేస్తే అతనెక్కడ హైరానా పడతాడోనని భయపడుతున్నారు" అని శేషగిరి మాష్టారు భూదేవమ్మా వాళ్లని సమర్థిస్తూవుంటే "అట్లా అనుకొంటే ఎలా సార్" అంటూ డాక్టర్ పార్వతి, భూదేవమ్మ వైపు చెయ్యి చూపించి "వీళ్ళవల్ల ఏమవు తుంది. ఇలాంటి పరిస్థితిలో మగవాళ్ళకి మగవాళ్ళ సహాయం కావాలిగానీ" అన్నాడు.

"ఈరోజే ఫోన్‌చేసి చెప్తాను సార్. రేపు ఉదయానికల్లా వస్తాడు"

"ఆపని చెయ్యండి... అతనికి వీలయితే అక్కడికే తీసుకొని పోయి వైద్యం చేయించ వచ్చు"

వాళ్ళ సంభాషణ రాఘవయ్య విన్నట్లుంది. కళ్ళల్లోంచి నీళ్లూరి పక్కలకు జారుతున్నాయి.

అది చూసిన డాక్టర్ "వెంటనే మీరతన్ని పిలిపించడం మంచిది. అతను దగ్గరుంటే ఇతనికి సగం జబ్బు నయమైనట్లే. మందులు కూడా బాగా పనిచేస్తాయి. తొందరగా కోలు కోవచ్చు" అని చెప్తూవుంటే శేషగిరి మాష్టారుకి హుషారొచ్చింది.

తర్వాత డాక్టర్ రాఘవయ్యని చూసి ఏ మందులు వాడాలో కాంపౌండర్‌కి చెప్పేసి పోతుంటే శేషగిరి మాష్టారు ఆయనతో వరం డాదాకా పోయి "కాస్త శుభ్రంగా స్నానం చేయిస్తే బావుంటుందనుకొంటున్నాను సార్. చేయించమంటారా" అని అడిగాడు.

"మంచిదే చేయించండి. వీల్ ఛైర్‌లో బాత్రూం దగ్గరకు తీసుకొచ్చి చేయించండి. వేడినీళ్ళు కూడా మా కాంపౌండర్‌ని ఆడగండి యిస్తాడు" అని చెప్పి పక్క గదిలోకి వెళ్ళాడు డాక్టర్.

శేషగిరి మాష్టారు రాఘవయ్య దగ్గరకు రాగానే "అబ్బాయికి ఫోన్ చేస్తానన్నారు. వాడు రాడయ్యా" అని అన్నది భూదేవమ్మ కాస్త విచారంగా.

శేషగిరి మాష్టారు ఆమె మొహంలోకి అదోలా చూసి "రాడా... లేక అతను రావడం మీకు ఇష్టం లేదా" అని అడిగాడు.

"అదేంకాదయ్యా... స్వాతి పెళ్ళికి పత్రిక పంపిస్తే రాలేదు కదా" భూదేవమ్మ అంటూ వుంటే వెంటనే పార్వతి "లేదమ్మా, వాడిక సలు పత్రికను పంపలేదు" అని చెప్పింది.

భూదేవమ్మ అవాక్కయ్యింది. పార్వతి మొహంలోకి చూసింది.

"పంపలేదా"

"నేనే పత్రికని పోస్టుడబ్బాలో వెయ్య లేదు."

కోపం వచ్చింది భూదేవమ్మకి.

"ఓసి పాపిష్టిదానా, అట్లా ఎందుకు చేశావే" అరుస్తూ ఏడ్చేసింది.

శేషగిరి మాష్టారుకి జాలేసింది.

"అది సరేనమ్మా, అతను యిల్లు కట్టుకొని గృహప్రవేశానికి కార్డు పంపించాడు గదమ్మా... అప్పుడయినా రావచ్చుగా" అని అడిగాడు.

"మమ్మల్ని అసలు పిలవలేదయ్యా వాడు"

"లేదమ్మా, పిలిచాడు. వాడు కార్డు పంపితే నేనే చించిపారేశాను. మీకు చెప్పలేదు" అని చెప్పి కంటనీళ్ళు పెట్టుకొంది పార్వతి.

భూదేవమ్మకి తల తిరిగింది. ఆవేశం తన్నుకొచ్చి పార్వతిని తన్ని తగలెయ్యాలని పించింది.

"నీ అమ్మ కడుపుకాల ఎంతపని చేశావే. మేం నీకేం అన్యాయం చేశావే. నీకోసం మాకొంప అంతా గుల్లచేసుకొన్నాం గదే. తోడబుట్టిన వాడిని ఇంటి ఛాయ రాకుండా చేసింది చాలక యింత నాటకం ఆడతావా. నిన్ను... నిన్ను... నిన్ను చంపినా పాపం లేదే" అంటూ అరిచింది.

"జరిగినదాన్ని గురించి అరుచుకోవడం దేనికమ్మా. జరగవలసిన దాన్ని గురించి ఆలోచించాలిగాని" అని శేషగిరి మాష్టారు ఆమెని శాంతపరచి కాంపౌండర్ దగ్గరకు పోయి వేడినీళ్లు అడిగాడు.

అరగంటలో కాంపౌండర్ బక్కెట్ నిండుగా వేడినీళ్లు కాచి యిచ్చాడు. అతని సహాయం తోనే రాఘవయ్యని వీల్ ఛైర్‌లో బాత్రూం దగ్గరకు తీసుకొని పోయి స్నానం చేయించి ఫ్రెష్‌గా రూంలోకి తీసుకొచ్చి పడుకోబెట్టాడు.

అప్పుడు వచ్చిన చక్రవర్తికి ఆ వాతావరణం అదోలా వుంది. భూదేవమ్మకి అతని మొహం చూడబుద్ధి కాలేదు. పార్వతి పశ్చా త్తప్తురాలైవుంది.

చక్రవర్తికి అయోమయంగా వుంది.

"నేను వెళ్ళి రామకృష్ణకి ఫోన్ చేసి వస్తాను" అని చెప్పి శేషగిరి మాష్టారు బయ టకు వెళ్ళి అరగంటలో తిరిగి వచ్చాడు.

"ఇంట్లో రామకృష్ణలేడు. లక్ష్మివుంది. విషయం చెప్పగానే కంగారుపడిపోయింది. అతను రాగానే బయల్దేరి రమ్మన్నాను. వస్తా మన్నది" అని చెప్పాడు.

ఆ విషయం చెప్తూవుంటే భూదేవమ్మకి అది చల్లని కబురులా తోచింది.

రాఘవయ్య శేషగిరి మాష్టారుకేసి చూస్తు న్నాడు.

శేషగిరి మాష్టారు రాఘవయ్య దగ్గర కూర్చుని "మీ అబ్బాయి రేప్పొద్దుటికల్లా వస్తాడు" అని ఆయనకు వినబడేట్టు చెప్పాడు. తన సంతోషం రాఘవయ్య కళ్ల తోనే తెలిపాడు.

తర్వాత శేషగిరి మాష్టారు వూరికి బయల్దే రుతూ, "నేను మళ్ళీ రేప్పొద్దునే వస్తాను" అని చెప్పేసి ఆయన వెళ్ళిపోయాడు.

★ ★ ★

రామకృష్ణ యింటికి రాగానే విషయం చెప్పలేకపోయింది లక్ష్మి.

పదినిముషాల తర్వాత "బాబాయిగారు ఫోన్ చేశారు" అని చెప్పింది. రామకృష్ణ వెంటనే యిదివరలా స్పందించలేదు. "అలాగా" అన్నాడు సాదాగా. ఆపైన ఆయ నేమీ అడగలేదు. అడుగుతాడేమో ఒక్కొక్క మాటే చెప్పాలనుకొన్నది కానీ అలా కుదర లేదు.

"మీనాన్న..." అని ఆగిపోయింది.

రామకృష్ణ 'ఆగిపోయావేం చెప్పు' అని అంటాడనుకొన్నది.

ఊహు... అతనేం మాట్లాడలేదు.

"ఆస్పత్రిలో వున్నాడంట" చెప్పింది.

"అయితే మనకేం"

"ఆయనకి... ఆయనకి... పక్షవాతం వచ్చి కాలు, చెయ్యి పడిపోయాయంట"

"దానికి మనమేం చేస్తాం"

"బయల్దేరిపోదాం"

"మనకవసరం లేదు"

రామకృష్ణ అలా అనడంతో లక్ష్మి ఖిన్నురాలయ్యింది.

"అదేమిటండీ... అలా అంటున్నారు. మనం పోవాలిగా"

"ఎందుకు పోవాలి?"

"ఎందుకంటే... ఎందుకంటే నేనేం చెప్పేది. మీ నాన్న జబ్బునపడివుంటే పోయి మంచి, చెడ్డా చూసుకోవాల్సిన బాధ్యత మీకు లేదా"

"లేదు. వున్నా నేను పోదలచుకోలేదు. పోయేవాడినయితే ఎప్పుడో పోయేవాడిని"

లక్ష్మికి ఏదో అనుమానం కలిగింది.

"అంటే మీకీవిషయం యింతకుముందే తెలుసా"

"తెలుసు" లక్ష్మి ఆశ్చర్యపోయింది.

"ఎలా తెలిసింది, ఎవరు చెప్పారు?"

"ఆయన అంకమ్మ తల్లి అరుగుమీద పడిపోయిన రోజే తెలిసింది. ఆ సాయంకాలం నాలుగు గంటలప్పుడు కందుకూరునుండి జానీభాషా ఆఫీసుకి ఫోన్‌చేసి చెప్పాడు"

"అవునా... నాకు చెప్పలేదేమండీ. వారం పదిరోజులుగా మీరు అదోలా వుంటున్నారు. ఇందుకా! అయినా యింత విషాదాన్ని ఎలా దిగమింగారండీ"

"ఈ ఒళ్లు బాగా రాటుదేలిపోయింది. ఇంకెంత విషాదాన్నయినా దిగమింగడానికి సిద్ధంగా వుంది"

"అయితే ఇప్పుడు మనం మీ నాన్న దగ్గరకు పోవడం లేదా"

"లేదు"

"బాబాయిగారు రమ్మన్నారండీ"

"అయినా సరే"

లక్ష్మి చాలాసార్లు చెప్పింది. బతిమాలింది. సాయంకాలందాకా బతిమాలుతూనే వుంది.

★ ★ ★

పార్వతి, భూదేవమ్మ ఎదురుచూస్తూ వున్నారు లక్ష్మి, రామకృష్ణకోసం.

వాళ్ళు వచ్చి వుంటారని శేషగిరిమాష్టారు ఫస్టు బస్సుకి వచ్చాడు. అప్పటికి యింకా రాకపోవడంతో వస్తారు, వస్తారు అనుకొని తొమ్మిదిగ..టలదాకా ఎదురుచూశాడు.

'అసలు వాళ్ళు బయలుదేరారా లేదా' అని అనుమానం వచ్చి యస్.టి.డి.బూత్‌లోకి పోయి ఫోన్ చేశాడు.

అవతల లక్ష్మి ఫోనెత్తి "హలో" అంది.

"ఏమిటమ్మా లక్ష్మి, మీరు బయల్దేరలేదా"

అలా అడుగుతున్నది శేషగిరి మాష్టారు అని తెలిసి వెంటనే సమాధానం చెప్పలేక తడబడి పోయింది.

"ఏమిటమ్మా ఏమయ్యిందీ, రామకృష్ణ లేడా"

"వున్నాడు" అని చెప్పి "బాబాయిగారు మిమ్మల్ని పిలుస్తున్నారు" అంటూ రామకృష్ణను పిలిచింది. రామకృష్ణ అయిష్టంగానే రిసీవర్ అందుకొని చెవికానించుకొంటూ "ఏమిటి మాష్టారూ" అని అడిగాడు.

"అమ్మాయి చెప్పలా"

"చెప్పింది"

"మరి రాలేదేం"

"ఏదో రాబుద్ధికాలేదు"

"అట్లా అంటే ఎట్లయ్యా, వెంటనే వచ్చెయ్"

"ఏమో మాష్టారు. గట్టిగా చెప్పలేను, వీలయితే"

"వీలు, గీలు అని చెప్పకు, రావాలి. మీకోసం ఎదురుచూస్తూవుంటాను. పెట్టేస్తున్నాను" అనేసి శేషగిరి మాష్టారు ఫోన్‌పెట్టేశాడు.

బిల్‌కట్టేసి బూతులోంచి బయటకు వస్తూవుంటే, 'వస్తాడా, రాడా' అని అనుమానం కలిగింది.

★ ★ ★

రామకృష్ణ ఆలోచిస్తున్నాడు.

తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఎంత ఆలోచించినా అతని మనసు రాజీ పడడంలేదు.

అన్నం పెట్టి, ఆదుకొని, అన్నీ తానై తనని యింతవాడిని చేసిన గురువుగారి మాట కాద నవలసి వస్తోంది. భగవంతుడా నన్ను క్షమించు.

అన్ని బంధాలు వదులుకొని ప్రశాంతంగా బతుకుతున్న తనకేంటీ కష్టం. తనేం పాపం చేశాడు. తనిప్పుడు ఆ వూరు పోవాలా. వాళ్ళ మొహాలు చూడగలడా, తనకేంటీ పరీక్ష.

ఆయన జబ్బున పడడం ఏంటీ, గురువు గారు తనను రమ్మనడం ఏంటీ, ఎలా పోవా లి, పోకుంటే, ఆయన మాట కాదంటే తన కన్నా పాపాత్ముడు, కృతఘ్నుడు వుండడు.

అమ్మా, అంకమ్మ తల్లీ నన్నీ పరీక్షనుండి తప్పించు తల్లీ.

తల్లడిల్లిపోతున్నాడు.

ఫోన్ రింగయితే అది గురువుగారినుంచే నని భయపడుతున్నాడు.

ఆయన తనని రమ్మని బలవంతపెట్ట కుంటే... తను ఆవూరు పోడు. ఈరోజు, రేపు రెండురోజులు గడిస్తే చాలు. దేవుడు కరుణించినట్లే అనుకొని ఆలోచిస్తూ లక్ష్మి "ఇంకా మీరు ఆలోచించవద్దండీ. నా మాట విని బయల్దేరండి పోదాం. బాబాయి మాట కాదనొద్దు. కిరణ్‌కుమార్ వచ్చినప్పుడు కూడా మీరతన్ని తిప్పి పంపేసి, తర్వాత బాధప డ్డారు. దయచేసి మళ్ళీ అలాంటి పరిస్థితి తెచ్చుకోవద్దండీ" అని చెప్పింది.

ఆ మాటలు ఏవీ రామకృష్ణ పట్టించుకోవ డంలేదు.

ఆమె చెప్తూనే వుంది.

ఆరోజు చీకటిపడింది, తెల్లవారింది.

కాలంలో యింకోరోజు కూడా మరుగున పడిపోయింది.

మూడోరోజు ప్రొద్దున టిఫిన్ చేసి రామ కృష్ణ ఆఫీసుకు బయల్దేరాడు. అతని వెనకాలే లక్ష్మి పంచలో దాకా వచ్చింది. రామకృష్ణ స్కూటర్ తీసి గేటులోంచి బయటకు దించుతూ శేషగిరి మాస్టారు ఎదురై గతు కులో పడ్డట్టయ్యాడు.

శేషగిరి మాస్టారిని చూడడంతోనే లక్ష్మి కళ్ళు సంతోషంతో మిలమిల మెరిశాయి.

"రండి బాబాయిగారూ" అంటూ ఆహ్వానిం చింది.

రామకృష్ణ స్కూటర్ వెనక్కులాగి స్టాండ్ వేసి యాంత్రికంగా శేషగిరి మాస్టారుతో యింట్లోకి నడిచాడు.

రామకృష్ణ మాట్లాడడానికి భయపడుతు న్నాడు. ఆయనవైపు చూడలేక గోడదగ్గరకి పోయి కిటికీలోంచి బయటకు చూస్తూ నిల బడ్డాడు.

లక్ష్మి కిచెన్‌లోకి పోయి, స్టౌ వెలిగించి ఒక పొయ్యిమీద కాఫీకోసం పాలు, యింకో పొయ్యిమీద స్నానానికి నీళ్ళు పెట్టి వచ్చింది.

"మీరు లేచి మొహం కడుక్కోండి బాబా యిగారూ, కాఫీ తాగుదురుగాని" అని పిలి చింది.

శేషగిరి మాస్టారు లేచి బాత్రూంవైపు వెళ్తుంటే లక్ష్మి వెనకాలే టవల్ తీసుకొని పోయి యిస్తూ "ఇప్పుడెలావుంది బాబాయ్" అని అడిగింది.

"అట్లాగే వుందమ్మా. మార్పేమీ లేదు. మీరు వస్తారని ఎదురుచూశాను. రాకపోయే సరికి నిన్న మధ్యాహ్నం హాస్పిటల్‌నుంచి వూరికి తీసుకొని పోయి, రాత్రి బయల్దేరి యిటువచ్చాను" శేషగిరి మాస్టారు చెప్తూ వుంటే "ఆయన అక్కడకి రావడానికి బాధప డుతున్నారు" అని అంది లక్ష్మి.

"నేనూ అదే వూహించానమ్మా... కానీ తప్పదుగా" నాకొక మాట చెప్పమ్మా, మీ మావయ్యని యిక్కడికి తీసుకొస్తే నీకేం అభ్యంతరంలేదుగా శేషగిరి మాస్టారు అడుగు తూవుంటే లక్ష్మి వెంటనే "నాకేం అభ్యంతరం

లేదు బాబాయ్. ఆయనకేలోటూ రాకుండా నేను చూస్తాను"

ఆ సంభాషణ రామకృష్ణ చెవుల్లోపడి తనకు వుచ్చు బిగుస్తూవుందని విషాదంగా వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

శేషగిరి మాష్టారితో ఎలా మాటలు మొదలుపెట్టాలో? ఏం మాట్లాడితే ఏమవుతుందో? ఆయన వచ్చింది తనని తీసుకొని పోవడానికే... తను పోడు... పోగూడదు. ఆ మాట గురువుగారికి చెప్పగలడా? ఆయన్ని సముదాయించగలడా? ఉహు... అయినా చెప్పాలి. అదేమాట చెప్పాలి. 'నేను రాను. నాకవసరం లేదు. వాళ్ళకీ, నాకూ సంబంధంలేదు' అని చెప్పడానికి ధైర్యం కూడ తీసుకొంటున్నాడు.

శేషగిరి మాష్టారు మొహం కడుక్కొని వచ్చి, సోఫాలో కూర్చుంటూవుంటే లక్ష్మి కాఫీ తెచ్చియిచ్చింది. ఆయన కాఫీ తాగుతూ రామకృష్ణకేసి చూశాడు. అదోలా వున్నాడు.

కాఫీ తాగడం పూర్తయిన తర్వాత, గ్లాసు పక్కనపెట్టి "ఏం రామకృష్ణా" అని అన్నాడు.

రాతిబొమ్మకు వూపిరి వచ్చినట్లుంది.

"ఊ" అన్నాడు.

"నువ్వొస్తావని ఎదురుచూశాను"

"క్షమించండి మాష్టారు" గొంతులోంచి రాలేక రాలేక వచ్చిందా మాట.

పాపం అనిపించింది శేషగిరి మాష్టారికి.

"అదేంటయ్యా... బరువు బాధ్యతలు మొయ్యవలసిన వాడివి నువ్వే అట్లా అంటే ఎట్లా"

రామకృష్ణలో బెరుకు మాయమవుతూ కాస్త ధైర్యం వచ్చింది.

"నాకెందుకు మాష్టారూ బరువు బాధ్యతలు, అసలు నేనెవర్ని మోయడానికి. నాకూ, వాళ్ళకీ సంబంధం ఎక్కడ వుంది గనక" అన్నాడు.

"అవన్నీ పిచ్చిమాటలు రామకృష్ణా. సంబంధం లేదనుకొంటే పోతుందా ఏంటి. ఎన్ననుకున్నా వాళ్ళు నీకు అమ్మా నాన్నలే వాళ్లకు నీవు కొడుకువే"

"మీకంతా తెలిసిగూడా ఎందుకు మాష్టారూ అట్లా మాట్లాడుతారు. నన్ను వాళ్ళు కొడుకు అని అనుకొన్నారా, కొడుకులా చూశారా? కనీసం నాకు ఆ యింట్లో స్థానం వుందా. కన్నకొడుకని కనికరం లేకుండా యింట్లోంచి గెంటేశారే. అట్లా ఏ తల్లయినా, ఏ తండ్రయినా చేస్తారా"

"అది నీ ఖర్మ. దానికి ఎవరేం చేస్తారు. దేశంలో ఏ తల్లీ, ఏ తండ్రీ ప్రవర్తించని రీతిలో మీ అమ్మానాన్నా ప్రవర్తించారు. వాళ్ళు మూర్ఖులు. పశువులు. చదువులేని అజ్ఞానులు. కాబట్టే అలా ప్రవర్తించారు. గుడ్డిగా కూతురిమీద ప్రేమ పెంచుకొని ఆమె చెప్పుడు మాటలు విని మీకు అన్యాయం చేశారు. అలా చెయ్యబట్టే వాళ్ళు వూళ్లోవాళ్ళ నోళ్ళలో నానుతున్నారు. నీకా పరిస్థితి వద్దు. చదువుకొన్న వాడివి, సంస్కార వంతుడివి, కష్టంలో వున్న తండ్రిని వదిలెయ్యొద్దు"

ఆ మాటలకు అడ్డు వచ్చాడు రామకృష్ణ.

"వదిలేస్తే ఏమవుతుంది మాష్టారూ, ఆయనే నన్ను వదిలెయ్యగాలేంది నేను ఆయన్ను వదిలేస్తే ఏమవుతుంది. నేనేమన్నా వాళ్ళ ఆస్తి కావాలని అనుకొంటున్నానా"

"ఆస్తి కోసం నిన్ను రమ్మనడంలేదు. మీ నాన్నకోసం రమ్మంటున్నాను. ఆయన్ని తీసుకొచ్చి వైద్యం చేయించమంటున్నాను"

"అందుకు అల్లుడూ, కూతురూ వున్నారుగా"

"ఉన్నారు. కాదనడంలేదు. అయినా వాళ్ళు ఎంతవరకు చూడగలరని, కూతురుగాబట్టి మీ అక్క చూడడానికి సిద్ధపడుతుంది. మీ బావ చూస్తాడా. ఆయనకు స్నానం చేయిస్తాడా. పంచ మారుస్తాడా... అలాంటి పనులు మీ అక్క చేస్తుందా. ఇలాంటి పరిస్థితిలోనే ఆడవాళ్ళకు ఆడవాళ్ళు, మగవాళ్ళకి మగవాళ్ళు కావాలి. అయినా పాపం మీ అక్క మీ నాన్నను వదిలిపెట్టలేదు. మీ బావ మొహం




చాటేసినా ఆమె రాత్రింబవళ్లు ఆస్పత్రిలోనే వుంది. అంతే కాదు. అసలు తప్పంతా తన దేనని ఒప్పుకొంది. స్వాతి పెళ్ళప్పుడు నీకు పంపే శుభలేఖ ఆమె పోస్టు చెయ్యలేదంట. గృహప్రవేశానికి నువ్వు పంపిన కార్డు పోస్టు మాన్ ఆమెకిస్తే దాన్ని యింట్లో చూపించ కుండా చించి పారేసిందట. ఆ విషయాలు మొన్న ఆస్పత్రిలో చెప్పి ఏడ్చింది. అదంతా విన్న మీ అమ్మ ఆమెని అసహ్యించుకొంది. తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి తలబాదు కొంది"

రామకృష్ణ ఏం మాట్లాడలేదు. శేషగిరి మాష్టారే అన్నాడు.

"నా మాట విని మీ నాన్నని తీసుకొచ్చి ఒక నెల రోజులు వైద్యం చేయించు. వచ్చే నెలలో నేను రిటైర్ కాగానే యిక్కడికి వచ్చి ఆయన బాధ్యతను అంతా నేను తీసుకొం టాను. అన్ని సపర్యలూ చేస్తాను... సరేనా... నన్ను నమ్ముతావా"

"మీరెందుకు మాష్టారూ ఆయన్ని గురించి అంతగా ఆలోచిస్తున్నారు, మీకేమవుతాడని, ఎప్పుడన్నా మీ మాట విన్నాడా, మిమ్మల్ని గౌరవించాడా, పైగా మిమ్మల్ని శత్రువులా చూశాడు"

శేషగిరి మాష్టారు రామకృష్ణ మొహంలోకి సూటిగా చూశాడు.

"అయితే ఏమయ్యింది రామకృష్ణా, నాకే మన్నా అయ్యిందా? తెలిసో తెలియకో అలా ప్రవర్తించాడు. అందుకని ఆయన్ని అలా వదిలెయ్యాల్సిందేనా, సమాజంలో రకరకాల మనస్తత్వాల మనుషులుంటారు. ఎన్నో పొర పాట్లు చేస్తుంటారు. వాళ్ళందరినీ అంటరాని వాళ్ళని చూసినట్లు చూడాలా? మానవజన్మ అనేది అన్ని జన్మలకంటే మహోన్నతమయి నది. సృష్టిలో ఏ ప్రాణికీ లేని ఆలోచనాశక్తి ఒక్క మనిషికే వుంది. అలాంటి మనిషి సాటిమనిషిని గురించి ఆలోచించకపోతే ఇంకెవరిని గురించి ఆలోచించాలి? అడవిలో మృగాలను గురించి ఆలోచించాలా? ఈ బొందిలో ప్రాణం ఎంతకాలం వుంటుందో, ఎప్పుడు పోతుందో, ఎలా పోతుందో? ఎవ రికీ తెలియదు. వండుకొన్నది ముద్ద చేసు కొని నోట్లో పెట్టుకొనే దాకా నమ్మకం లేని నీటి బుడగలా చితికిపోయే అశాశ్వతమయిన జీవితంలో అంత కనికరం, అంత ప్రేమ చూపించలేమా? అన్యాయం చేసినవాడికి అన్యాయమే చెయ్యాలా? కాస్త న్యాయం చెయ్యలేమా? ఆ మాత్రం మానవతా సంస్కారం మనకు వుండకూడదా"

రామకృష్ణ శేషగిరి మాష్టారివైపు చూడలేక పోతున్నాడు.

"నిజానికి నేను నీకు చెప్పేటంత వాడిని కాను"

ఆ మాట చురకలా తగిలి అలర్ట్ అయ్యాడు.

"... కానీ అక్కడి పరిస్థితి చూసిన తర్వాత నాలో మానవత్వం నన్ను నిలబడనియ్య లేదు. గాలిలో రెపరెపలా ఎగురుతున్న గాలి పటం ఠపీమని నేలమీద పడ్డట్టు మీ నాన్న కాలు, చెయ్యి, నోరు పడిపోయి మంచంలో దిక్కులేనివాడిలా పడివుండడం చూడలేకపో యాను. అదంతా నీకు తెలియజెయ్యవలసిన బాధ్యత నాకుందనిపించింది. అవసాన దశలో వున్న తండ్రిని చూసుకోవలసిన బాధ్యత నీకుంది. గతాన్ని గుర్తుంచుకొని ఆ బాధ్యతనుండి ఎక్కడ తప్పుకొంటావోనని నేను వచ్చాను... ఇంక నీ యిష్టం"

"బాబాయ్ స్నానానికి నీళ్ళు పెట్టనా" లక్ష్మి అడిగింది.

"పెట్టమ్మా"

లక్ష్మి బక్కెట్‌లో వేడినీళ్ళు పోసుకొని పోయి బాత్రూమ్‌లో పెట్టింది. శేషగిరి మాష్టారు లేచి స్నానానికి వెళ్ళాడు.

రామకృష్ణ మెదడులో సముద్రాల ఘోష మొదలయ్యింది. అగ్ని పర్వతాలు పగులుతు న్నాయి. శేషగిరి మాష్టారు చెప్పిన మాటల వెనక వున్న ఆయన రూపంలోని దైవత్వం

**సచిత్ర విచిత్రం**

# ఒక కానుపు - అయిదుగురు సంతానం




మార్సెల్లా క్యుజడా (26) అనే యువతి 1995 ఫిబ్రవరి 9 న ఓ హాస్పిటల్ లో ఒకే కాన్పులో అయిదు మందిని కన్నది. ఈ విషయం ఆమె భర్త వెంటనే నమ్మలేదు. ఎందుకంటే డాక్టర్ కవలలు పుడతారని చెప్పాడు. ఇది అమెరికాలో మరీ అరుదు కాకపోయినా కాలిఫోర్నియా రాష్ట్రంలో ఇది తొలిసారి. ఆ మాటకొస్తే వెస్ట్‌లోనే ఇది మొదటిసారి. ఈ వార్త లోకల్ టీవీలో, అమెరికా దినపత్రికల్లో వచ్చింది. కాలిఫోర్నియా గవర్నర్ మార్సెల్లాకి శుభాకాంక్షలు కూడా పంపించాడు.

దర్శనమవుతూ వుంది. తను వదులుకొన్న తండ్రి బాధ్యతల విషయంలో ఆయనెందుకు ఆతురుత పడుతున్నాడు. అనరాని మాటలు అన్నవానిమీద ఎందుకు జాలి చూపుతు న్నాడు? అది... అది... ఆయన నైజం. ఆనాడు ఆయన నన్ను గురించి ఆలోచించ బట్టే కదా యిక్కడికొచ్చి నేను స్థిరపడిపోగలి గాను. లేకుంటే... ఆ పైన ఆలోచనలు దొర్ల లేదు. కళ్లల్లో కాలు, చెయ్యి, నోరు పడిపో యిన రాఘవయ్య రూపం కనబడుతోంది.

"బాబాయి మాట కాదనొద్దండీ"

అక్కడికి ఎప్పుడొచ్చిందో లక్ష్మి తన తొడకి తల ఆనించి కింద కూర్చుని వుంది.

రామకృష్ణలో ఒక్కసారిగా చలనం వచ్చింది. అన్నిరోజులుగా బిగబట్టుకొన్న దుఃఖం ఆపుకోలేకపోయాడు. "అలాగే" అంటూ వంగి ఆమె తలకి తన తల ఆనించి కుండ పగలగొట్టినట్టు ఏడ్చాడు.

లక్ష్మి మనసు విలవిలలాడింది.

"నువ్వాలోచించినట్లు నేనాలోచించలేక పోయాను లక్ష్మీ" అంటూవుంటే అతని ఏడుపులోని దుఃఖతీవ్రతను చూసి తనూ ఏడ్చేసింది.

శేషగిరి మాష్టారు స్నానం చెయ్యడం అయిపోయినట్టు బాత్రూం తలుపు తీసిన శబ్దం వినబడడంతో కళ్లు తుడుచుకొని అక్కడినుంచి లేచింది.

రామకృష్ణ మొహం చూడగానే అతను ఏడుపు దాచుకొంటున్నాడని తెలిసిపో యింది శేషగిరి మాష్టారుకి. మౌనంగా లక్ష్మి టిఫిన్ పెడితే తినేసిపోయి బెడ్రూంలో పడుకొన్నాడు.

అయిదు, పదినిముషాల తరువాత రామ కృష్ణ లేచిపోయి శేషగిరి మాష్టారి పక్కన కూర్చుంటూ "కాలేజీకి ఫోన్‌చేసి పిల్లల్ని రమ్మని చెప్తాను మాష్టారూ. వాళ్ళు రాగానే చెప్పేసి బయల్దేరదాం" అన్నాడు.

శేషగిరి మాష్టారి పెదాలు చిన్నగా నవ్వాయి. "నాకు తెలుసు రామకృష్ణా నీది జాలి హృదయమేనని. కావాలనే దాన్ని రాయి చేసుకొన్నావు. నీకోసం మీ నాయన తపిస్తున్నాడు తెలుసా. ఎప్పుడూ సీరియ స్‌గా వుండే ఆయన మొహంలో ఏడుపు కనబడుతూవుంది. మీ అమ్మనిగానీ, మీ అక్కనుగానీ పట్టించుకోవడంలేదు. నీ పేరు వినబడితే చాలు, కళ్ళు తెరిచి చూస్తు న్నాడు. ఆయన మనసంతా నీచుట్టూ అల్లు కొని వుంది. డాక్టర్ కూడా అదే మాట చెప్పాడు. కొడుకు దగ్గరుంటే సగం జబ్బు నయమయినట్టేనంట" శేషగిరి మాష్టారు చెప్తూవుంటే రామకృష్ణ పొగిలి పొగిలి ఏడు స్తున్నాడు.

"నన్ను క్షమించండి మాష్టారూ, ఆ వూరికి నా మొహం చూపించలేక రాలేకపో యాను. బయల్దేరదాం మాష్టారూ" అంటూ రామకృష్ణలేస్తూ వుంటే మెటాడోర్‌లాంటి వ్యాను ఒకటి మాట్లాడు రామకృష్ణా, అందులో మీనాన్నని పడుకోబెట్టడానికి పరుపు ఒకటి కావాలి" అని చెప్పాడు శేష గిరి మాష్టారు.

"అలాగే మాష్టారూ"



అయిదు గంటలవుతుండగా వ్యాన్ కది లింది.

ఇంటిదగ్గర నరేష్‌కి, మహేష్‌కి తోడుగా చంద్రశేఖర్‌ని వుంచి శేషగిరి మాస్టారితో లక్ష్మి, రామకృష్ణ బయల్దేరారు.

దాదాపు పన్నెండేళ్ళకి ఆ వూరు పోవడం రామకృష్ణకి పెద్ద శిక్షలా వుంది. వ్యాన్‌లో కూర్చున్నాడేగానీ మనసు మనసులో లేదు. ఏడవాలనిపిస్తుంది. పిచ్చిపట్టినట్లుంది. ఏదో కసి, కోపం, జాలి, ప్రేమ.

'అది నీ ఖర్మ' అన్న శేషగిరి మాస్టారి మాట చెవుల్లో పదేపదే రింగవుతూ వుంటే... అవును నిజమే అనిపించింది. లేకుంటే అన్నీ వుండి లేని వాడిలా దరిద్రం ఎందుకనుభవిస్తాడు. అలా మొహాన రాసి వుంది కాబట్టి అలాగే జరిగింది. అలా జరగబట్టే తను హైదరాబాదులో స్థిరపడిపోగలిగాడు. లేకుంటే ఆ వూళ్లోనే ఎండకు ఎండుతూ, వానకు తడుస్తూ పొలం గట్ల మధ్య ఎద్దులా చాకిరీ చేసేవాడు. అదంతా తప్పించి మేలు చేశాడు దేవుడు. కాదు కాదు... దేవుడు కాదు ఆ మేలు చేసింది అమ్మా, నాన్నలే. అది అదంతా విధి ఆడిన నాటకమే.

ఆహా! ఆ విధివిలాసంలో సుఖదుఃఖాల ఆటలు ఇలా వుంటాయి కాబోలు. కాలమా! ఓ కాలమా! నీకు జోహారు. నీగమనం, గమ్యం ఎంత అగమ్యమో అర్థమవుతూ వుంది తల్లీ... అన్యాయాలు చేస్తావు, అక్రమాలు చేస్తావు, అన్నం పెడతావు అన్నీ చేస్తావు. అనూహ్యంగా అఘాయిత్యాలు చేస్తావు. ఏది చేస్తావో, ఎందుకు చేస్తావో ఎవరికీ తెలియనియ్యవు. చేసినవన్నీ చేసి ఏమీ ఎరుగనట్టు నీదారిన నువ్వు పోతావు. కనీసం క్షణంలో లక్షోవంతయినా నిలబడి చూడవుగా, నీకసలు మనసు వుందనుకోవాలా, లేదనుకోవాలా, ఏమనుకోవాలో... అవునులే ప్రాణంలేని పదార్థానివి నిన్ను గురించి ఏమనుకొంటే ఏం లాభం.

ఆలోచనలతో సతమతమవుతున్నాడు.

చీకటి ప్రపంచాన్ని చీల్చుకొని వ్యాను వెళుతూవుంది.

డ్రైవర్‌కి అప్పుడు గుర్తుకువచ్చినట్లుంది. టేప్‌రికార్డర్ ఆన్‌చేశాడు. అన్నమయ్య కీర్తన 'బ్రహ్మమొకటే పరబ్రహ్మమొక్కటే...' తక్కువ సౌండ్‌తో వస్తోంది. ఆ కీర్తన చెవుల్లోకి దూరడంతోటే రామకృష్ణలో ఆలోచనలు ఆగిపోయాయి. ఏదో సేద తీరినట్టుగా వుంది. వ్యాను వేగంలో గాలి చల్లగా వుంది.

కీర్తన వింటూ కళ్ళు మూసుకొన్న రామకృష్ణ మనోనేత్రానికి రాఘవయ్య రూపం కనబడి చేష్టలుడిగిపోయిన వాడిలా వుండిపోయాడు.

అక్షరాభ్యాసం రోజున పలకమీద అ,ఆలు దిద్దబెట్టిన శేషగిరి మాస్టారికి తన చేత పంచలచాపు యిప్పించాడు. హైస్కూలు చదువు పూర్తికాగానే కందుకూరుపోయి కాలేజీలో చేరితే మావాడు టౌన్‌లో పెద్ద చదువు చదువుతున్నాడని సంతోషపడ్డాడు. ఆ సంతోషాన్ని దాచుకోలేక వూళ్లో చెప్పుకొని ఎంత సంబరపడ్డాడో. నెలకు రెండుమూడుసార్లయినా తన దగ్గరకు వచ్చేవాడు. వచ్చేటప్పుడు అరిసెలు, చక్రాలు, సున్నుండలు తెచ్చేవాడు, డబ్బులిచ్చేవాడు. సెలవులకు వూరికిపోతే తనచేత ఒక్కపనీ చేయించేవాడు కాదు. కబాడీ ఆడినప్పుడు కుడికాలు బ్రొటనవేలు బెణికితే ఆయన వళ్లో తనకాలు పెట్టుకొని ఆముదం వేసి రుద్దాడు.

ఆ ప్రేమంతా ఏమయ్యింది. అలా ఎందుకు మారిపోయాడు, అంత కర్కోటకంగా ఎలా ప్రవర్తించ గలిగాడు? అక్క... అక్క... అక్కే అన్నిటికీ కారణం. స్వార్థంతో ఆమె చెప్పిన మాటలన్నీ అమ్మ నమ్మింది. తన మెతకతనం, లక్ష్మి మంచితనం, వాళ్ల అఘాయిత్యానికి దారి సుగమం చేశాయి. ఆరోజు తను కర్రతీసుకొని వాళ్ళమీదికి పోకుండా వుండాల్సింది. పరిస్థితి అలావుంది. ఏం చెయ్యాలి, కట్టు




కొన్న పెళ్లాన్ని కాపాడుకోవాలిగా. తను చిన్నవాడు. ఏదో ఆవేశపడ్డాడు కానీ నాన్న పెద్దవాడు. సర్దిచెప్పాల్సింది పోయి సయ్యంటూ కయ్యమాడటం తలచుకొంటే అసహ్యంగానూ, సంస్కార హీనంగానూ వుంది. ఛ...ఛ... ఏం జీవితాలో, ఏం మనుషులో ఏదీ వెంటరాదనీ తెలిసిగూడా అన్యాయాలు, అక్రమాలు చెయ్యడం మానరు. జరుగుబాటు బాగున్నప్పుడు అహంకారంతో కళ్ళు, చెవులు మూసుకొని పోతాయి. ఎవరినీ లెక్కచెయ్యరు.

నాన్నకెలావుందో మంచంలో వున్నాడంట. జానీ బాషా ఫోన్ చేసినప్పుడు బయల్దేరిపోయివుంటే బావుండేది. కనీసం శేషగిరిమాష్టారు ఫోన్ చేసినప్పుడన్నా పోవలసింది. లక్ష్మి బతిమాలుతూనే వుంది. తనకే పోబుద్ధికాలేదు. ఇప్పుడన్నా పోగలుగుతున్నాను. అదే శేషగిరి మాష్టారి దయవల్ల. ఆయన రాకుంటే తను పోయేవాడు కాదు. అప్పుడు నాన్న పరిస్థితి. ఆపైన ఆలోచించలేకపోయాడు. హృదయంలోంచి దుఃఖం పొంగుకొస్తూవుంది. కుడిచేతి మునివ్రేళ్లకి నుదురు ఆనించుకొని కళ్ళు మూసుకొన్నాడు.



రామకృష్ణలో హృదయస్పందన వేగం పుంజుకొంది.

'అమ్మా అంకమ్మ తల్లీ' అనుకొన్నాడు.

అప్పుడే వ్యాను ఆ గుడిముందుగా వూళ్లోకి వచ్చేసింది.

ఇంటిముందు ఆగడంతోటే తల త్రిప్పి పక్కకు చూశాడు.

ఇంట్లో ఎలాంటి గోల, ఏ జనమూ లేరు 'హమ్మయ్య' అనుకొని దిగేసరికి పార్వతి పరుగున వచ్చి "వచ్చావురా రాముడూ... రార్రా నాన్నకి పక్షవాతం వచ్చిందిరా. నీ కోసమే చూస్తున్నాడురా" అంటూ రామకృష్ణని గట్టిగా పట్టుకొని ఏడ్చేసింది.

రామకృష్ణకి వళ్ళంతా వణుకు వచ్చింది.

"అక్కా..." కట్టలు తెంచుకొన్నాయి కన్నీళ్లు.

"లక్ష్మీ... లక్ష్మీ రాలక్ష్మీ. నేను పాపిష్టి దాన్ని నీకన్యాయం చేశాను. రా లక్ష్మీ" అంటూ లక్ష్మిని అల్లుకుపోయింది పార్వతి.

అప్పటికే అక్కడ ఇరుగుపొరుగు వాళ్ళు వాళ్ళ చుట్టూ గుమిగూడారు.

రామకృష్ణ రాఘవయ్య పక్కలో కూర్చుని కన్నీళ్ళు పెట్టుకొంటూ వుంటే "ఏం రామకృష్ణా కులాసానా" అంటూ నాగేశ్వరమ్మ వచ్చి కూర్చుంది. రామకృష్ణ 'ఆ' అనే లోపు "ఏందోలే నాయనా దేవుడిట్లా చేశాడు. తీసుకొనిపోయి మంచి డాక్టరుకు చూపించు... అమ్మని కూడా తీసుకొని పోతావా" అని అడిగింది.

"అచ్చుంగా నాన్ననే ఎట్లా తీసుకొనిపోతానమ్మా, యిద్దరినీ తీసుకొనిపోతాను" చెప్పాడు రామకృష్ణ.

"అంతేలే నాయనా. ఇద్దరూ ఒకచోట వుండడమే మంచిది"

నాగేశ్వరమ్మ మాట్లాడుతుంటే జానీ భాషా వచ్చి రామకృష్ణని క్షేమసమాచారాలు అడిగి, రాఘవయ్య జబ్బుని గురించి మాట్లాడి వెళ్ళిపోయాడు.

పది గంటల బస్సులో వాణి, రాణి, కిర

ణ్‌కుమార్, సందీప్ వచ్చారు. వస్తూనే వాళ్ళు లక్ష్మి, రామకృష్ణలతో మాటలు కలిపేశారు. రాఘవయ్యని రామకృష్ణ హైదరాబాదు తీసుకొని పోతున్నాడని తెలిసి వూళ్ళోవాళ్ళ పరామర్శలు ఎక్కువయ్యాయి.

రెండుగంటలు దాటుతుండగా శేషగిరి మాష్టారు వచ్చాడు. ఆయన కోసమని పార్వతి నవారు మంచం తెచ్చి పందిట్లో వాల్చింది. శేషగిరి మాష్టారు కూర్చుంటూ రామకృష్ణను పిలిచి దగ్గర కూర్చోబెట్టుకొని "నీతో కొన్ని విషయాలు మాట్లాడాలయ్యా" అన్నాడు.

"మాట్లాడండి మాష్టారూ"

రెండు నిముషాలు తటపటాయించి "వూళ్ళో అప్పు వుందంటయ్యా" అని అన్నాడు.

"వుంటే నేను తీరుస్తాన్లే మాష్టారూ" అన్నాడు రామకృష్ణ.

అక్కడే వున్న పార్వతి అందుకు వెంటనే స్పందించి "నువ్వు తీర్చొద్దు, నేను తీరుస్తాను' ' అని అంది.

రామకృష్ణ ఏదో అనబోతుంటే "అందులో ఒక్క పైసాగూడా నీకు చెందలేదు"

"అయితేమానిలే..."

రామకృష్ణ మాటలకి వాణి అడ్డువస్తూ "మావయ్యా, ఇప్పటికే మావల్ల నీకు చాలా అన్యాయం జరిగింది మావయ్యా, ఈ విషయంలో నువ్వు పట్టుదలకు పోవద్దు"

వెంటనే రాణి అందుకొని "మామాట విను మావయ్యా... నీ ముందు మేం ధైర్యంగా తలెత్తుకోలేకపోతున్నాం. మాకు తెలియని వయసులో మా అమ్మ తప్పుచేసింది. మమ్మల్ని క్షమించు మామయ్యా. ఆ అప్పు లెక్క లోనిదికాదు మాకు. తలాకాస్త వేసుకొంటే అదే తీరిపోతుంది. ఆ అవకాశాన్ని మాకు ఇవ్వు మామయ్యా" అన్నది.

వాళ్ళ మాటలకి శేషగిరి మాష్టారు చలించిపోయాడు. అంత మంచి మనసు వాళ్ళకుంటుందని తను వూహించనే లేదు. "సరేసరే రామకృష్ణా ఆ విషయం తర్వాత మాట్లాడుకోవచ్చుగానీ ముందు పొలాల సంగతి చెప్పు. అమ్ముకోవాలనా, కౌలుకివ్వాలనా? అమ్ముకోవాలంటే కొనేవాళ్ళు అడుగుతున్నారు. కౌలుకివ్వాలనుకొనుకుంటే చేసుకొనేవాళ్ళున్నారు" అని అన్నాడు.

"అది నాకు తెలీదు మాష్టారూ. అమ్మా, నాన్న, అక్క, బావ వాళ్లయిష్టం" అని చెప్పాడు రామకృష్ణ.

ఆ విషయమై భూదేవమ్మనడిగాడు శేషగిరి మాష్టారు.

"నాదేముందయ్యా, అంతా వాడిష్టం" అనేసిందామె.

శేషగిరి మాష్టారు రామకృష్ణ మొహంలోకి చూశాడు.

"నా యిష్టం ఏమీ లేదు మాష్టారూ. ఈ ఆస్తికోసం నేను రాలేదు. అంతా మా అక్క యిష్టం. ఆమె ఏమయినా చేసుకోవచ్చు" రామకృష్ణ అంటూ వుంటే "నాకొద్దు, ఈ ఆస్తిఅంతా వాడిదే. వాడినే ఏమన్నా చేసుకోమను" అని అడ్డు చెప్పింది పార్వతి.

శేషగిరిమాష్టారికి ఏమీ తోచలేదు.

"అయితే చెరిసగం పంచుకోండి" అన్నాడు.

"వద్దు... నాకొద్దు... ఈ ఆస్తిలో నాకు పైసా కూడా వద్దు. నాకు నా తమ్ముడు కావాలి...నాకు నా తమ్ముడు కావాలి" అంటూ వుద్వేగ్నంగా ఏడ్చేసింది.

లక్ష్మి చలించిపోయింది.

"వదినా వదినా ఏంటొదినా" అంటూ వచ్చి పట్టుకొని "చిన్నదానిలా ఏంటొదినా" అని ఓదార్చబోయింది.

పార్వతిలో దుఃఖం పొంగి పొంగి వచ్చింది.

"లక్ష్మీ... లక్ష్మీ! నీకు దణ్ణం పెడతాను లక్ష్మీ! నాకు ఈ ఆస్తిలో పైసా కూడావద్దు లక్ష్మీ. ఎప్పుడన్నా నేను మీ ఇంటికివస్తే నా మొహాన అంత బొట్టు పెట్టి ఒక్క రవిక ముక్క పెట్టు లక్ష్మీ. అది చాలు నాకు. అంతకుమించి ఏమీవద్దు" అంటూ లక్ష్మి

చేతులు పట్టుకొన్నది.

పార్వతిలో వచ్చిన మార్పుని చూసిన శేష గిరి మాష్టారు తన కళ్ళను తానే నమ్మలేకపో యాడు. సంతోషంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. రామకృష్ణ కళ్ళు తుడుచుకుం టుంటే చూసి "ఈ విషయాలన్నీ ఇప్పుడు కాదులే రామకృష్ణా తర్వాత మాట్లాడు కొందాం" అన్నాడు.

"అలాగే మాష్టారూ"

శేషగిరి మాష్టారు వాచీకేసి చూసుకొని "అయిదు గంటలు కావస్తుందయ్యా లేచి బయల్దేరండి" అంటూ తను వాళ్ళని ప్రయాణం చేశాడు.

శేషగిరి మాష్టారు వ్యానులో పరుపు పరి పించి రాఘవయ్యని పడుకోబెట్టించాడు.

లక్ష్మి వ్యానులో కూర్చోబోతూ అందరి దగ్గరా సెలవు తీసుకొంటూ అక్కడ స్వాతి కనబడకపోవడంతో "వదినా, స్వాతి, స్వాతి భర్త రాలేదా" అని అడిగింది పార్వతిని.

"ఏంటో లక్ష్మి రాలేదు వాళ్ళు..." అని పార్వతి చెప్తూవుంటే

"వాళ్ళు అంతేలే అత్తా ఎప్పుడూ ఏదో ఒక కొరవతో వుంటారు" అని అంది రాణి.

అక్కడేవున్న రామకృష్ణ ఆ మాటలు విని "మీలో ఎవ్వరూ ఏ కొరవా పెట్టుకోవద్దమ్మా, మేం మళ్ళా వస్తాం. ఎవరికేం కావాలో తీసు కోండి" అన్నాడు.

"మాకేమీ వద్దు మామయ్యా. మమ్మల్ని గుర్తుంచుకో చాలు. అప్పుడప్పుడూ వచ్చి చూసిపోతూవుండు. మాకూ మేనమామ వున్నాడు, మా క్షేమం కోరుకొంటాడు అనే ధైర్యం కలిగించు మామయ్యా" అంటూ వాణి అభ్యర్థిస్తూవుంటే రామకృష్ణ చలించిపో యాడు. అందరి కళ్ళూ చెమ్మగిల్లాయి. శేష గిరి మాష్టారు ఆ వాతావరణాన్ని ప్రశాంతప రచి, భూదేవమ్మని వ్యాను ఎక్కించాడు. లక్ష్మి, రామకృష్ణ కూడా వ్యానులో కూర్చున్న తర్వాత తనూ ఎక్కి కూర్చుని "పోనివ్వు" అని చెప్పాడు డ్రైవరుకు.

పార్వతి, వాణి, రాణి కన్నీళ్ల మధ్య వ్యాను కదిలింది. వూరుదాటి బస్టాండులోకి రాగానే శేషగిరి మాస్టారు డ్రైవరుకు చెప్పి ఆపిం చాడు. అది చూసిన రామకృష్ణకు విషయం తెలియక "ఏమిటి మాస్టారూ" అని అడి గాడు.

"ఏం లేదులే నాయనా ఇప్పుడే వస్తాను మీరు కూర్చోండి" అంటూ శేషగిరి మాస్టారు వ్యాను దిగి అక్కడి కొట్లో కొబ్బరి కాయ కొని, అంకమ్మ గుళ్ళో కొట్టి అక్కడ వున్న కుంకుమ తీసుకొని వచ్చాడు. రాఘవయ్య పక్కన కూర్చుని ఆయన నుదుట బొట్టు పెట్టి "ధైర్యంగా వుండు, నీకేం కాదు మళ్లీ లేచి తిరుగుతావు" అని చెప్తూవుంటే ఆయ నతో రాఘవయ్య ఏదో మాట్లాడాలని ఏదో చెప్పాలని అనుకున్నా నోరు మెదపలేని స్థితి. నిస్సహాయంగా చూస్తూ వూపిరివున్న చేతితో శేషగిరి మాస్టారి పాదాలు పట్టుకోబోయాడు "నన్ను క్షమించయ్యా" అన్నట్లు.

శేషగిరి మాస్టారికి దుఃఖం వచ్చింది. రాఘవయ్య చేతిని తన చేతుల్లోకి తీసుకొని "నేను వచ్చే నెలలో మీ దగ్గరకు వస్తాను... సరేనా... ఇంక నేనుండనా" అన్నాడు.

'నన్ను క్షమించావుకదూ' అన్నట్లు రాఘ వయ్య కళ్లు మూసి తెరిచాడు. ఆ కళ్లలోంచి నీళ్లు కారాయి. శేషగిరి మాస్టారు తుడిచాడు.

"రామకృష్ణా వుంటానయ్యా! పోగానే లెటర్ రాయి. అమ్మా భూదేవమ్మా.. అమ్మా లక్ష్మి వుంటానమ్మా" అంటూ శేషగిరి మాస్టారు వ్యాను దిగుతూ వుంటే వణుకుతున్న పెదా లతో "మాస్టారూ" అన్నాడు రామకృష్ణ.

"మీకేం ఫర్వాలేదయ్యా. మంచివాళ్లకి ఎప్పుడూ దేవుడు అండగానే వుంటాడు" శేషగిరి మాస్టారు అంటూ వుంటే వ్యాను కదిలింది. ◆

**అంకితం**

పితృదేవులు,
కీర్తిశేషులు ఆదిమూలం మల్లికార్జునరావు గారి పాదపద్మములకు భక్తితో ప్రణమిల్లుతూ...
రచయిత

# చతుర ప్రపంచం

## వింతహాబీలు

'మీ హాబీ ఏమిటి?' అని ఎవరైనా ప్రశ్నిస్తే మనం టీవీ చూడడమనో, పుస్తకాలు చదవడమనో చెబుతాం. ఇవికాక స్టాంపులు, నాణాలు సేకరించే హాబీ కూడా కొందరికుంటుంది. అయితే ఇప్పుడు చెప్పబోయే వారి గురించి వింటే 'కాదేదీ హాబీకనర్హం' అన్నమాట మీరు కచ్చితంగా ఒప్పుకుంటారు.

యూరప్‌కి చెందిన ఓ పెద్దమనిషికి రకరకాల గుండీలు సేకరించడం అంటే భలే సరదా. ఆ విధంగా దాదాపు 3 వేల రకాల గుండీలను సేకరించినా అతగాడికి ఇంకా వాటిమీద మోజు తగ్గలేదు. ఓసారి పక్కవాని కోటు గుండీ నచ్చి అతన్ని ఆ గుండీ తనకిమ్మని అడిగాడట. అతను కాదనడంతో బలవంతంగా లాక్కోబోయి అరెస్టయ్యాడు.

అమెరికాకు చెందిన ఛార్లెస్ జెహిగ్స్‌కి అగ్గిపెట్టెల నమూనాలు సేకరించే హాబీ ఉంది. ఆవిధంగా అతను దాదాపు పాతిక లక్షల అగ్గిపెట్టెల నమూనాలను సేకరించాడు.

కేవలం హాబీగా సిగరెట్ పెట్టెలు సేకరించడం మొదలెట్టి అందుకోసం సింపుల్‌గా 25 కోట్ల రూపాయలు ఖర్చు చేసిన ఘనత డా॥ రాబర్ట్ కాఫ్‌మాన్‌కి చెందుతుంది. అమెరికాకు చెందిన రాబర్ట్ అన్ని దేశాల నుండీ దాదాపు 7,495 రకాల సిగరెట్ పెట్టెలు సేకరించి సిగరెట్ పెట్టెల మ్యూజియమ్ ఏర్పాటు చేశాడు. ఇందుకుగాను కేవలం పాతిక కోట్లు ఖర్చయ్యిందంతే.

ఇక కజుకి బరిబె అనే వ్యక్తి 17 సంవత్సరాలు శ్రమించి సీసాలు పోగుచేశాడు. ఆ విధంగా పోగైన రెండు లక్షల ఏభై వేల రకాల సీసాలతో 'గ్లాస్ కేజిల్' నిర్మించాడు.







టోకియోలో ఉన్న ఈ గ్లాస్ కేజిల్ విదేశీ యాత్రికులను విశేషంగా ఆకర్షిస్తోంది.

పశ్చిమ జర్మనీలోని ఉల్ఫ్‌గాంగ్ 12 వేల రకాల విజిటింగ్ కార్డ్‌లతో ఏకంగా ఓ మ్యూజియమే నెలకొల్పేస్తే, స్పెయిన్ దేశీయుడైన షికోట్ ఆ పని మద్యం సీసాలతో చేశాడు. ఇందుకు ఆయనకు 65 సంవత్సరాలు పట్టింది. దేశదేశాలనుండి పదివేల రకాల మద్యంసీసాలు తెప్పించి షికోట్ ఈ డ్రింక్స్ మ్యూజియం ఏర్పాటు చేశాడు.

ఆలోచించండి మీకేమైనా కొత్త థాట్స్ వస్తాయేమో!?

---

# నయాగరా పై నడిచిన వీరుడు

'నయాగరా జలపాతం' గురించి తలుచుకుంటేనే వళ్లు జలదరిస్తుంది. అలాంటిది జలపాతం మీద నడవడమంటే అసాధ్యం అంటారా? కానీ దానిని సుసాధ్యం చేసి చూపించాడు బ్లాడెన్. అతను ఫ్రెంచి జాతీయుడు.

నయాగరా జలపాతం 162 అడుగుల పైనుంచి భయంకరంగా చప్పుడు చేస్తూ కిందకి దూకుతుంది. కేవలం ఒక్క నిముషంలో ఒకటిన్నర కోట్ల ఘనపుటడుగుల నీరు ప్రవహిస్తుంది. అలాంటి జలపాతానికి ఇరువైపులా 1100 అడుగుల ఓ తీగెను బిగించి కట్టి బ్లాడెన్ అటూ ఇటూ నడిచి చూపించాడు. ఇది 1859 జూన్ 30 న జరిగింది.

బ్లాడెన్ అయితే ధైర్యంగానే నడిచాడు కానీ అతని సాహసం చూసిన వాళ్లల్లో కొంతమందికి భయంతో స్పృహ తప్పింది. నాటినుంచీ నేటివరకూ ఇలాంటి సాహసాన్ని ఎవ్వరూ చేయలేకపోయారు.




ఆ విధంగా బ్లాడిన్ రికార్డ్ ఇన్నేళ్లు గడిచినా చెక్కుచెదరలేదు.

అయితే అమెరికన్ సైన్యంలో సార్జంట్‌గా పనిచేసిన వాల్టర్ రాబిన్‌సన్ మాత్రం ఓ ప్రత్యేకమైన నీటి పాదరక్షలు ధరించి ఇంగ్లీష్ ఛానెల్ మీద నడుస్తూ 12 గంటలకాలంలో దాన్ని దాటాడు.



# హనీవెంచర్

'హనీమూన్' ని ఆధునిక యువతరం 'హనీవెంచర్' గా మార్చేశారు. ఫస్ట్‌నైట్ ని థ్రిల్లింగ్ గానూ, ఎక్సైటింగ్ గానూ జరుపుకోవడానికి కుర్రకారు ఉరకలేస్తున్నారు. వీరిలోని అడవుల్లోకో వెళ్లి చెట్లపైన బ్యాంబూ హౌస్‌లో మీ తొలిరాత్రి వేడుక జరుపుకోవాలన్నా సాధ్యమే. నేడు చాలామంది దీనినే ప్రిఫర్ చేస్తున్నారు. చెట్లపైన బ్యాంబూహౌస్‌లో ఈ జంట ఉన్నప్పుడు కింద క్రూరమృగాలవీ తిరుగుతుంటే మరింత శోభాయమానంగా ఉంటుందట.




ఉబలాటం తీర్చేందుకు కోరుకున్న చోట 'హనీవెంచర్' లు ఏర్పాటు చేసేందుకు అనేక ఏజెన్సీలు వెలిశాయి.

స్విట్జర్లాండ్ ఆల్ఫ్స్ పర్వతాల మీద స్కేటింగ్ చేస్తూ మంచు బంతులాడుకోవాలనుకున్నా, నీటిఅలలలో ఈదులాడుతూ ముద్దూమురిపెం తీర్చుకోవాలనుకున్నా మీ ముచ్చటేమిటో హనీవెంచర్ ఏజెన్సీకి చెప్తే చాలు, వాళ్లే ఏర్పాట్లు చేస్తారు.

ఇంతేకాదు. ఏ జాంబియాకో, జింబాంబ్వే ధృవప్రాంతాల్లోని ఇగ్లూలు, గ్లేసియర్‌లన బడే మంచుగుహలు కూడా వీరి హనీమూన్ స్పాట్సే.

ఇక విక్టోరియా జలపాతపు నీటి తుంపరలు తమని అభిషేకిస్తుండగా ఒక్కటవ్వాలనుకునే జంటల సంఖ్య రోజురోజుకీ పెరుగుతోందని హనీవెంచర్ ఏజెన్సీల స్పెషలిస్ట్ ఆల్బర్‌కంట్ అంటున్నారు.

హనీవెంచర్ యాత్రకు వెళ్లాలనుకుంటే గుండెధైర్యంతో పాటు పుష్కలంగా డబ్బు కూడా ఉండాలిమరి.

☆

# 'రాక్షసనీడ' పై ఉత్తమ సమీక్షలు

ఫిబ్రవరి చతురలో ప్రచురితమైన రెడ్డి స్వరాజ్యలక్ష్మి నవల 'రాక్షసనీడ' పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## కేంద్రబిందువు

*(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

"గజానికొక గాంధారి కొడుకు గాంధీగారి దేశంలో" అంటారు తిలక్. నిజమే. అడుగడుగునా గాంధారి కొడుకులీ దేశంలో తారసపడుతూనే వుంటారు. ఆడవాళ్ళని అల్లరి పెట్టేవారూ, వాళ్ళ మాన ప్రాణాల్ని దోచుకునేవారూ కొందరైతే, ఏకంగా వాళ్ళ శీలాల్తో వ్యాపారం కూడా చేసేవారు మరి కొందరు. అక్కడక్కడా కనిపించే మైలురాళ్లలా సహృదయులూ, ప్రేమికులూ, నమ్మిన స్త్రీ కోసం దేన్నైనా త్యాగం చేసేవారు కూడా వున్నారు. స్త్రీల పట్ల పురుషుల విభిన్న దృక్పథాల ఆధారంగా రూపుదిద్దుకున్న పరిశోధనాత్మక నవల రెడ్డి స్వరాజ్యలక్ష్మిగారి రాక్షసనీడ. స్త్రీ కేంద్ర బిందువుగా సాగిన ఈ నవలలో కథకు పాత్రలన్నీ జీవం పోశాయని చెప్పవచ్చు. అయితే కథానాయికగా చెప్పవలసిన మిన్నూ పాత్ర చిత్రణలో ఔచిత్య లోపం జరిగింది.

'గ్రేకలర్ ఫాంట్ వాలా'ని అసహ్యించుకొన్నప్పటికీ, హృదయ, శరీర 'స్పందన' అనే పదం మాటున సిద్ధార్థ (అదే ఫాంట్ వాలా) స్పర్శకి తన్మయత్వం చెందడం, అతని కౌగిలిలో ఒదిగిపోవటం, మైమరచిపోవటం వంటి అసంబద్ధపు చిత్తవృత్తుల సమ్మేళనం మిన్నూ పాత్రని బలోపేతం చేయలేకపోయాయి. ఆకలికి ఆగలేక అపరిచితుని 'ఉమన్ వీక్‌నెస్'ని ఆసరాగా చేసుకుని, అతణ్ణి బోల్తా కొట్టించి టిఫిన్ తినటం, అతని పర్స్‌లో డబ్బు తీస్కోవడం చిలిపి



తనం కాదు. వెకిలితనమే అవుతుంది.

క్షమించరాని తప్పు చేసిన అమరేంద్ర మిన్నూని అపహరించడం, అతణ్ణి వింధ్య కాల్చి చంపడం వగైరాలన్నీ సినిమా చివరి సన్నివేశాల్ని తలపింపజేస్తాయి. మేఘశ్యామ్ హత్య తప్పించి మిగిలిన సంఘటనలన్నీ, చివరికి సిద్ధార్థ పనులు సైతం పాఠకుల ఊహకు ముందే అందడంతో నవలలో సస్పెన్స్ కొరవడి పూర్తిగా పరిశోధనాత్మకం కాలేకపోయింది.

కథనం, శైలి, సంభాషణాది చాతుర్యాల వల్ల నవలని అవిచ్ఛిన్నంగా చదివింపజేసిన క్రెడిట్ స్వరాజ్యలక్ష్మికి దక్కుతుంది.

—బూరెల అరుణ,
సోంపేట-532 284

# జవాబు దొరకని ప్రశ్న

*(రెండవ బహుమతి రూ. 75/– పొందిన సమీక్ష)*

అనాదిగా స్త్రీ పురుషుడి నీడలో పీడనకు గురవుతూనే వుంది. అతని పురుషాహంకారానికి, అమానుషత్వానికీ బలవుతూ వస్తోంది. శతాబ్దాలు మారినా స్త్రీ విషయంలో ఆశించిన అభ్యుదయం సాధించలేకపోవడం శోచనీయం. విద్యావంతురాలయినా, ఉద్యోగస్తురాలయినా... అందం, ఐశ్వర్యమూ కలిగివున్నా... మనసు చంపుకుని మగాడి చేతిలో ఆటబొమ్మగా మిగిలిపోతోంది. ఇది యుగయుగాలుగా ఆనవాయితీగా వస్తోన్న అనాచారం! త్రేతాయుగంలో సీత... ద్వాపరంలో ద్రౌపది సైతం ఈ అత్యాచారంనుంచి తప్పించుకోలేకపోయారు. రచయిత్రి తన క్రైమ్ సెంటిమెంటల్ నవలలో చెప్పదలచుకున్న విషయం ఇదేననిపిస్తుంది.

మనిషి మితిమీరిన స్వార్థం, అత్యాశ, అహంకారం, అధికారం సాటిమనిషిని ఎక్స్ప్లాయిట్ చేయడానికి ముఖ్యకారణాలనుకుంటే అమరేంద్ర అందుకు గొప్ప ఉదాహరణ! అమరేంద్ర వంటి కాపురుషుల 'రాక్షసనీడ' సమాజానికి పట్టిన చీడ అనుకుంటే శివప్రకాష్ వంటి సజ్జనులు ఓ వరం!

అయితే నవల చదువుతుంటే సందేహాలు కొన్ని తేలుకొండిలా పొడుస్తాయి. శ్యామ్ క్రమశిక్షణలో పెరిగిన మనిషి. మంచి ఫొటోగ్రాఫరు. జాతీయ స్థాయిలో సైతం బహుమతి అందుకున్న గొప్ప చిత్రకారుడు. అటువంటి ఉత్తమ కళాకారుడు ఎవరికోసమో అశ్లీల దృశ్యాలను చాటుమాటుగా ఫొటోలు తీసే నీచత్వానికి పూనుకోవడం ఆశ్చర్యం గొలుపుతుంది. అతన్ని అందుకు ప్రేరేపించినది డబ్బుమీది ఆశా? లేక పరిస్థితులా? ఏమిటా తప్పనిసరి పరిస్థితులు? అతను చిక్కుకున్నానని చెప్పుకున్న ఆ విష వలయం ఏమిటి? ?

అలాగే వింధ్య అపురూప సౌందర్యవతి, విద్యావంతురాలు, ఉన్నత కుటుంబానికి చెందినదీను. అటువంటిది అవినీతిపరుడైన భర్త వొత్తిడికి లొంగి తార్పుడికి వశం కావడం అసంబద్ధంగా, అసహజంగా అనిపిస్తుంది. అవసరమైతే భర్త 'రాక్షసనీడ' నుంచి బయటపడి స్వతంత్రంగా బతికే మనోస్థయిర్యం లేనంతటి దుర్బలురాలా ఆమె? మధ్యమధ్యలో రామస్వామి దగ్గరున్న పాపను చూసుకురాగలిగిన తాను ఆ పాపకూపం నుంచి తప్పించుకుని తన పాప వద్దకైనా చేరుకుని వుండొచ్చునేమో? ఇవన్నీ జవాబు దొరకని ప్రశ్నలుగా మిగిలిపోతాయి.

ఇకపోతే పురాణశ్రవణం చేసుకుని బతికే ఓ సామాన్యుడైన రామస్వామిపైన ఊరిపెద్దలు (కామందు కేశవరావు) కత్తిగట్టి వూరునుంచి తమిమేసేంతటి కక్షకు తగిన కారణం కనిపించదు. అలాగే మేమమామ కూతురు కీర్తినే పెళ్ళాడుతానన్న చిన్ని (సిద్ధార్థ) మిన్నూపట్ల అతిచనువుగా ప్రవర్తించడం అతని వ్యక్తిత్వానికి మచ్చే అవుతుంది. ఇక 'ఘటికుడు' అని అమరేంద్ర వంటి వాడిచేత అనిపించుకున్న ఎస్.ఐ. శ్రావణ్ 'ఆటలో అరటిపండు'లా మిగిలిపోతాడు. నవల ముగింపులో కూడా నావెల్టీ కనిపించదు.

అయితే కొన్ని అంశాలలో స్పష్టత లోపించినా కథ నడిపిన తీరు, చక్కటి భాష, సరళమైన శైలి, విశ్లేషణ, సంభాషణలలో పటుత్వం, పరిపక్వతా పాఠకులను ఆకట్టుకుంటాయి. పై లోపాలను పక్కనపెడితే నవల ఆద్యంతమూ ఆసక్తికరంగా సాగి ఏకబిగిన చదివింపజేస్తుంది.

– పి.వి.వి. సత్యనారాయణ,
జెంషెడ్‌పూర్-831 001





## కొత్త మలుపు

*(మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

అపరాధ పరిశోధన మాట ఎలావున్నా, బలవత్తరమైన పరిస్థితుల ప్రాబల్యం కారణంగా జీవితాలు ఎలా మలుపులు తిరిగి నడుస్తాయో చూస్తాం ఈ నవలలో రొటీన్‌గా వచ్చే నవలా వస్తువులకన్నా కొంచెం మార్పును చూపించే ప్రయత్నం బాగానే వున్నా చాలా సంఘటనలు, సన్నివేశాలు కొన్ని పాత సినిమా కథలను ప్రతిబింబించడం వలన ఆ కొత్తదనం మరుగున పడిపోయింది. వింధ్య జీవితం అన్యాయం అయిపోవడం బాధాకరమే అయినా మధ్యలోనే మరొక మార్పు కోసమో, మలుపు కోసమో ఆమె ప్రయత్నించకపోవడం బలహీనంగా వుంది. ఆమెనూ శివప్రకాశ్‌నూ కలపగలిగే మలుపు అవసరం లేదుగానీ, అమరేంద్ర వంటి దుష్టుల ఆటను ముందే కట్టించే పని చేస్తే ఇంకొంచెం బాగుండేది. మిన్నూ (కీర్తన) పాత్రను చాలా ఉత్సాహంగా నడిపించినా, ఒక అపరిచితుని హోటల్‌లో బోల్తా కొట్టించి సొమ్ము చేసుకోవడం కొంచెం అపశ్రుతిగా తోచింది. వున్న పరిస్థితులలో మరో మార్గం లేదుగదా అని చెప్పినా, ఆ వాదంలో కూడా కొంచెం లోపం కనిపిస్తుంది.

ఏమైనా రొటీన్ కథలకు భిన్నంగా అపరాధ పరిశోధన నేపథ్యంగా కొత్త రకంగా వుంది ఈ నవల. ముందు ముందు ఈ రచయిత్రి నుంచి ఇంకా మంచి నవలలు ఆశించవచ్చును. మామూలు కథలకు ఇదొక కొత్త మలుపు అని చెప్పవచ్చును.

– వి. వీరభద్రరావు,
హైదరాబాద్-500 076

## థ్రిల్లింగ్

*(నాల్గవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

సెంటిమెంట్, సస్పెన్స్, హర్రర్‌లతోపాటు కొంత హాస్యాన్ని, మరికొంత శృంగారాన్ని జోడించి కలగాపులగం చేసి సంపూర్ణత సంతరించుకున్న నవల రాక్షసనీడ. నవలా ప్రారంభంనుండి చివరి వరకూ చాలా చక్కగా సామాన్య పాఠకునికి సైతం అర్థమయ్యే రీతిలో మలచబడింది. ఆద్యంతం సస్పెన్స్‌తో సాగుతూ 'థ్రిల్లింగ్'గా నడిచిన నవల రాక్షసనీడ. వివిధరకాల వ్యక్తులు, వారి వారి వ్యక్తిత్వాల మధ్య బేధాలు చాలా ఇంటరెస్టింగ్‌గా నవలను మలచడంలో రచయిత్రి సక్సెసయ్యారు.

సభ్య సమాజంలో 'పెద్దమనిషి'గా చెలామణి అవుతున్న ఒక వ్యక్తి యొక్క చీకటికోణాన్ని తన వెలుగుతో తనలో బంధించుకుని ఒక వ్యక్తి మరణానికి కారణమై ఎవరికీ మనశ్శాంతి లేకుండా చేసిన 'ఫొటోరీలు', దాని చుట్టూ కమ్ముకున్న ఆ పెద్దమనిషి రాక్షస నీడ ఎవరి ప్రాణాలూ బలిగొనకుండా డిటెక్టివ్ సిద్ధార్థ చాలా సాఫ్టుగా, మంచి తెలివి తేటలతో శ్యామ్ హత్యకి సంబంధించిన మిస్టరీని విడగొట్టడంలో తన వృత్తికే వన్నె తెచ్చాడు. మంచి ప్రేమికులుగా ఉండి భార్యాభర్తలు కాలేకపోయిన శివప్రకాష్, వింధ్యల కథనం బావుంది. పెళ్ళైన తర్వాత వింధ్య పరిస్థితి ప్రతి ఒక్కరికంటా నీరు తెప్పిస్తుంది. జీవితంలో డబ్బు ఇబ్బందిని అనుభవించిన అమరేంద్ర పెళ్లైన తర్వాత ఆ డబ్బు కొరకు శాడిస్టుగా మారడం అతని వ్యక్తిత్వానికి అద్దం పడుతుంది. తను ప్రేమించినవాడు లోకం విడిచిపోవడంతో ఏం చేయాలో తోచని స్థితిలో ఉన్న మంగళకు ఆత్మీయులుగా కీర్తన, సిద్ధార్థలు అవతారమెత్తడం ఆనందాన్ని కనబరచింది. తెలివి తేటలు, ముందు జాగ్రత్తతోపాటు స్ఫురద్రూపి అయిన కీర్తన ఉరఫ్ మిన్నూ కథనం బావుంది. ఆమె జీవితంలో మేఘశ్యామ్, మంగళలు ఆలంబన కాగా, ఆనంద్ ఆత్మీయుడుగాను, చివరికి కథానాయకుడు ఆమెకి

బావ అయిన సిద్ధార్థ ఆమె జీవితానికి తోడుగా నిలిచి ఆమె ఆశల సాధానికి చక్ర వర్తి అయ్యాడు. సిద్ధార్థ తన (మామ) కూతురు కోసం పెళ్ళికి ఆగుతానంటే, శివప్ర కాష్ ఆనందించాల్సింది పోయి గడువులు విధించడం నమ్మశక్యంగా లేదు. ఆలమూరు ప్రహసనం కూడా క్వయిట్ ఇంటరెస్టింగ్.

ఇంత సస్పెన్స్‌తో చదివిన డిటెక్టివ్ నవల చతురలో ఇదే ప్రథమం. 'హేట్స్ ఆఫ్ టు రెడ్డి స్వరాజ్యలక్ష్మిగారు"

–మరసకట్ల మనోహర్,
మహాదేవపురం-507 203

## దినదిన గండం

*(అయిదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)*

అడుగడుగునా అరాచకాలతో అక్రమాలు, అన్యాయాలు, అఘాయిత్యాలు రోజురోజుకీ పెరిగిపోతూ రాక్షసకృత్యాలు విలయతాండవ మాడుతున్న నేటి సమాజంలో తన నీడను తానే చూసుకొని భయపడే సగటు మనిషి జీవితం దినదిన గండం నూరేళ్ళ ఆయు ష్షులా తయారైంది. ఆ నేపథ్యంలోనే కథా గ మనాన్ని నడుపుతూ నేటి సంఘానికి అద్దం పట్టిన నవలే ఫిబ్రవరి చతుర నవల 'రాక్ష సనీడ'.

కథాపరంగా నవల ఓ. కే. కాని పూర్వపు సెంటిమెంట్ సినీ డైరెక్టర్ స్క్రీన్‌ప్లేలా కథా గమనం సాగింది. మొదట్లో డిటెక్టివ్ కథలా కాస్త సస్పెన్స్ క్రియేట్ చేసినా కొద్దిదూరం లోనే పాఠకుడికి కథ పూర్తిగా అర్థమైపో తుంది. వింధ్య ఫ్లాష్‌బ్యాక్ ఓపెన్ కాగానే మిన్నూ ఆమె కూతురనే రహస్యం బట్టబ యలు చేయడం ఏం బాగాలేదు. అంత గొప్ప వ్యక్తిత్వం గల హీరో సిద్ధార్థ పాత్ర మిన్నూను కలిసినప్పుడు అక్కడక్కడ అతడి సంభాషణ, ప్రవర్తన, హీరోయిజపు నిండు తనం కోల్పోయినట్టుగా ఉంది.

విలన్‌గా అమరేంద్ర పదునులేని కత్తిలా తయారయ్యాడు. అమరేంద్ర వింధ్యను పెట్టిన చిత్రహింసలు 'అయ్యో పాపం!' అన్పించాయి. ఆ తర్వాత సిద్ధార్థ ముసలాడి వేషంలో ఆనంద్ ఇంటజేరి మిన్నూ రూంలోంచి ఫొటో రీల్ కాజేయడం హాస్యా స్పదంగా సినిమా ఫక్కీలో ఉంది.

మంగళ పాత్రను నెగిటివ్‌గా సృష్టించి ఏ దారిలేని వారికి గోదారే దిక్కన్నట్టు 'నర్స్'గా ముగించడం ఆ వృత్తిని కించపరచినట్టుగా ఉంది. రచయిత్రి అయివుండి సాటి స్త్రీ పాత్రకు అన్యాయం చేయడం సబబుగా లేదు. శివప్రకాష్ పాత్ర నిండుదనం సంతరిం చుకొని కథలో ముఖ్యవ్యక్తిగా మిగిలాడు. హీరోకంటే కూడా వింధ్య పాత్ర నవలకి పునాదిగా నిలిచిపోయిందనడంలో అతిశ యోక్తి లేదు. ఆమె చుట్టూ అల్లుకున్న కథ సెంటిమెంటల్‌గా ప్రతివ్యక్తి హృదయాన్ని కదిలించివేసింది.

హీరోయిన్ మిన్నూ వ్యక్తిత్వానికి తగ్గట్టు ప్రతి కదలికా, మాటతీరు నవలకే హైలైటు. టోటల్‌గా అన్ని పాత్రలు ముఖ్యమైనవే. అయినా వాటిని నడిపే తీరులో కాస్త శ్రద్ధ వహించి ఉంటే పాఠకుడిని ఉత్కంఠగా చది వింపజేసి శెభాష్! అనిపించేలా ఉండేది. సంభాషణలు, ప్రతి సన్నివేశం దేనికదే మొత్తానికి బావున్నాయి. ఓ మంచి కథను పాఠకుల కందజేసిన చతురకు థ్యాంక్స్ ఎ లాట్.

– అవుసలి ఆంజనేయులు
హైదరాబాద్-500 018

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060. Cuddapah: 70011; Tadepalligudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd. No. H/HD/965- RN1/32186/78